## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000003063,9000000002461

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు

# ఆంధ్రరమణీమణులు

(మొదటి భాగము)



'ఆంధ్రభూమి' సంపాదకుడు

ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

వ్రాసినది



# విషయసూచిక





# ఉపక్రమణిక

“యత్ర నార్యస్తు పూజ్యంతే నందంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥”

—మనుస్మృతి.

“ఎచ్చట స్త్రీలు పూజింపఁబడుదురో అచ్చట దేవతలు క్రీడింతురు. ఎచ్చట పూజింపఁబడరో అచ్చట అన్ని క్రియలు ఫలములేనివగుచున్నవి.” అని మనువుచెప్పినాఁడు.

మనువు చెప్పినాఁడు. అవును. నిజమే. భారతీయుని కొఱకే.

కాని భారతీయుఁడు స్త్రీని దేవిగఁదలఁచి పూజించు సంగతి విస్మరించి చాలకాలమైనది.

అతఁడు స్త్రీస్వభావమును అనుమానించినాఁడు. అనుమానించి ఆమెను అవమానించినాఁడు. ఇంటి నాలుగుగోడల సందున స్త్రీని అతఁడు ఖైదుచేసినాఁడు; అంధకారమునఁ జెరలాడించినాఁడు.

ఆ పంజరకీరమునకు వంటయిల్లే వైకుంఠమైనది; కుటుంబమే కైలాసమైనది. శ్రమయెఱుఁగక కుటుంబవ్యక్తులను సేవించుటలో నాస్వార్థత్యాగిని జీవితము గడపినది. అంతియే కాని సంఘజీవిక కేపని చేయుటకును ఆమెకు అవకాశము లేక

పోయినది. అట్టిచో నిఁక దేశముమాట తలఁచుటకే వీలులేదు కదా !

విద్యలేక వికాసములేక ఇట్లు పరాభవింపఁబడిన స్త్రీ పతనము నొందినది.

ఫలమేమి కల్గినది ?

పతనమునొందిన స్త్రీ తన జన్మప్రదాయిని; పతనము నొందిన స్త్రీ వహ్నిసాక్షికమగు సఖ్యమున జన్మాంతమువఱకు తన పార్శ్వవర్తిని—అయిఉండఁ బురుషునిబుద్ధికి ఉద్గమనశీల మెక్కడ? ఆతని ఆదర్శములకు ఔన్నత్యమెక్కడ ?

తన తనయులకు ఉద్గమనశీలమగు బుద్ధి ; ఉన్నతమగు నాదర్శము లేకుండుటవలన శతాబ్దులనుండి భారతమాత దైన్యము ద్రవ్వెడు కన్నులతో నధోముఖయైయున్నది.

ఈ ప్రబోధసమయమునందు హిందూదేశమునకు ముఖ్యావసరము లేవి యని సమయశాంఖకుని ప్రశ్నింపుము. దానికి ఆతఁడు విద్యావతియైన తల్లి, విద్యావతియైన భార్య అని ఘోషించును.

జాతి నాగరకతాబీజములను పెంచి పోషించు ఆది శక్తి తల్లి; జాతిమూర్తికి రూపసిద్ధినిచ్చి తన్మహనీయస్థితి నిల్పు శిల్పిని భార్య.

లాలన మెఱిఁగిన తల్లిచేతులతోడనే బిడ్డకు అక్షరాభ్యాసము కావలయును. ముగ్ధమోహనములైన భార్యమాటలతోడనే పురుషునకు ఉత్సాహచైతన్యములు కలుగవలయును.

మాతృదేవి వాక్కులు ప్రేమపూరితము లైనంత మాత్రమునఁ జాలదు; ఆమె సంకల్పములు గంభీరములు గావలయును. అర్ధాంగి చిఱునవ్వు చివురులు దొడఁగినంత మాత్రమునఁ జాలదు; ఆమె దృక్కులు తమోభేదకములు గావలయును.

గృహస్థాశ్రమమున నూతనముగఁ బ్రవేశింపఁబోవు యువకుఁడు సంఘసేవ, సారస్వతసేవ, దేశసేవ, మానవసేవ చేయ నుత్సాహముతో నుఱకలు వేయుచున్నాఁడు.

కాని ఆ ఉత్సాహము అచిరకాలముననే చల్లారిపోవు చున్నది. ఉత్సాహమే చల్లారిపోయిన ఆతని కిఁకఁ గార్యశౌర్య మెక్కడ? ఇట్లగుటకుఁ గారణ మేమి ?

తల్లియు, భార్యయు విద్యావతులు కాకపోవుటయే.

విద్యావతిగాని తల్లికి లాలించు నేర్పేకాని మనశ్శక్తులఁ బెంచు యోగ్యత లేదు. విద్యావతిగాని భార్యకుఁ బ్రేమ చిలికించు తెలివియేకాని చైతన్యము ప్రసాదించు ఉత్సాహము లేదు.

సంఘసేవకుఁడు, సారస్వతార్చకుఁడు, దేశోద్ధారకుఁడు, మానవకళ్యాణమూర్తి కావలసిన యువకుఁడీకారణమున ఆత్మ కుటుంబమును ఆరాధించు పూజారి యగుచున్నాఁడు; ఉత్పథము నుండి యథఃపతితుఁ డగుచున్నాఁడు.

ఏనాఁడు బిడ్డకు అక్షరాభ్యాసముచేయు యోగ్యత తల్లికిఁ గల్గునో, ఏనాఁడు పురుషునకుఁ గార్యశౌర్యము ప్రసాదించు నుత్సాహము భార్యకుఁ గల్గునో ఆనాఁడు భారతయువ

౧

# రుద్రమ్మ

"జనకపాల్యంబైన సామ్రాజ్యమంతయుఁ

దాల్మిమై హస్తగతం బొనర్చి

కాకతీయుల పరాక్రమజీవితంబును

భావరంగస్థలి పాదుకొల్పి

ఆహమికఁజూపిన మహాదేవరాయల

ప్రాంతభూములనుండి పాఱఁదోలి

శిల్పంబులకును దేశీయవృత్తులకును

ద్రవ్యంబు పలుమాఱు ధారవోసి

యాంధ్రులచరిత్రముల కెల్ల ననుపమాన

దీప్తిఁ గూర్చెను రుద్రమదేవిరాజ్ఞి."

—శేషాద్రి రమణకవులు.

క్రీస్తుశకము ౧౨౬౦-వ సంవత్సరమున తెలంగాణము వారికి సర్వగ్రస్తసూర్యగ్రహణము కల్గినట్లయినది, కాకతీయాంధ్రసామ్రాజ్యనియంతయై వెలుఁగొందిన గణపతిదేవచక్రవర్తి దివంగతుఁ డగుటవలన.

రాజ్యభారము వహించుటకు గణపతిదేవచక్రవర్తికిఁ బుత్రసంతానము లేదు. ధర్మపత్ని సోమాంబయం దాతనికి రుద్రమ్మ, గణపమ్మ యను నిరువురు కొమార్తెలు మాత్రము గల్గిరి.

పురుషసంతానము లేనందు కాతఁడు వగవలేదు. ఉచితజ్ఞుఁడగుటచే గణపతిదేవచక్రవర్తి కొమార్తెలకు రణవిద్య, రాజనీతి నేర్పించెను.

జ్యేష్ఠతనయ రుద్రాంబికను కుమారునిగ భావించి రుద్రదేవుఁడని నామ మిడెను. తనయనంతరము రుద్రదేవి ఆంధ్రసామ్రాజ్యభారము వహింపవలయునని చక్రవర్తిఆజ్ఞప్తి. అట్టి ఆదేశమునకుఁ బూఁటకాఁపు మంత్రిమాణిక్యుఁడైన శివదేవయ్య.

౧౨౬౦-వ సంవత్సరమున రుద్రదేవి యోరుగంటిరత్నసింహాసన మధిష్ఠించెను. మంత్రిమణి శివదేవయ్య మంత్రరక్షధ్వజాయమానముగ సాగుచుండెను. రాజ్యభారము పూనుసరికే రుద్రమ్మకు ముమ్మడమ్మయను దత్తపుత్రియు, రుయ్యమ్మయను నౌరసపుత్రియు నుండిరి.

రుద్రమదేవిభర్తనామము వీరభద్రేశ్వరుఁడు. ఈతఁడు చళుక్యవంశీయుడు.

ఈ చాళుక్య వీరభద్రేశ్వరుని తండ్రి ఇందుశేఖరుఁడు; తల్లి ఉదయాంబాదేవి. వీరభద్రునితండ్రి యగు ఇందుశేఖరుఁడు, తాత యగు మహాదేవరాజును మండలాధిపతులుగా నుండిరి. వీరికి నిడుదప్రోలు (ఇప్పటి నిడుదవోలు) రాజధానిగా నుండినది.

వీరభద్రేశ్వరుఁడు 'ధాత్రీభారధురంధరుఁడు' గాఁ గీర్తింపఁ బడినాఁడు. అగుట నతఁడు తాతతండ్రులవలె నిడుదవోలు మండలాధీశుఁడే కాక మామ యగు గణపతిదేవచక్రవర్తిచే విశేషదేశమునకుఁ బరిపాలకుఁడుగా నియమింపఁ బడిన ట్లూహింపవలసి యున్నది.

రుద్రమదేవి కాకతీయాంధ్రసామ్రాజ్యసింహాసన మధిరోహించిన నాఁటికి కీతఁడు మరణించియుండును.

రుద్రమ్మ తనకుఁ దండ్రియిడిన 'రుద్రదేవమహారాజ'ను పురుషోచితనామమునే వ్యవహారమునందుఁ జేకొనెను. ఆమె యెప్పుడును బురుషవేషముతోడనే కొలువుకూటమునకు నేతెంచి మంత్రులతో రాజ్యాంగవిషయములను సమాలోచించుచుండెనని తెలియుచున్నది.

ఓరుగంటి సామ్రాజ్యపీఠము నధిష్ఠించిన ఆఁడుదాని పాదములకుఁ దలలు వంచి జోహారొనర్చి యంకితులై యుండుటకు సామంతమండలేశ్వరుల జాత్యహంకార మొప్పుకొనినది కాదు.

రుద్రదేవిని ఇంటిదొంగలగు మాండలికులు విద్వేషించి కాకతీయాంధ్రసామ్రాజ్యవినాశనమునకు వేగిరపడుచుండిరి.

దేవగిరినుండి యాదవుఁడైన మహదేవరాజు శాత్రవదృష్టుల నోరుగంటిపై నిగిడించుచుండెను.

అబల కాకతీయసింహాసనము నధిష్ఠించిన దనుటతోడనే దక్షిణముననుండి పల్లవులు, చాళుక్యులు, పాండ్యులు దమతమ రాజ్యతృష్ణల నోరుగంటిపయిఁ బ్రాఁకువెట్టుచుండిరి.

గణపతిదేవచక్రవర్తి కత్తిబలమునఁ బ్రోదికొని పెంపొందిన కాకతీయప్రాజ్యసామ్రాజ్యము యథాయథ లగునట్లు పొడఁగట్టెను.

ముంచుకొని వచ్చుచున్న రాజకీయవిషమపరిస్థితులలో నాఁడో మఱునాఁడో పోరు పొసఁగక మానదని దీర్ఘదర్శిని యగు రుద్రమ్మ గ్రహించెను.

ముందుకాఁపుదలకై దుర్గరక్షకు దొరఁకొనెను. శిథిలములైన దుర్గభాగములను బాగుచేయించెను. ఏకశిలానగరము నకుఁ జుట్టును కంపకోట గట్టించెను. దీనికి లోతట్టు మట్టికోటయు, మట్టికోటచుట్టును గొప్పయగడ్తయు నేర్పఱిచెను.

భూమికోటకు గవను లెనిమిది, దిడ్డు పదునెనిమిది. పుట్టకోటకు గవనులు నాలుగు, దిడ్డెనిమిది. రాతికోటకు గవనులు నాలుగు, దిడ్డెనిమిది. రాతికోటకు లోతట్టున రాతిమెట్లు పెట్టించి యలంగముమీఁదఁ జుట్టాలలోని శూరవరుల నుండ విధియించి, తక్కినవారిని రాతికోట లోతట్టుననున్న ఇటుక కోటలో నుండ నియమించెను.

కొమ్మ కిరువురును, బురుజున కేఁబదిమందియు, దిడ్డికి నూర్వురును, గవనున కేనూర్వురును వీరభటులు కాఁపుండునట్లు రుద్రాంబ కట్టడచేసెను.

ఇట్లు దుర్గరక్ష గావించి, చక్రవర్తిని నగరాధ్యక్షుఁడు ప్రసాదాదిత్యనాయఁడు, సేనాని జన్నిగదేవసాహిణి, అమాత్యశేఖరుఁడు శివదేవయ్య వారివారి పనులయం దప్రమత్తులై మెలఁగు నట్లాజ్ఞాపించెను.

దుర్గరక్షణప్రయత్నము లిట్లు ఓరుగంటిలోఁ గొనలు సాగుచుండ దక్షిణమునఁ గాంచీపురరాజు విజయగోపాలుఁడు; చోళులగు మనుమలిదేవమహారాజు, సిద్ధయదేవచోడమహారాజు; పల్లవరాజగు కొప్పెరుంజింగదేవ రెండవ కాడరాయులు మొదలగువారు రుద్రమ్మ యబలయని అలవోకగా నామెపై నొక్కపెట్టునఁ గత్తిదూసి యెత్తివచ్చిరి.

ఈ కల్లోలములోఁ బాండ్యులు తాముగూడ నున్నా మనిపించిరి.

ఈసందడిలోనే సామంతమండలేశ్వరులు పేర్లేఁగి తిరుగుఁబాటు చేసిరి. అందుఁ గర్నూలుమండలపరిపాలకుఁడు రాజేంద్రచోళుఁడు, అల్లాడ పెమ్మయదేవమహారాజు, పరిచ్ఛేది పంద్రాజు, వల్లభరాజు, పెదకొమ్మరాజు అనువారలు చేతులు గలిపిరి.

ఈవిధమున దక్షిణాపథమంతయుఁ గాకతీయసామ్రాజ్యముపై ధ్వజమెత్తి జబరుదస్తీ చేయఁజొచ్చెను.

వీరనారియగుటచే రుద్రమ్మ ఇందు కిసుమంతయు జడియక తనసేనానులగు నాగదేవమహారాజు, జన్నిగదేవమహారాజు, త్రిపురారిమహాదేవరాజు, అంబయదేవమహారాజు మొదలగువారికి హుషారిచ్చెను.

అంబయదేవమహారాజు ఈడులేని మగఁటిమి జూపి పెరుంజింగదేవ కెండవకాడరాయలను నాశనముగావించి; విజయగండగోపాలు నోటుఁబుచ్చి ; మనుమలిదేవమహారాజును, సిద్ధయదేవచోడమహారాజును బరాజితులఁజేసి వారాక్రమించిన భూభాగమును మఱల జయించి ; రాజేంద్రుని దటిమికొట్టి విశాలాంధ్రసామ్రాజ్యమున దక్షిణభాగమునందు శాంతి నెలకొల్పెను.

దక్షిణదేశములం దరాజక మల్లుకొనినసమయముననే కటకివల్లభుఁడు స్వాతంత్ర్యము ప్రకటించెను. గణపతిదేవచక్రవర్తికాలమున సామంతుఁడై కప్పముగట్టుచుండిన కటకవల్లభుఁడు చక్రవర్తిమరణానంతరము కప్పముగట్టుట మాని కాక

తీయసామ్రాజ్యమునుండి చీలిపోవఁజూచెను. ఆతనిని జయించి తిరిగి సామంతునిగఁజేసి ఆతనినుండి కప్పము రాఁబట్టుటకై రుద్రాంబికాదేవి పోతయనాయఁడు, మారయనాయఁడు అను నిరువురు వాహినీధవులఁబంపెను. వారు ప్రతాపించి కటకవల్లభుని బరాజితునిజేసి ప్రతివత్సరము కాకతీయసామ్రాజ్యమునకుఁ గప్పము గట్టునట్లు కట్టడచేసి ఆతనిని మఱల కాకతీయ సామంతమండలేశ్వరునిగ నొనర్చిరి.

ఉత్తరదిశాభాగమునఁగూడ నీరీతిని శాంతిసంస్థాపనము గావింపఁబడియెను.

అంబయదేవమహారాజు, పోతయనాయఁడు, మారయనాయఁడు మొదలగు శౌర్యోపజీవులు విశ్వాసపాత్రులై మాండలికుల నదిమిపట్టి బందోబస్తుచేసి రుద్రమ్మకు జయలాభ మొనగూర్చుచుండిరి.

రణరాగమైన రుద్రదేవి నెదిరించి యెుద్ధారింపఁజాలిన తెంపరితన మింకఁ గొఱవడుటచేఁ బరాజితులైన మాండలికులు దేశద్రోహులై పరాయివాఁడైన దేవగిరిరాజుతోఁ గుట్రలు పన్నఁజొచ్చిరి.

ఇట నోరుగంటిలోఁ గాకతి గణపతిదేవచక్రవర్తి దివంగతుఁడైన సంవత్సరమునందే యట దేవగిరిలో యాదవ ప్రభువు కృష్ణభూపతి మరణించెను.

ఓరుగంటిలో గణపతితనయ రుద్రమదేవియు, దేవగిరిలోఁ గృష్ణభూపతితమ్ముఁడు మహదేవరాజును రాజ్యపాలన మారంభించిరి. అప్పుడే మాళవదేశమున కొకశిశువు రాజగుట సంభవించెను. దేవగిరిప్రభువు మహదేవరా జెప్పుడును స్త్రీలను,

శిశువులను జంపినవాఁడుగాఁడు. అట్లగుట నాతఁడు పట్టాభిషిక్తుఁడగుటవిని యాతని పరాక్రమమునకు వెఱచి యాంధ్రులాఁడుదానిని, నూళవులు శిశువును సింహాసన మెక్కించిరని యాతని యాస్థానకవు లాడంబరముగా శిలాశాసనములలో గానముచేసిరి.

ఆసాయిలవాంగ్రడ స్తోత్రపాఠముల కుత్తరకుమారుని వలె నుబ్బి మహాదేవరాజు తెలంగాణముపై దండెత్తఁ దలఁపుఁ గొనెను. ఈతలఁపులకు తెలంగాణములోని సామంతమండలేశ్వరుల కుట్రలు ప్రాణమువోసెను.

అనేకకష్టముల కోర్చి సంరక్షించి పెంపొందించుచున్న విశాలసామ్రాజ్యమునకుఁ దనయనంతరము నియంత కాఁగల వాఁడు లేకుండుటకు రుద్రమ్మ మిగుల వగచెను.

ఆమె కొమార్తెలగు ముమ్మడమ్మ, రుయ్యమ్మలకు సంతతి లేకుండెను.

ముమ్మడమ్మ చళుక్యాన్వయతిలకుఁడైన మహాదేవ రాజున కిల్లాలు.

ముమ్మడమ్మ రుద్రమదేవి పెంపుడుకూఁతు రని చెప్పి యున్నాము కదా! ఈసందర్భమునఁ దెలిసికొనవలసిన విషయములు మఱికొన్ని యున్నవి.

రుద్రమదేవి రుద్రదేవమహారా జను పురుషోచితనామమును వహించి, కొలువుకూటమునకుఁ బురుషవేషముతోడనే వచ్చుచుండెడిదని తెలిసికొని యున్నాము.

శత్రురాజులకు రుద్రదేవిపురుషభావముపట్ల నమ్మిక కలుగుటకు నగరాధ్యక్షుఁడైన ప్రసాదాదిత్యనాయఁ డొక

కన్యను దెచ్చి రుద్రదేవికి వివాహము చేసెను. ఆకన్యయే ముమ్మడమ్మ.

ముమ్మడమ్మకుఁ గాలక్రమమున యథార్థ మంతయుఁ దెలియవచ్చినది. కాగా రుద్రమదేవి యామెను బుత్రికాభావముతోఁ దిలకించుచుఁ జళుక్యాన్వయతిలకుఁడును, నిరవద్యపురా (నిడదవోలు) ధీశ్వరుఁడును నగు మహాదేవరాజున కిచ్చి వివాహముచేసెను.

ఈ మహాదేవరాజు రుద్రదేవిభర్త యగు చళుక్య వీరభద్రేశ్వరునకు సోదరుఁ డని కాకతీయాంధ్రరాజయుగచరిత్రకారుని యూహ. ఈయూహ నిజమగునేని రుద్రదేవి తాను పెంపుడుకూఁతురుగా భావించిన ముమ్మడమ్మను దన మఱఁది కిచ్చి వివాహము చేసి, యాదంపతులకు జనించిన ప్రతాపరుద్రునికి సామ్రాజ్యమును సంక్రమింపఁ జేసినదని నిర్ధరింపవలసి యుండును.

రుద్రమ్మ ఔరసపుత్రియైన రుయ్యమ్మ యిందులూరి అన్నమదేవ భూపాలుని సతీమణి. ఈయన్నమదేవ భూపాలుఁడు దనయన్నయైన కొలని రుద్రమనాయని సాహాయ్యమున రాజమహేంద్రవరము మొదలు సింహాచలపర్యంతముగల తెలుఁగు మాగాణిని జయించి రుద్రదేవికిఁ గుడిభుజమై రాజ్యమేలెను.

అత్తయగు రుద్రదేవికాలమున, వదినె కుమారుఁడగు ప్రతాపరుద్రచక్రవర్తికాలమున నీ యన్నమదేవభూపాలుఁడు కాకతీయపాలనమున మహోన్నతపదవిని వహించెను. ఈతని తండ్రియుఁ, బెదతండ్రియు గణపతిదేవచక్రవర్తివద్ద సేనాపతులుగా నుండిరి.

ప్రథమతనయయగు ముమ్మడమ్మ కీశ్వరాంశసంభూతుఁడైన కుమారుఁ డుదయించుకొఱకు రుద్రమ్మ యామెచే నెన్నియో నోములు నోమించి; తమయిలవేల్పును, కులదేవతయునగు కాకతమ్మకు జాతరలు సలిపి; వర్ధమాన గణపతి దేవునకు, మొగిలిచెర్ల యేకవీరా దేవికి, ఐనవోలు మైలారు దేవునకుఁ బూజాపురస్కారములు నెఱవేర్చి మ్రొక్కుబళ్లు చెల్లించుటకై యోరుగంటినుండి బయలుదేరి వెళ్ళెను.

రుద్రమదేవి నగరవినిర్గతయైయున్న దినములలో నామె జ్ఞాతులైన హరిహర దేవమురారి దేవులు తగు పరివారముతో, బంధువర్గముతో రాజధానీనగర ప్రవేశము నొనర్చి ద్వారములు బిడాయించి ఆమెను మఱల నగరము చొరనీయరైరి.

జనానురాగమును జూఱలాడి ప్రియవాదిత్వముతోఁ బ్రజాపాలన మొనర్చిన దగుటచే రుద్రమదేవి యా ప్రజలును, మంత్రివరులును జేదోడురాఁగా సునాయాసముగఁ బురప్రవేశ మొనర్చి హరిహరమురారి దేవులను బుత్రమిత్రసహితముగఁ దునిమించి, వారియైశ్వర్యమంతయుఁ గొల్లగొని దానితో నోరుగంటిలోని పద్మాక్షీ దేవికి మహోత్సవములు చేయించెను.

కాలుసేతులు గూడఁదీసికొనుటకుఁ దీరికలేని యీసందడి సమయముననే రుద్రమ్మపై దండెత్తివచ్చుట సమయజ్ఞతయని దేవగిరినుండి మహాదేవరాజు మూఁడులక్షల సైన్యముతోఁ బ్రయాణభేరి మ్రోయించెను. రుద్రమ్మ మహోత్సవముల సందడిలోఁ బర్యాప్తయైయున్నదిగావుననే మహా

దేవరాజు నేరుగా వచ్చి యోరుగల్లు ముట్టడించుటకు వీలు చిక్కినది.

అప్పుడు రుద్రమ్మదేవి భద్రకాళివలెఁ బ్రతాపించి వెలమసేనాని యగు రుద్రమ్మనాయఁడును, కమ్మసేనానియు నగరపాలకుఁడును నగు నాగన్నయుఁ దోడునీడలై యుండఁ బదునైదుదినములు ఘోరయుద్ధము చేసెను.

తెలుఁగుజోదులఁ దీవ్రధాటికి నిలువఁజాలక యాదవులు వెనుకంజ వైచి వెన్నిచ్చిరి.

రుద్రమ్మదేవి యాదవుల నంతతో విడువక తానె నాయికాత్వము పూని వెన్నంటి పట్టి పోకార్చి దేవగిరివఱకుఁ దఱిమిదఱిమి కొట్టెను.

మహాదేవరాజున కప్పటికిఁ దాఁ జేసిన యవివేకకృత్యమునకుఁ బశ్చాత్తాపము గల్గినది. అట్లగుట నాతఁడు రుద్రదేవిని శరణువేఁడి కోటిద్రవ్యము లపరాధముగ నిచ్చి సంధిగావించుకొనెను.

అప్పు డాంధ్రచక్రవర్తిని తనరాజ్యమునకు మహాదేవరాజురాష్ట్రమునకును సరిహద్దుల నేర్పఱచి, యచ్చట జయస్తంభములఁ బ్రతిష్ఠించి, వానిపై 'రుద్రదేవమహారాజు' అను పేరుతో విజయశాసనములఁ జెక్కించెను.

శౌర్యనిధులగు నాంధ్రసైనికుల కామె యేఁబదిలక్షల హొన్నులఁ గానుక పెట్టెను.

ఇట్లు రాజ్యకల్లోలముల గలఁకఁ దేర్చి, రాజకీయవిషమపరిస్థితులఁ జక్కఁబఱచి రుద్రమ్మ తన ప్రభుత్వకాలశేషమును బ్రజోపయోగకార్యములకై వినియోగించెను.

తన తండ్రిపద్ధతి ననుసరించి యామె సముద్రవ్యాపార విస్తృతికిఁ బ్రోత్సాహ మిచ్చెను.

ఆమెకాలమున సన్నబట్టల వర్తకమును, రత్నముల వ్యాపారమును విరివిగ జరుగుచుండె ననుటకు 'మార్కోపోలో' వ్రాఁతలు ప్రబలనిదర్శనములు.

మతవ్యాప్తికి రుద్రమ చేయూఁత నొసఁగెను. ఆకాలము నందలి శివాచార్యులలో నగ్రగణ్యుఁడైన విశ్వేశ్వర శంభువునకుఁ గ్రీస్తుశకము ౧౨౬౧-వ సంవత్సరమున మందర గ్రామమును, తదనంతరము వెలగపూఁడిగ్రామమును ధారాదత్తము చేసి రుద్రమ్మ తన శైవమతాభినిరతిని వెల్లడించెను.

రుద్రమదేవి చక్రవర్తిని కాలమున వైద్యమును, తర్కశాస్త్రశాగమములును, సంగీతమును బ్రత్యేకముగఁ బ్రవృద్ధము లగుచుండిన వనుటకు శాసనాధారములు గలవు.

రుద్రమదేవి చేసిన సత్కార్యములను 'సోమదేవరాజీయ' మను గ్రంథ మిట్లు కీర్తించుచున్నది :

"ప్రోల ననేకశివాలయంబులు శివిఁ
గట్టించె, బయలి యంగణములందు
నానామహీరుహోద్యానముల్ వేయించె,
నైదువేల వసుంధరామరులకుఁ
బెండ్లిండ్లు సేయించె, పృథివి నాలుగుకోట్ల
ద్రవ్యంబు పాతించె, తవిలి పెక్కు
చెఱువులు త్రవ్వించె, చెప్ప నబ్రంబుగ
నన్నసత్రంబు లెన్నైనఁ బెట్టె,

అఖిలజనులును తను నంబయనుచు సారె
పలుకుటయెఁ దనపేర 'నంబాల' యనెడు
నూరు కట్టించి నిజమైన వేర వేయి
రుద్రవరములు కట్టించె రుద్రమాంబ.''

రుద్రమ్మ రణవిద్య నేర్చిన వీరాంగన ; రాజనీతి యెఱిఁగిన విదుషి. అట్లగుట నామె ధైర్యసాహసములును, రాజ్యతంత్రనైపుణ్యమును నెఱపి సామ్రాజ్యమును సంరక్షించెను.

శౌర్యోపజీవులైన వెలమవారును, కమ్మవారును తమ ప్రాణములను సామ్రాజ్యక్షేమమునకు బలిపెట్ట సంసిద్ధులైయుండిరి. శివదేవయ్య రుద్రపెగడలు మహామంత్రులై మంత్రరక్ష గావించుచుండిరి.

కావుననే రుద్రమ్మ కాకతీయాంధ్రసామ్రాజ్యమునకుఁ జక్రవర్తినియై ముప్పదియైదు సంవత్సరములు శత్రుభయంకరముగ, జనరంజకముగఁ బరిపాలనము జేసెను.

ఆమె ప్రజ్ఞావివేకములకు, న్యాయానురాగమునకు, ధర్మాభిరతికి, శాంతిప్రియత్వమునకు, రాజ్యపాలనాకౌశల్యమునకు ఖండాంతరవాసుఁడును, విజాతీయరాయబారియు నైన మార్కోపోలో యోగ్యతాపత్రము సమర్పించి యున్నాఁడు.

ముమ్మడమ్మకు నొక శుభముహూర్తమునఁ గుమారుఁడు గలిగెను. రుద్రమదేవి మనుమనికిఁ బ్రతాపరుద్రుఁ డని పేరిడెను. ఒకటిరెండేండ్లు గడచిన తరువాత ముమ్మడమ్మ యన్నమదేవుఁ డను మఱియొక పుత్రుని గనియెను.

రుయ్యమ్మకు సంతతి గలుగనే లేదు. అప్పుడు రుద్రమ్మ తన రెండవయల్లుఁడైన అన్నమదేవభూపాలుని అనుమతి వడసి

ప్రతాపరుద్రుని కొమరునిగఁ జేకొని యాతఁడు చేతి కంది వచ్చినఁ బిదప త్రిలింగసామ్రాజ్యమునకుఁ బట్టభద్రుని జేసెను. రుద్రమదేవి క్రీస్తుశకము ౧౨౯౫-వ సంవత్సరమునఁ బరమ పదము నొందెను.

సుల్తానా రజియా చరిత్రకును, రుద్రమదేవి చరిత్రకును గొంత సారూప్యము జతపడుచున్నది.

రజియా రుద్రమదేవు లిరువురును క్రీస్తుశకము పదమూఁడవ శతాబ్దిని వివిధప్రాంతము లందు రాజ్యమేలిన రమణులు. తండ్రియైన గణపతిదేవు నాదేశము ననుసరించి రుద్రమ్మ కాకతీయసింహాసన మధిష్ఠించి నట్లే తండ్రియైన ఆల్తమషు నాజ్ఞప్తి ననుసరించి రజియా దిల్లీసింహాసన మెక్కెను.

దిల్లీసింహాసన మెక్కిన స్త్రీ రజియా యొక్కతియే. ఓరుగంటిసింహాసన మధిష్ఠించిన స్త్రీ రుద్రమ్మ యొక్కతియే.

రజియా రుద్రమ్మ లిరువురును పరాక్రమశీలలు. వారి కార్యకౌశల్యమును, శౌర్యమును జూచిన యెడల వారు స్త్రీరూపములు స్వీకరించిన పురుషులే యన నగునని సమకాలిక చరిత్రకారులు వ్రాసియున్నారు. రజియా రుద్రదేవు లిరువురును బురుషవేషముల తోడనే రాజసభ నలంకరించి రాజ్యతంత్రము నడపినవారు.

రాణి రుద్రమ్మ పాదముల కంకితులై యుండుటకుఁ గాకతీయమండలేశ్వరులు వెగటొంది కుట్రలు పన్నినట్లే, రాణి రజియా పాదముల కంకితులై యుండుటకు ముహమ్మదీయ సరదారులు కంటగించుకొని కుట్రలు పన్నిరి.

అయితే తండ్రి నియమించిన మంత్రులను మన్నించి వారి తోడ్పాటున రాజనీతివిశారద, వివేకమహిత, రణరాగ మైన కాకతి రుద్రాంబ మండలేశ్వరులఁ గాకుఁజేసి మాఱులేక రాజ్యపాలనము చేయ రజియా తన ప్రీతిపాత్రుఁడైన యొక యబిసీనియను బానిసవాని కధికార మిచ్చి, విశ్వాసపాత్రులైన ఖానులను ద్రోసిరాజని యందుపై నెసరేఁగిన ఖానుల యౌద్ధత్యము, విజృంభణము నరికట్టఁజాలక యుద్ధమునఁ బట్టువడి రాజ్య మెట్లయిన నిలబెట్టుకొనుటకు వైరితో మనువును జిత్తగించియుఁ, దుదకుఁ గృతకృత్యురాలు కాలేకపోయెను.

కావుననే రజియా పరిపాలనము క్రీస్తుశకము ౧౨౩౬-వ సంవత్సరము మొదలుకొని ౧౨౪౦-వ సంవత్సరము వఱకు మాత్రము నడచి నాలుగుసంవత్సరముల నవ్వులాట యైనది. ఆంధ్రరాజ్ఞి రుద్రమ్మ పరిపాలనమన్ననో క్రీస్తుశకము ౧౨౬౦-వ సంవత్సరము దొట్టి ౧౨౯౫-వ సంవత్సరము వఱకు ముప్పదియైదుసంవత్సరములు నిరాఘాటముగ కొనలు సాగినది.

"తన రాజ్యసీమానితంబముల్ దాఁట శ
త్రులఁ బాఱఁద్రోలిన రుద్రమాంబ
తెలుఁగుదేవళముల వెలుఁగుచు నున్నది
మలఁగిపోక చుక్కమాడ్కి, దీక్ష
వీరవాసరముల నారాధనము సల్పుఁ
డమృతయోగదీప్తు లలమ సతులు."

—రాయప్రోలు సుబ్బారావు.

౨

# గణపమ్మ

"ఈయింతి ప్రియభాష లెల్ల పెద్దలకును
పరమానురాగసంపాదకములు
ఘూయింతి హస్తాబ్జ మెల్లబంధువులకు
లలితకల్పద్రుమఫలితశాఖ
యీయింతివర్తనం బెల్లయింతులకుఁ బ
తివ్రతాచారోపదేశకర్త
యీయింతి మందిరం బిందిరాదేవికి
సతతమనోజ్ఞవిశ్రామభూమి."

గణపమ్మ మహితప్రతాపుఁడైన కాకతి గణపతిదేవుని రెండవకూఁతురు; రుద్రాంబ చెల్లెలు; కోట బేతరాజు ఇల్లాలు.

ఆమె ధర్మానురక్తి, పతిభక్తి, పితృప్రేమ గలిగి వఱలిన రమణీమణి.

పతి యనంతరము ధరణికోట మండలము నేలి గణపమ్మ రుద్రాంబవలెనే ప్రజాపాలనాపరిజ్ఞానపాటవము నవదరించిన విదుషీమణి.

త్రిలింగసామ్రాజ్యసంస్థాపనార్థము వీరాగ్రేసరుఁడైన గణపతిదేవచక్రవర్తి వెలనాటిపై దండెత్తి వెళ్ళి అచ్చటి రాజుల నోటుపుచ్చి యాభూభాగమును దనరాజ్యమునఁ జేర్చుకొనియెను. అప్పుడు మఱియొక యుపద్రవము కలుగకుండ వెల

నాటిప్రాంతమునఁ గాకతీయరాజ్యము స్థిరపడుటకై తన రెండవ కొమార్తయైన గణపాంబాదేవిని, ధరణికోటరాజును, మహామండలేశ్వరుఁడును నైన రుద్రదేవరాజు సుతుఁడు బేతరాజున కిచ్చి పెండ్లిచేసెను.

వివాహకాలమునాఁటికే బేతరాజు వీరాగ్రగణ్యుఁడుగా, బలపరాక్రమశాలిగా విశేషయశము నార్జించెను. అతని అర్ధాంగి గణపమ్మ వేయించిన దానశాసనమం దొక దానియం దతఁడు 'తేజోధ్వస్తాఖిలరిపుతమః' డనియు, 'క్షితిధరలసన్మస్తకన్యస్తపాదుఁ' డనియుఁ బేర్కొనఁబడినాఁడు.

గణపమ్మ, బేతరాజుల వివాహము కేవలము రాజకీయ వివాహముగఁ జూపట్టుచున్నను చుట్టరికము ప్రాఁతదియే.

గణపతిదేవచక్రవర్తికి మైలమ్మ యను సోదరి గలదు. ఆమె నతవాటిసీమపాలకుఁ డైన రుద్రరాజును బరిణయమై యెనమంద్రు కుమారులను, బయ్యలమహాదేవియను కొమార్తెను బడసెను.

బయ్యలమహాదేవి ధరణికోటప్రభువైన కోట కేతరాజును వివాహమై రుద్రరాజను పుత్రుని గనెను. గణపాంబ పెనిమిటి యైన బేతరాజీ రుద్రరాజుతనయుఁడు. అట్లగుట కోట బేతరాజు గణపతిదేవచక్రవర్తికి మేనగోడలి మనుమఁ డన్నమాట. కూఁతు నిచ్చి పెళ్లిచేయుటచే మేనగోడలి మనుమఁడు అల్లుఁడు గూడ నయ్యెను.

ఈవిషయము సులభగ్రాహ్య మగుటకు వంశవృక్షము తీయఁబడు చున్నవి.




కోట రుద్రరాజు ననంతరము ధరణికోటరాజ్యమునకు బేతరాజు జేలికయై మహామండలేశ్వరుఁ డని పేరొందెను. బేతరాజు వీరుఁ డగుటచే మామయైన గణపతిదేవచక్రవర్తికిఁ జైత్రయాత్ర లందుఁ జేదోడై జయసంపాదన మొనర్చుచుండువాఁడు. కాని పాప మాతనికి వయస్సు మీఱకముందే యాయుర్దాయము చెల్లిపోయినది.

చేతరాజునకు సంతానములేదు. కాగా చేతరాజు మరణించిన పిదప కోట గణపాంబామహాదేవి ధరణికోటమండలమునకుఁ బాలకురాలయ్యెను.

జీవించియుండఁగా చేతరాజు తఱచు కార్యాంతరమున దేశాంతరములం దుండువాఁడు. అట్టి సమయములందు ధరణికోటరాజ్యమును గణపాంబామహాదేవి సమర్థతతోఁ బాలించుచుండునది. తన దానశాసనములం దీ సంగతిని గణపాంబ స్పష్టీకరించి యున్నది.

గణపమ్మ కృష్ణానదికి దక్షిణమున నున్న అఱువేల గ్రామములకు రాణియై ప్రభుత్వము నెఱపెనని యొనమదల శాసనము చాటుచున్నది.

ఆమె దానశాసనములు క్రీస్తుశకము ౧౨౭౮-వ సంవత్సరము వఱకుఁ గనిపించుచున్నవి. ఓరుగల్లుపురమునుండి సోదరి రుద్రాంబ కాకతీయాంధ్రసామ్రాజ్యపరిపాలనము సాగించుచుండ గణపాంబ ధరణికోటనుండి తన సామంతమండలమును బరిపాలించి ప్రజల మెప్పువడసెను.

గణపమ్మ దానశీల. ధాన్యకటకము (ధరణికోట) లోని అమరేశ్వరాలయగోపురమున నుంచుటకై ఆమె సువర్ణకలశమును దానము చేసెను. అనేక దేవాలయముల కామె యగ్రహారములు దానము చేసి దాననిరతిని వెల్లడి చేసెను. విప్రవరుల కామె యొనర్చిన దానములకు లెక్కలేదు. ఆమె ధనకటకపురిలోఁ బండ్రెండుగురు బ్రాహ్మణోత్తములకు భూవసతులను గల్పించి గృహములను దానము చేసెనని యొనమదల శాసనము చెప్పుచున్నది.

రుద్రమ్మవలెనే గణపమ్మ రాజనీతివిశారద. రాజనీతిని బాటించి మొనమదలపరగణాలోని యిరువదిగ్రామముల మీఁద నామె యొకసారి పన్ను దీసివైచెను.

ఇట్లు పన్ను దీసివైచుటచే బొక్కసమునం దర్థసంపత్తి లోటువడును. కాని రాజ్యక్షేమము నుపలక్షించి రాజకీయ వేత్త లపుడపు డిట్టిపద్ధతి నవలంబించుట కలదు. క్రీస్తుశకము ౧౧౩ మొదలు ౧౩౮ వఱకు నిరువదియైదుసంవత్సరములు ధరణికోటరాజధానిగా శాతవాహనరాష్ట్రమును బరిపాలించిన గౌతమిపుత్రశాతకర్ణి విదేశీయులైన శకయవనరాజు లెత్తి వచ్చినపు డదివఱకే వచ్చి స్వదేశస్థులతోఁ గలసియుండిన విదేశీయులు రాజద్రోహము దలపెట్టకుండుటకై వారిపై శాస్త్రీయముగ విధించిన పన్నులఁ గూడఁ దీసివేసెను.

అట్లే గణపమ్మయు రాజనీతిని బాటించి తనమండలమునం దొకపరగణాలోఁ బన్నులను దీసివేసెను.

గణపమ్మ పతిభక్తిపరాయణ. కావుననే పరమపదము నొందిన ప్రాణనాథుని ఆత్మకు శాంతిని గోరి ఆమె శివాలయము నొకదానిని నిర్మించి యందుఁ దన భర్తపేర బేతేశ్వరనామముతో లింగప్రతిష్ఠ గావించెను. ఈబేతేశ్వరాలయగోపురమునందు గణపమ్మ కనకకలశమును నిర్మించెను. ఇంతటోఁ దనివి నొందక ఈయాలయము చిరకాలము వెలయుటకు ధనధాన్యసమృద్ధమగు 'బెనదేవి' యను గ్రామమును ధారాదత్తము చేసి దానశాసనము వ్రాయించెను. ఆత్మేశుని కీర్తికాయము

నకుఁ జిరంజీవిత్వమును, అతనికి సుగతియు సంపాదింప దేవాలయప్రతిష్ఠ గావించిన గణపాంబ పతిభక్తిపరాయణత మిక్కిలి శ్లాఘనీయమైనది.

గణపాంబ పతిభక్తియే కాక పితృప్రేమ గూడ మెచ్చఁదగిన విషయము. తండ్రి యశశ్శరీర మనశ్వరమై వెలయుట కామె గణపతిదేవచక్రవర్తి పేర గణపేశ్వరశివాలయమును నిర్మించి దాని సంరక్షణమునకై 'చింతపాడు' అను గ్రామమును దానము చేసెను.

రుద్రమ్మకు వలె గణపమ్మకును శైవమతాభినిరతి మెండు. అట్లగుట నామె యెక్కడ ప్రతిష్ఠించినను శివాలయములనే నిర్మించెను. గణపమ్మ తనకడకాలమును మహేశ్వ ధ్యానముతోఁ గడపెను.

గణపాంబాదేవి రాజ్యపాలనాదక్షత, దానశీలము, పతిభక్తి, పితృప్రేమయు నామెను ఆంధ్రపురంధ్రీమతల్లులలో నొకతెనుగా స్మరించుటకుఁ గారణములు.

గణపమ్మ కీర్తిగీతము నెనమదలశాసన మిట్లు ముగించుచున్నది :

'గణపాంబాదేవి తనహస్తములు సతతము శివుని యర్చించుటయందే వినియోగించెను; శివుని మాహాత్మ్యమును బ్రకటించు శ్లోకములే యామె కానందసంధాయకములు, ఆమె వేదములందు విశ్వాసముగల మహనీయురాలు. కావుననే

విశాలరాజ్యక్లేశము గలిగియున్నను ఆనందముతో నామె దినములు గడపెను. రెండవపార్వతి యనఁదగిన గణపాంబ మాహాత్మ్యము నెవ రుచితరీతిని వర్ణించి కీర్తింపఁ గలరు?

> "యద్ధస్తౌ హరపూజనైకనిరతౌ
> యస్యాశ్చదృష్టి శ్రుతీ
> శంభోరన్వహకారితోత్సవఁలస
> త్సంగీతసక్తౌసదా
> ఇత్థంయాదివసాంసుఖంగమయతే
> ప్రాజ్యేపిరాజ్యేస్థితం
> తన్నూనం గణపాంబికా గిరిసుతా
> తస్యాస్తుతౌ కః ప్రభుః."

—ఎనమదలశాసనము.

# 3

# నాగమ్మ

"బిరుదులందిన రాచబిడ్డల బొమ్మల
చాయ నాడించిన నాయకమ్మ"

—రాయప్రోలు సుబ్బారావు.

హిందూదేశచరిత్రపాఠకులకుఁ బరిచితురాలైన నూర్జహాను తొలుతఁ గూడికి గుడ్డకు మొగమువాచిన ఒక పారశీక దేశస్థుని కూఁతురు. తల్లిదండ్రులు చేతఁ బైసాలేని కటిక దరిద్రులగుటచే నూర్జహానును బెంచలేక ఆమె నెలగ్రుడ్డుగా యుండఁగా నొక రోడ్డుప్రక్కను విడిచి పెట్టిరి.

వర్తకుఁ డొకఁ డామెను జేరఁదీసి పెంచి పెద్దదానిని జేసెను. అతిరూపవతియై ఆమె కాలక్రమమున అదృష్టరేఖ బయలుపడుటచే మొగలాయిచక్రవర్తి జహంగీరున కర్ధాంగి యయ్యెను. ధనమూలమైన ఈజగత్సూత్రమునందు పేదవారికి సయిత మదృష్టదేవతాప్రసాదము గల్గినచో నున్నతస్థానము సమకూడు నని నూర్జహానుచరిత్ర చాటుచున్నది.

ఆంధ్రరమణి నాగమ్మచరిత్ర గూడ నీవిషయమునే వెల్లడించుచున్నది.

పల్నాటిసీమయందు నాగులేటియొడ్డున జిట్టగామాలపాడను నొకగ్రామమున చౌదరి రామిరెడ్డి యను బీదరైతు ఒక నాఁడు తనపొలములోఁ బని జేసికొనుచుండెను.

అప్పుడు దగ్గఱనున్న కంచెలో నుండి యాతనికి శిశురోదనము వినిపించెను. పోయి పరిశీలింపఁగా రామిరెడ్డి కాకంచెలో నొకస్త్రీశిశు వగపడెను. అతఁ డాశిశువు నింటికిఁ దీసికొని వెళ్లి నాగమ్మ యని పేరుపెట్టి పెంచుచుండెను.

నాగమ్మ రామిరెడ్డియింటికిఁ గొనిరాఁబడిన నాఁటి నుండియు నా బీదరైతు నిల్లు పాడిపంటలకు నెలవై సిరిసంపదలతోఁ దులఁదూఁగ నారంభించెను. అంతియేగాక యాతని కాదినములలో విశేషధనముగల పాతు దొరకెను. అందుతో రామిరెడ్డి విశేషవిత్తవంతుఁ డయ్యెను కన్నబిడ్డవలె గారాబముతోఁ బెంచి పెద్దదానిని చేసి రామిరెడ్డి నాగమ్మను ధనవంతుఁ డగు నొక వరున కిచ్చి వివాహముచేసెను.

ఆమెభర్తను గుఱించి కాని, అత్తవారిని గుఱించి కాని మన కేమియుఁ దెలియవచ్చుట లేదు. కాని ఆమె యింటిపేరరవల్లివా రని వాడుక గలదు. ఇది తల్లిగారి యింటిపేరో యత్తవారి యింటిపేరో తెలియదు.

నాగమ్మ చిరకాలము సంసారసుఖ మనుభవింప లేదు. తనయాస్తి యంతయు నామెకు దిగ విడిచి నాగమ్మపెనిమిటి వివాహమైన కొలఁదికాలముననే కాలధర్మము నొందెను. కొంతకాలమునకు రామిరెడ్డి కూడ మరణించెను. అప్పు డాతని ఐశ్వర్యమంతయు నాగమ్మకే దఖలుపడియెను.

తలవని తలంపుగా నామె యదృష్టవశమున నధికైశ్వర్యమును బొంది పల్నాటిసీమ యం దొక ప్రముఖురాలయ్యెను.

నాగమ్మ శక్తిమతి. అందులో నిప్పు డామె నిజశక్తికి ఐశ్వర్యబలము తోడైనది. ఇంక నామెకోరికలు క్రేళ్లు దాఁటి నవి. అట్టి కోరికలలోఁ బల్నాటిరాజ్యమున మంత్రాంగము నడపవలె ననునది ముఖ్యమైనది.

ఈ ప్రధానవాంఛాపరిపూర్తికిఁ బదనైన అదనుకొఱ కామె నిరీక్షించుచుండెను.

అది కాకులు దూరని కారడవి. ఒకనాఁడు పల్నాటి ప్రభువైన నలగామరా జాయరణ్యమున వేఁటాడ సపరివార ముగఁ బోయెను, నిప్పులు చెరుగు మిడియెండలో నందం దడవి జంతువుల వేఁటాడి యలసిసొలసి వేఁటఁ జాలించి విశ్రమింపఁ దగిన తావును, దప్పి మాన్పుకొనఁ దగిన నీరమును వెదకి కొనుచు నలగామభూపతి వచ్చుచుండెను.

ఆయరణ్యమార్గమునఁ జలువలు చిమ్ము చెట్టునీడలఁ గ్రొత్తగాఁ బందిళ్లు పాకలు వేయఁబడియుండెను. అందు స్నానము చేయుటకు వేఁడినీళ్లును, త్రాగుటకు మంచినీళ్లును సమకూర్పఁబడి యుండెను. ఉప్పుతోఁ దొమ్మిది భోజనపదా ర్థము లందు కొల్లలుగ నుండెను. ఆపర్ణకుటీరములకు ముందరి భాగమునం దొక యతివ నిలుచుండి యెవరికోసమో యెదురు తెన్నులు చూచుచుండెను.

ఇంతలో నలగామభూపతి సపరివారముగ నచ్చటికి వచ్చెను. అప్పు డాయతివ నలగామరాజు నాహ్వానించి తన ఆతిథ్య మంగీకరింప వేఁడుకొనెను. బడలికలుగొనియున్నవాఁడు గావున నలగామరాజు సంతోషపూర్వకముగ నామె యాతిథ్య

మును గైకొనెను. అప్పు డాయతివ వారికిఁ బిండివంటలతో నన్నము పెట్టెను.

అర్ధ్యాన్నపు టరణ్యమునడుమఁ దమ కట్టి సమయమునం దట్లు షడ్రసోపేతముగ భోజనము పెట్టి బడలికలు వాపిన ఆస్త్రీ నుద్దేశించి నలగామఁ డేదియేని వరము కోరుకోన వల సిన దని చెప్పెను. ఆమె యందు కానందించి యాతనికి మా ఱుగాఁ బల్నాటిసీమకుఁ దాను గొన్నిగడియలు ప్రభ్వియై యుండ ననుజ్ఞ నీయవలసినదని కోరెను.

ఆమె యిచ్చిన ఆతిధ్యమునకు సంతోషము, చేసిన సపర్యలకు సంతృప్తి నొందిన నలగామఁ డాకోరిక యెట్టిదై నను దాని కొప్పుకో లీయకుండ నుండలేక పోయెను. ఘోరా రణ్యమధ్యమునం దనుకున్నంతఁలోఁ బందిళ్లు వేయించి భోజన పదార్థములు సేకరించి విశేషజనములకు మృష్టాన్న మిడి నల గామభూపతిచే వరమును గొన్న ఈశక్తిమతి యెవ్వరు?

ఆమె దృఢసంకల్పయగు నాగమ్మయే యని సులభము గనే గ్రహింపవచ్చును. పల్నాటిప్రభువైన నలగాముని వశం వదునిగఁ జేసికొని ఆతనియొద్ద మంత్రిణీత్వము సంపాదింప నాగమ్మ పన్నిన యెత్తుగడ యిది.

నలగామఁ డట్లు వనమున బడలికలు వాసి కదలి నిజ రాజధానియగు గురిజాలకు వచ్చి చేరెను.

కొన్ని దినములు చనిన పిమ్మట నాగమ్మ నలగాముని దర్శించి వాగ్దానముప్రకారము ప్రభుత్వమును వశపఱుప వల సినదని కోరెను. వల్లెయని నలగామరాజు పలనాటిప్రభుత్వము నామె కప్పగించెను.

ఆ కొలఁదిగడియలలో నామె తనపరివారమున కుత్తరు విచ్చి గ్రామములను దోఁపించి విశేషధనమును దెప్పించి సత్పరి పాలనము నెఱపవలెనన్న నిట్లు ధనాగారమును నింపవలె నని హెచ్చరించెను.

అంతియేగాక ఆమె యాసమయముననే నలగామ రాజుతో నాతని మంత్రియగు బ్రహ్మనాయఁడు ద్రోహచింత గలవాఁ డనియు, విశ్వాసవిహీనుఁ డనియు, మోసగాఁడనియుఁ గొండెములు చెప్పెను. రా జామాటలు విశ్వసించి బ్రహ్మనా యని యెడ విరసత్వము వహించెను; నాగమ్మను మంత్రిణిగఁ జేకొనియెను.

ఆమె యసదృశముగ మంత్రాంగము నెఱపఁ దొడఁ గెను. నాగమ్మ బుద్ధిని, ప్రజ్ఞను జూచి జను లామెను నాయకురా లని పిలువఁ జొచ్చిరి. అప్పటినుండియు నామె నాగమ్మ యని కాక విశేషముగ నాయకురా లనియే వ్యవహరింపబడుచుండెను.

నాగమ్మమంత్రాంగ మంతటితోఁ దుదముట్ట లేదు. నల గామరాజు సవతితమ్ములగు పెద మలిదేవరాజు, పిన మలిదేవ రాజు, బాల మలిదేవరాజుల పై నాతనికిఁ బ్రేమను దొలఁ గించి, యసూయను బుట్టించి వారిని జంపింపఁ బ్రయత్నించెను.

బ్రహ్మనాయనితల్లియైన శీలమ్మ మలిదేవాదులను మృత్యు ముఖమునుండి తప్పించి కుమారునివశము చేసెను. బ్రహ్మనాయఁ డాబాలురను దగ్గఱకుఁదీసెను.

నాయకురాలిచేతులలోఁ గీలుబొమ్మవలె నుండిన నలగా మునివద్ద మంత్రిత్వమువహించి పొంది పొసఁగి యుండుట కింక వీలు లేదని నాయఁడు గ్రహించెను. గురిజాలయం దుండుట

మలిదేవాదులకు సయితము క్షేమము కాదని ఆతఁడు నిశ్చ యించెను. కావున బ్రహ్మనాయఁడు మలిదేవాదులకుఁ బలనాటి రాజ్యములోఁ గొంతభాగము నిప్పించి గురిజాల విడిచి పెట్టి మాచర్ల యను పట్టణమును గట్టించి వారల నచ్చటికిఁ గొని పోయి వారు యుక్తవయస్కులు కానందున వారికి బదులు తానే పరిపాలనము సేయుచుండెను.

మాచర్ల రాజధానిగా బ్రహ్మనాయఁడు పలనాటి రాజ్య భాగమును సమర్థతతోఁ బాలించి జనానురాగమును జూఱ లాడుచుండెను. ఆతని కీర్తికి, వైభవమునకుఁ గొలఁది లేకుండెను.

బ్రహ్మనాయఁడు నలగామరాజువద్ద మంత్రిపదవి వదలు కొన్నందుకు నాగమ్మ మిక్కిలి సంతోషించెను. కాని మాచర్ల యందలి బ్రహ్మనాయని కీర్తివైభవము లామెచెవులకుఁ జేరుట తోడనే ఆసంతోషము విచారముగా మాఱిపోయెను. ఆమె కడుపులో నూఁద పెరిగి కట్టు తప్పిపోయెను.

బ్రహ్మనాయని ప్రాభవముఁ గూలఁ ద్రోసిన గాని మా త్సర్యగ్రస్తమగు ఆమె హృదయమునకు శాంతి గలుగకుండెను. దారిదోఁపిడిగాండ్ర కామె ధనమిచ్చి మాచెర్లపట్టణమును దోఁచికొని రండని పంపెను.

ఆనగరమున బ్రహ్మనాయని ప్రియసేవకుఁడగు మాల కనమదాసను మహావీరుఁడు ప్రతాపించి వచ్చిన దొంగలగుంపు నెదిరించి యోడించి వారిని బశువులవలె గురిజాలపురమునకుఁ దఱుముకొని వచ్చెను.

అట్లురుదెంచిన కనమనాయని నాయకురాలు చూచి యోర్వలేక నోటికి వచ్చిన విధమునఁ దిట్టిపోసెను. అప్పుడు కనమనాయనికిఁ బట్టరాని కోపము వచ్చెను. అగుటచే నాతఁడు సైరణవీడి కత్తిదూసి ఆమెపై కుటికెను.

పిన్నటనాఁటనుండియు నాగమ్మ నరసి రక్షించుచుండిన అదృష్టదేవతయే ఇప్పట్టున గూడ నామెను కనమనాయని కత్తి వ్రేటునుండి కాపాడినది. తప్పించుకొని పోయి యంతఃపురము చేరి నాగమ్మ ప్రాణములు నిలుపుకొన్నది.

తన కత్యంతప్రియభృత్యుఁ డగు కనమనాయఁడు మాచర్లనగరమున కానరా కుండుటకు నివ్వెఱపడి, యొకవేళ గురిజాల కేగె నేమో యని తలఁచి, యచ్చటికే యరిగియుండినచో నాయకురాలివలన నాతని కేదైన కష్టపాటు కలుగక మాన దని అనుమానించి బ్రహ్మనాయఁడు ప్రభువగు నలగాముని దర్శింపవలయు నను మిషతో గురిజాలకు బయలుదేఱెను.

తనకుఁ బ్రత్యర్థియగు బ్రహ్మనాయఁడు గురిజాలకు వచ్చుచుండెనని నాగమ్మ చారులవలనఁ దెలిసికొనెను. బ్రహ్మనాయని తుదముట్టించుట కిదే మంచిసమయమని ఆమె నిశ్చయించెను.

నాయఁడు వచ్చు మార్గమున లోఁతుగోతులు త్రవ్వించి యవి కనిపింపకుండఁ బైపైన గడ్డిగాదములతోఁ గప్పించెను; ఆ గడ్డిగాదములపైన మన్ను చల్లించెను.

కాని ఆదొంగగోతు లుద్దిష్టకార్యమును నెఱవేర్ప లేదు. ఎట్టులో వానిఁ దప్పించుకొని బ్రహ్మనాయఁడు గురిజాలకు వచ్చెను. అచ్చట నాగమ్మ యతనికి విషభోజనము పెట్టించెను. నాయఁ డీయపకృతికిఁ గూడ బలికాలేదు.

గురిజాలపురమున నలగామరాజు బ్రహ్మనాయని మిగుల గౌరవించెను. ఇందుకు నాగమ్మ మిగుల కంటగించు కొనెను. తా నొనరించిన దుస్తంత్రముల నెల్ల నతిక్రమించి బ్రహ్మనాయఁడు నలగామరాజుతో విందు లారగించుచుండుట నాగమ్మ చూడలేకపోయెను. ఎటులయిన బ్రహ్మనాయని కష్ట ముల బాలుచేయ నాగమ్మ కంటికిఁ గూర్కు నెఱుంగక ప్రయ త్నము లొనర్చుచుండెను.

ఉద్యోగించునది మాత్సర్యపిశాచముచే నావేశింపఁబడి యున్న హృదయము. అట్టిచో యుక్తాయుక్తవివేచన ముండుట పొసఁగదుగదా!

విందులు చేసి నలగామభూపతియు, బ్రహ్మనాయఁడు నొక నాఁడు రాజభవనమునుండి వెలుపలికి వచ్చిరి. నాగమ్మ వారికి వేడుక గల్గించు నెపమున నప్పుడు కోడిపందెము లాడించెను.

ఆపందెము లం దోడిన కోడి బ్రహ్మనాయనికోడి యనియు, గెలిచినది నాయకురాలికోడి యనియు నామె తన అనుచరులచే ననిపించి బ్రహ్మనాయని అవమానించెను.

కాని యోడినకోడి నొకదానిని బ్రహ్మనాయనికోడి యని యనుటతోడనే అది యుక్కుమిగిలి నాయకురా లను పేరుగల పుంజునే గాక యెదిరించిన పుంజుల నెల్ల జయించి విక్రమించెను.

ఇది చూచి నాగమ్మ పట్టలేకపోయెను. కోపముచే నామె పరవశురా లయ్యెను. ఆమె కోరిమి తగ్గిపోయెను. తనతోఁ గోడిపందెము కట్టుమని ఆమె బ్రహ్మనాయని రేఁపెను. నాయకురాలి దుస్తంత్రముల కింతదనుక నోర్చి వడఁబోయుచుం

డిన బ్రహ్మనాయఁడికిఁ బగసాధించుటకు సమయము వచ్చిన దని కోడిపోరాటమున కొడఁబడెను.

ఎవరి కోడి యోడునో వారు పురమును, రాజ్యమును విడిచిపెట్టి కృష్ణానదిని దాఁటి మండాదియడవులకు వలసపోయి యేడుసంవత్సరములు ప్రవాసమున నుండవలయు నని పందెపు టొడంబడిక,

ఈకోడిపందెమున బ్రహ్మనాయనికిని, నాయకురాలికిని బాలగోపన్ననాయఁడను యాదవవంశీయుఁడు మధ్యవర్తిగా నుండున ట్లేర్పఱుపఁబడెను. బాలగోపన్న బ్రహ్మనాయనికిఁ బ్రాణమిత్రము.

పందెము ప్రారంభింపఁబడెను. గురిజాలపురమునఁగల అశేషజనము నచ్చటనే యుండెను. నలగామభూపతి, బ్రహ్మనాయఁడు, మిగిలిన రాజబంధువులును వచ్చిరి.

అత్యుత్సాహముతోఁ బందెము సాగిపోవుచుండెను. బ్రహ్మనాయని కోడి నాయకురాలిపేరుగల పుంజుల నెల్ల చించి చెండాడు చుండెను, నాగమ్మ పరాభవాగ్నిలో ప్రగ్గుచుండెను. మాయచేసి యామె బ్రహ్మనాయని పుంజును జంపించెను.

మఱియొక పుంజును గైకొని పందెము సాగింతమన్న నాయనికి నాగమ్మ మాయోపాయమువలన నిఁకఁ గోళ్లు లభింపకపోయెను. జరుగుచున్న అన్యాయము నంతను జూచి తగవరియైన బాలగోపన్న కంటగిల్లి నాయకురాలిని నిందించి పట్టరాని కోపమున నామె యనుచరులపైఁబడి యుద్ధముచేసి నాగమ్మ పక్షమువాఁడైన మువ్వాల భీమన్నచేతులలో మరణించెను. గోపన్నమరణము కనమనాయఁడు బ్రహ్మనాయనికిఁ దెలిపెను.

నాయకురాలు చేసిన కుట్ర నలుగురికిఁ దెలిసినది. ఇది తగవుమాలిన గెలు పని అంద అనిరి.

అయినను బ్రహ్మనాయఁడు ధర్మమునకుఁ గట్టువడి యొడఁబాటు తప్పక మలిదేవాదుల వెంట నిడుకొని మాచర్ల పట్టణమును విడిచి యేలేశ్వరమువద్ద కృష్ణానదిని దాఁటి యడవులనడుమ నున్న మండాదికి వలసపోయెను.

అచట వారికి లంకన్న యను యోధుఁడు సేనాధిపతిగఁ గుదిరెను. మేడలు, మిద్దెలు, కోటలు, పేటలు, వీథులు, గుళ్లు, గోపురములు తీరి యా కానలనడుమ మండాది యొక పెద్దపట్టణమాయెను.

బ్రహ్మనాయఁడు రాజ్యతంత్రము నడపుచుండ మాచర్లలో వలె మండాదియందు కూడ మలిదేవాదులు మహావైభవముతో వఱలుచుండిరి; పాఁడిపంటలు గలిగి పెంపొందుచుండిరి.

ఇది నాయకురాలికిఁ దెలియవచ్చినది. మండాది ప్రాభవవైభవముల కామె కళ్ళలో నిప్పులు పోసికొన్నది. మలిదేవాదులు ప్రాభవవైభవములు కలిగి వఱలుచుండుట తనకుఁ, దన ప్రభువగు నలగామరాజునకు నెప్పటికైనఁ జేటేయని ఆమె చింతించినది.

మలిదేవాదుల ప్రాభవవైభవములను డిందుపాటొందింప వలెనని ఆమె దీక్షపట్టినది. అందుకుఁ బ్రథమప్రయత్నముగా వారిపశుబలమును నాశనముచేయుట మంచిదని ఆమె నిశ్చయించినది.

నాగమ్మ కోయవాళ్ళను బిలిచి ధనమిచ్చి మండాదికిఁ బోయి మలిదేవుల పశువులమందను బాడిచి రమ్మనిపంపెను. కోయవాళ్లుపోయి మందను బాడిచి, చెదరఁ గొట్టి, అల్లడితల్లడి చేసిరి. అదిచూచి మలిదేవులసేనాని లంకన్న కోయవాళ్ళ నెదిరించెను ; యుద్ధము చేసెను; తుదకు నేల కొరగెను.

బ్రహ్మనాయని పాదసేవకుఁ డగు కనమనాయఁ డప్పుడు కోయవాండ్రను మార్కొ-నెను; భయంకరముగఁ బోరాడెను. కోయవాండ్రబలము క్రమముగాఁ దగ్గిపోయినది. వారిలోఁ జావఁగా మిగిలినవారు పిక్క-బలము చూపిరి.

మలిదేవాదులు మండాది నివాస మేర్పఱుచుకొని మూఁడు సంవత్సరము లైనది.

ఈమూఁడేండ్లును నాగమ్మ వారిని సుఖముగా నుండ నీయ లేదు. ఆమె పంపిన కోయవాండ్రు వచ్చి ఆవులమందను బాడిచిరి. పెక్కా-వులు నష్టపడినవి. కొన్ని చెదరిపోయినవి. మంచిబంటు లంకన్న మరణించినాఁడు.

ఇఁక మండాదియందు నిలుచుటకు వారికి మనస్క-రించినది కాదు. ఉందమన్నను వారిని నాయకురాలు కుదుటఁబడి యుండనీయ దని బ్రహ్మనాయఁడు తలంచెను. పరభూములకుఁ బోవుటయే మంచిదని ఆతఁడు నిశ్చయించెను.

మలిదేవాదులతో బయలుదేఱి శృంగారమద్ది రేవునఁ గృష్ణదాఁటి దక్షిణదిక్కు-గాఁ బ్రయాణముచేసి బ్రహ్మనాయఁడు శ్రీశైలము చేరెను. వారచట వెలసియున్న మల్లికార్జునస్వామిని, భ్రమరాంబాదేవిని సేవించిరి.

శ్రీశైలమునకు మాకరాజుప్రభువు. బ్రహ్మనాయఁడు పోయి యతనిని జూచెను. తన పచ్చలపిడిబాకు కుదువఁబెట్టి మాకరాజువద్ద బ్రహ్మనాయఁడు మాచర్ల పురము, గణపవరము, త్రిపురాంతకము, అంబసముద్రము మున్నగు గ్రామములుగల ధూపాటిసీమను గుత్తకుఁ బుచ్చుకొనెను. ఆసీమకు వీరమేడపి యను పట్టణము రాజధాని యాయెను. వీరమేడపి యందు వారు నాలుగుసంవత్సరముల యాఱుమాసము లుండిరి.

ప్రవాసకాలపరిమితి ముగిసినది. అప్పుడు బ్రహ్మనాయఁడు మలిదేవరాజాదులతో నాలోచించి కోడిపోరిలో నోడిన నాఁటి యొడంబడిక ప్రకారము యేడుసంవత్సరములు గడచి పోయినవి; కావున మాచెర్లనగరమును, బలనాటిరాజ్యభాగమును దమ కీయవలసిన దని నలగామభూపతి కడకు అలరాజనువానిని బంపెను.

అలరాజు నలగాముని అల్లుఁడు. అల్లుని మొగమైనను జూచి నలగామరాజు తమ మనవి మన్నించునని బ్రహ్మనాయఁడు భావించెను.

అలరాజు మామగారి కొలువుకూటమునకు వచ్చెను. మలిదేవులకు వారిరాజ్యభాగము నీయవలసిన దని అలరాజు నలగాముని బ్రార్థించెను. మంత్రిణియైన నాగమ్మప్రోద్బలమున నలగాముఁ డల్లునిరాయబారమునకు సమ్మతింపలేదు. పైపెచ్చు పరుషోక్తు లాడెను.

అందుమీఁద నలరాజున కింతింతనరాని కోపమువచ్చెను. వెంటనే బయలుదేఱి యాతఁడు సమీపమునన్న చెర్లగుడిపాడు వచ్చిచేరెను. అచట ఆతఁడు కనమనాయుని కలిసికొనెను.

రాయబారము నెఱవేర్చుకొని గాని అచటనుండి కదలనని అల రాజు ప్రతినపట్టెను.

ఇంతలో నాయకురాలు అలరాజునకు —తనప్రభువున కల్లుఁడనియైన చూడక— విషప్రయోగము చేయించెను. అల రాజు చనిపోయెను.

ఆతనిభార్య పేరమ్మ తండ్రియైన నలగామరాజును దూషించెను; ఆతనివద్ద మంత్రాంగము నెఱపుచున్న నాయకురాలిని శపించెను; భర్తతో సాగుమానము చేసెను.

రాయబారము నడుప వచ్చిన అలరాజును విషప్రయోగముచేఁ దుదముట్టించిన నాయకురాలి పైని, నలగామరాజు పైని వీరమేడపిలో నందఱు మండిపడిరి. నాయకురాలు మంత్రిణియై ఉన్నంతకాలము నలగామభూపతితో సంధి పొసఁగుట దుర్ఘటమని వారు తుదినిశ్చయము చేసికొనిరి.

ఇఁక యుద్ధమే శరణ్యమని వారు నిర్ధారణచేసిరి. గురిజాలలో నలగామరాజును, వీరమేడపిలో బ్రహ్మనాయఁడును సమరసన్నాహములు సాగించిరి. సేనలగూర్చుకొని యిరుపక్షములవారును కార్యమపూడిదగ్గఱ దండు విడిసిరి.

యుక్తసమయమున యుద్ధము మొదలుపెట్టిరి. ఉభయపక్షములవారికిని సంకులసమర మయ్యెను. ఉభయత్ర విశేష సైన్యము నష్టపడెను.

నలగామరాజుపక్ష మూని యుద్ధము చేసిన మహావీరుఁడు నరసింహరాజు వీరమరణము నొందెను. బ్రహ్మనాయనిపక్షమున నాతని కుమారుఁడు బాలచంద్రుఁడు అసహాయశూరుఁడై పోరి వీరస్వర్గ మలంకరించెను. మలిదేవాదులు

కూడ మడిసిరి. ఇరువాగులయందును వీరనాయకు లెందఱో మరణించిరి.

అప్పుడు నలగామరాజుసేనల కంతకును నాయకురాలే యాధిపత్యము వహించెను. నాగమ్మ మగబిరుదు గట్టెను; గుఱ్ఱము నెక్కెను; యుద్ధరంగమునఁ జొఱఁబడెను; సేన నంతను నాలుగు భాగములు చేసెను; ఒక్కొక్క భాగమున కొక్కొక్క సేనానాయకుని నియమించెను. ఆనాలుగుభాగములును నాలుగుదిక్కులనుండి శత్రువులను మూర్కొనెను.

నాయకురాలు చాలసేపు సమరము చేసెను: బ్రహ్మనాయని ప్రియశిష్యుఁడగు మాలకన్నమనాయనితో నెక్కటికయ్యము చేసెను. అదృష్టదేవత వీడుటచే నాగమ్మ అపజయము నొందెను; కన్నమనాయనికిఁ జిక్కెను. అంతట నాతఁడు నాయకురాలి కాలుసేతులు విఱిచికట్టి బ్రహ్మనాయని వద్దకుఁ గొనిపోయెను.

తనకు సమస్తవిషయములందును ఆలోచనపాలోచనఁ జెప్పి రాజ్యమున మంత్రాంగము నెఱపుచుండిన నాయకురాలిట్లు బ్రహ్మనాయనిచేఁ జిక్కిన తరువాతఁ జేయునదిలేక నలగామరాజు బ్రహ్మనాయని శరణుజొచ్చెను.

వీరనాయకుల మరణమునకు విచారమున మ్రగ్గుచుండిన బ్రహ్మనాయఁడు వైరాగ్యమూని నలగామరాజునకు మఱలఁ బలనాటిరాజ్యము నిచ్చివేసెను; తనకింత చేసిన నాయకురాలిని గూడ నెపమెన్నక విడిచిబుచ్చెను.

ఎక్కడనో చిట్టగామాలపాడను చిన్నిగ్రామమునఁ బుట్టి యొక పేదరైతు నింటఁ బెరిగి నిజశక్తిచే నలగామరాజును

వశంవదునిగఁ జేసికొని పలనాటిరాజ్యమునకు మంత్రిణియై మహిమనొంది నాయకురాలని బిరుదు వహించిన నాగమ్మ జీవితము కడకాలమునం దవమానము పాలాయెను.

నాగమ్మ మంత్రాంగమునఁ జదురాలు. ఆమె కార్యకాంక్ష న్యాయాన్యాయము లెఱుఁగని మాట నిజమే.

మలిదేవాదులు తనప్రభువగు నలగామరాజునకు శత్రువులని ఆమెభావన. శత్రువులను నిశ్శేషముగ నాశనముచేయుట రాజులకు విధ్యుక్తధర్మము. నలగామరాజునకు నమ్మిన మంత్రిణియై యుండిన తా నాతని శత్రువులను నాశనముచేయుటలోఁ దోడ్పడి తీరవలయును.

అంతియే కాదు. ఆమె బ్రహ్మనాయనిపయిఁ బగఁ గొన్నది. ఆతనిని గూలఁద్రోయ వలయును. ఇందు కామె మంత్రాంగమందలి తన నేర్పరితనమునంతను వినియోగించెను.

ఆమె యవలంబించిన రాజనీతి కక్షీలేనిది. అట్టి రాజనీతికి మూలస్థానము స్వార్థపరత్వము. అది మిత్రులఁ బరిగణింపదు; బంధువులఁ బాటింపదు.

నాగమ్మ యనుసరించిన రాజనీతి ధర్మచింతచే సంకుచితము గాలేదు; న్యాయభీతిచే జుష్టము గాలేదు.

పాశ్చాత్యదేశములందు దినదినము రాజనీతిపేరిట జరుగుచున్న దారుణములను వినుచున్న మనకు నాయకురాలికృత్యములు —విపరీతములే యగుఁగాక— వింతఁగొల్పవు.

ఇంతకును నాయకురాలి మంత్రాంగమందలి మంచిచెడ్డలతో మనకు నిమిత్తము లేదు.

పల్లెటిగ్రామమునఁ బుట్టి పేదరైతు నింటఁ బెరిగి యాత్మశక్తివలనఁ బలనాటిరాజ్యమునకు మంత్రిణియైన నాగమ్మప్రతిభ; పలనాటిప్రభువగు నలగామభూపతిని దనచేతిలోఁ గీలుబొమ్మవలె నాడించిన ఆమెప్రజ్ఞ; పల్నాటికృష్ణుఁడని ప్రసిద్ధికెక్కిన బ్రహ్మనాయఁడంతవానితో నిరుపోటిగ రాజ్యతంత్రము నడపిన ఆమె మహాసామర్థ్యము; యోధానయోధులైన పురుషులు సయితము స్వీకరించుటకు జంకు సేనాపతిత్వమును జేకొనిన ఆమె సాహసము; మగబిరుదుగట్టి అశ్వారూఢయై ఆహవరంగమున కుఱికి యుద్ధముచేసిన ఆమెపరాక్రమమును బరికించి ఆంధ్రరమణుల యం దింతటి ప్రతిభ, ఇంతటి ప్రజ్ఞ, ఇంతటి సామర్థ్యము, ఇంతటి సాహసము, ఇంతటి పరాక్రమము నిక్షిప్తమై యున్నవని నిరవధికానందమును బొందుటమాత్రమే మన పని.

కాని నాగమ్మ నెఱపిన మంత్రాంగమందలి మంచిచెడ్డల నౌఁగాదని యెన్నుట మన పనికాదు.

అది నిత్యము నీతియను వస్తువుతోడనే వర్తకము చేయుచు నీతితోఁ బిచ్చిగొన్నవారి పని; ఎల్లవేళల నూర్ధ్వలోకములయందే దృష్టి నిగిడ్చియుండు ధర్మాత్ముల పని.

నిజమైన ఆంధ్రాభిమానముగలవారు— మూఁడులక్షల శత్రుసైన్యముతో స్వయముగ సమరము సలిపి సమ్యగ్జయమును గొని పాదాక్రాంతుఁడైన పరిపంథినృపాలునివలనఁ గోటిద్రవ్యము లపరాధముగఁ గైకొనిన రుద్రమ శుభపర్యవసానముగల రాజ్ఞీత్వము నెంతగాఁ బ్రశంసింతురో ముక్కాఁకలు దీరిన బేతాళమూర్తు లనదగు వీరపురుషులకు నెదురొడ్డి మగబిరుదుగట్టి అశ్వారూఢయై పాలివాని పౌరుషముతో యుద్ధము

చేసి కాలము తప్పివచ్చుటచే వైరికిఁ బట్టువడిన నాగమ్మ దుఃఖపర్యవసానము గల మంత్రిణీత్వమును గూడ నంతగనే ప్రశంసింతురు.

పర్యవసాన మెట్టి దైనను ఉభయత్ర శౌర్యసాహసములు, ప్రజ్ఞాప్రాభవములు సమముగనే ప్రదర్శింపఁబడినవి గదా !

“రవి తిరుగలేనంత రాజ్యాన సత్కీర్తిఁ
గేలఁగీలించిన గేస్తురాలు
పలనాటిపసిఁడికోటల గావు లెత్తించి
సారె భూపుల కంపు ధీరురాలు
నాయనిప్రక్కలో నాగుబామై నాఁడు
మంత్రిగా నెగడిన మాన్యురాలు
కనులఁ జేవురునిప్పుకలు రాల్చి కనుముల
వలస బంపిన బలవంతురాలు

కాలమా! మాదు నాయకురాలివంటి
బిడ్డ నేదేశమందైనఁ బెంచినావె?”

—మదమంచి అనంతమ్మ.

## ౪

# మాంచాల

'తన సూత్రపాలు బాలునికి నవ్వుచుం గర
వాల మొసంగిన మాంచాలదేవి'

—రాయప్రోలు సుబ్బారావు.

మాంచాల మంచి యందమైన బాలిక, ఆమె గండువా రింటి ఆఁడుబడుచు; తల్లి రేఖాంబ; తండ్రి కన్నమనాయఁడు. గండు కన్నమనాయఁడు తన కొమార్తె మాంచాలను పల్నాటి కృష్ణుఁడని పేరొందిన బ్రహ్మనాయని కొమారుఁడు బాలచంద్రున కిచ్చి వివాహముచేసెను.

పల్నాటి ప్రభువైన నలగామరాజుతోఁ బొసంగిన యుద్ధమునకు బ్రహ్మనాయఁడు మలిదేవాదులతో వీరమేడపి నుండి సేనాసమేతుఁడై కదలివెళ్ళి కార్యమపూడికడ దండు విడిసెను. నిజరాజధానియగు గురిజాలనుండి నలగామరాజుగూడ సేనలఁగూర్చుకొని యచ్చటికి వచ్చెను. ఇరువాఁగులవారును యుద్ధమున కుత్సాహపడుచుండిరి.

ఈ సమరవృత్తాంతము వీరమేడపిలో బాలచంద్రునికిఁ దెలియవచ్చెను. అప్పటి కాతనికిఁ బదునేడేండ్లయిన నిండి రాలేదు.

అయిననేమి? యుద్ధభూమికిఁ బోయి వీరవిక్రమములు వెలయఁజేయ వలయునని ఆతని వీరహృదయమునకుఁ దట్టినది.

అనుజ్ఞ గైకొనుటకై ఆతఁడు తల్లి ఐతమ్మను దర్శించెను. కన్న కడు పగుటచే నైతమ్మ తనయుని ఎడఁబాటున కొప్పుకొన లేకపోయినది.

అందుమీఁద బాలచంద్రుఁడు

"కార్యమపురమందు ఘనపరాక్రమతఁ
దండ్రులు నిలుచుండి దండు సేయంగ
నే నిట నుండుట నీతియే? తల్లి!
యుండుమంటకు నీకు నొప్పునా మనసు?"

—పల్నాటివీరచరిత్ర.

అని అడిగెను.

సమరస్థలికిఁ బోయి తండ్రికిఁ దోడ్పడి వీరధర్మము నెఱవేర్చుకొనుట కాన తిమ్మని ఆతఁడు తల్లిని తొందరపెడి పించెను. శూరునితల్లికి సుఖములే దని ఐతమ్మ శోకించెను. 'ఇఁక నే నెంతచెప్పినను బాలుఁడు పోకమానఁడు; భార్య మాంచాల చెప్పిన నిలుచునేమో?; మాంచాల సౌందర్యమును జూచి నైన నిలువకపోఁ డని ఆమె యాలోచనచేసెను.

అందుకని ఆతనిని మాంచాలవద్దకుఁ బంప నుద్దేశించి 'తండ్రీ! సమరమునకుఁ బోవువారు తల్లి దీవన పొందిన పిమ్మట భార్యదీవన పొందవలెను. కావున నీవు నీభార్యవద్దకుఁ బోయి దీవనలంది రణరంగమునకుఁ బొమ్ము' అని ఆమె బాలచంద్రు నితో ననెను.

తల్లిమాట పట్టుకొని బాలచంద్రుఁడు భార్యను జూచి వచ్చుటకు బయలు దేఱెను.

ఆతని కన్న ముందుగా నైతమ్మ కోడలు మాంచాల వద్దకుఁ బోయి 'బాలచంద్రుఁడు యుద్ధమునకుఁ బోవుచు నిన్ను చూచుటకు వచ్చుచున్నాఁడు. ఆతని నెటులైన యుద్ధమునకుఁ బోకుండ నాపుచేయవలె'నని చెప్పినది.

అత్త చెప్పిన మాటలకు మాంచాల యొప్పుకొనెను.

బాలచంద్రుఁడు మామయైన గండు కన్నమనాయని యింటికి వచ్చెను. ఇంతవఱకు బాలచంద్రునకు నాతనిభార్య మాంచాలకు నెక్కువ పరిచయము లేదు.

రాకరాకవచ్చిన ప్రాణనాథుని మాంచాల పూజించినది; మేడమీఁదికిఁ దీసికొనిపోయినది ; అచ్చటి వివిధములైన చిత్రములఁ జూపినది. యుద్ధరంగమున కుఱుకుచున్న ఆతని మనమును గట్టివేయుటకు అత్తయాజ్ఞ నొందల నిడికొని మాంచాల సర్వవిధములఁ బ్రయత్నించినది.

శృంగారించుకొని ఇపుడె వత్తునని మగని సెలవు గొని మాంచాల క్రిందికివచ్చి తల్లి రేఖాంబవద్దకుఁ బోయినది. 'అమ్మా ! నీయల్లుఁడు యౌవనాశల నన్నిటిని దిగనాడి యుద్ధమునకుఁ బోవుచున్నాఁడు. పోకుండఁ బట్టియుంచు నుపాయము నను జెప్పి నాకు సంసారసుఖమధువు రుచి జూపు' మని మాంచాల తల్లిని మిక్కిలి ప్రార్థించెను.

రేఖాంబ వీరపత్ని. అగుటచే నామెకు మాంచాల ప్రార్థన నచ్చలేదు. కొమార్తెను జేరఁదీసి చెంపలు దువ్వి రేఖాంబ

జన్మవృక్షమునకుఁ జవి గలయట్టి
పటుతరకమనీయఫలములు రెండు

కెరలు భోగము లొండు కీర్తి రెండవది
తొలిపండు చవిఁజూచి తొలఁగు నొక్కండు
మలిపండు చవిఁజూచి మలఁగు నొక్కండు
వీర లిద్దఱికిని భేదంబు హెచ్చు
మొదటిఫలంబున మొనసెడు రసము
క్షణభంగురం బది సమసిపోఁగలదు.
రెండవఫలమున రెక్కొను రసము
శాశ్వతంబౌచు దిశల్ గలదాఁక
సవితృఁడు గలదాఁక శశి గలదాఁక
తారలు గలదాఁక ధర గలదాఁక
వారిధి గలదాఁక వఱలుచునుండుఁ
బ్రకటఫలద్వయరసమును గ్రోలి
యనుభవించెడువార లరుదు భూస్థలినిఁ
బ్రాకృతజనములు ప్రథమఫలంబుఁ
బ్రాపించి సంతృప్తి పడయంగఁగలరు
వీరాంశమునఁ బుట్టి వెలయువారలకు
మొదటిఫలం బది ముఖ్యంబు కాదు
మహిమాస్పదంబయి మనసు జ్వలింపఁ
బరుగెత్తుదురు రెండవఫలంబు కొఱకు
వెలఁదిరో! నీభర్త వీరశేఖరుఁడు
కీర్తికాముకుఁడయి కేరుచున్నాఁడు
నీవు భోగములపై నిరతిఁ ద్యజించి
బాలచంద్రుని మనోభావం బెఱింగి

భావిమానవుల హృద్భవనంబులందు
తావకీనయశోలతావివర్ధనము
సేయంగఁ గోరుము చెలువరో! యిపుడు
బాలచంద్రుని సాగఁబట్టంగ వలదు.''

—పల్నాటివీరచరిత్ర.

అని ఉపదేశము జేసినది.

ఈ వీరధర్మోపన్యాసము మాంచాల మనమునఁ జక్కఁగ హత్తుకొన్నది. అసలామెది వీరహృదయమే. కాని ఆమె కప్పటికిఁ గుడియెడమలు తెలియని కుఱ్ఱతనము. భర్త యగు బాలచంద్రుఁడే యప్పటికిఁ బదునేడేండ్లవాఁడు. మాంచాల యాతనికంటెఁ జిన్నదై యుండితీరవలయును. కావున అట్టి పిన్నతనమునం దుచితానుచితము లెంచి మాంచాల యత్త మాట నతిక్రమింప లేకపోయినది.

ఎట్లో తన వీరహృదయమునకు శాంతి చెప్పుకొని బాల చంద్రుని యుద్ధయాత్రనుండి మరలించుటకు మాంచాల ప్రయత్నించినది.

మాంచాలబాలచంద్రుల సంసారప్రబంధమునం దప్ప టికి మంగళాచరణము మాత్రమైనది, ప్రథమాశ్వాసమైనను ప్రారంభము కాలేదు. అట్టిచో నామెకుఁ దఱుగని సుఖాశ యుండుట సహజమే. కావుననే ఆమె యత్తఆజ్ఞను దల నిడు కొని, పొందఁగల యౌవనసుఖములఁ దలఁచుకొని బాల చంద్రుని యుద్ధమునకుఁ బోకుండ నాగఁబట్టవలయునని నిశ్చ యించినది.

అప్పట్టున వీరధర్మము, యశోవాంఛ యను సంశములు మాంచాల యౌవనసుఖాశావాయువులచేఁ దఱుమఁబడి యామె బాలహృదయకుహరమున మాటుమణఁగి తనంతట తాము బహిర్గతములు గాఁజాలకపోయినవి.

తల్లి రేఖాంబ యొసఁగిన వీరధర్మోపన్యాసము వినుట తోడనే ఆమె బాలహృదయమునకు సంస్కారము గలిగినది. అంతదనుక మాటువడియున్న వీరధర్మము, కీర్తివాంఛ యప్పుడు వెల్లివిరిసి ఆమెహృదయకూలము నొరసికొని దారుణ వేగముతోఁ బ్రవహించినవి.

అంతట మాంచాల మనస్సు గట్టిచేసికొన్నది ; యౌవన వ్యగ్రతవలన నుఱుకలు వేయుచున్న సుఖాశల నన్నిటిని దిగఁ ద్రావినది; అత్తమాట నవతలకుఁ ద్రోసినది; తల్లిమాటను జేకొన్నది; అలంకరించుకొన్నది; పతివద్దకుఁ బోవుచున్నది.

గడియక్రితము మేడ దిగివచ్చిన మాంచాలకును ఇప్పుడు పతిచెంతకుఁ బోవుచున్న మాంచాలకును బ్రవృత్తియం దెంతేని భేదముగలదు.

అప్పు డామె మగనిరాకలకు హర్షించిన ప్రణయ తపస్విని; లాలనమారుతమున నాతని బడలికలు వాపిన జంగ మలత.

ఇప్పుడో యుద్బోధించి మగనిని యుద్ధభూమికిఁ బంప నిశ్చయించిన వీరాంగన; విధ్యుక్తవీరధర్మము నాతని జ్ఞప్తి కెలయుంప నుదయించిన దేవీస్వరూపిణి.

అలంకరించుకొని వచ్చిన ఆ యతిలోకసుందరిని దిలకించి బాలచంద్రుఁడు ముగ్ధుఁడైనాఁడు ; చాలసేపు సరసము లాడి

నాఁడు; సల్లాపములు చేసినాఁడు. ఆతఁడు యుద్ధముసంగతి పూర్తిగ మఱచిపోయెను.

వీరధర్మమన నేమో తెలిసికొనిన మాంచాల యిది చూచి సహింపలేకపోయెను. ఆ వీరమతి కప్పుడు వీరావేశము గల్గినది. బాలచంద్రుని జూచి వీరగంధమును విరియఁ జిమ్ముచు మాంచాల

"నాతోడ మసలిన వయమేమి లేదు
కడువడిఁ గలనికిఁ గదలుఁడి మీరు
కులవైరముం దీర్చు గురుసాహసుండు
పరకించిచూడ నెవ్వరు మీరు దక్క?"

—పల్నాటివీరచరిత్ర.

అని వీరధర్మ మాతనిజ్ఞప్తి కెలయించినది.

మఱపునొందిన ఆతని రణోత్సాహము మఱల రగిలినది. ఆతఁడు తప్పు తెలిసికొని వివేకము దెచ్చుకొని వెంటనే కార్యము పూడికిఁ బ్రయాణమయ్యెను. కదనమున విజయము కల్గునట్లు దీవింప వలసినదని బాలచంద్రుఁడు తనకటారిని భార్య కిచ్చెను. దానిని భక్తిపూర్వకముగ గ్రహించి వినయపురస్సరముగఁ గన్నుల కద్దుకొని సంతోషించి యా వీరకుమారి

"రతిరాజసౌందర్య! రణరంగధీర!
కమలబాంధవతేజ! కరుణాలవాల!
వినతాత్మజునిలావు వెస నీకుఁ గలుగు
సామీరిసమమైనసాహసం బబ్బుఁ
గృష్ణుని కెనయైన కీర్తి ఘటిల్లు
రవికాంతియుతుఁడవై రంజిల్లుమండి

యలరాజు పగఁదీర్ప మనుజులతోడఁ
బటుతరవిక్రమప్రౌఢిమ మెఱయ
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుఁడు
వరము లొసంగఁగ వర్ధిల్లఁగలరు
శాత్రవవిజయంబు సమకూరు నీకు
నీ యాయుధము వడినిచ్చును జయము
కలియుగమ్మున నీకు ఘనపూజ లమరు."

—పల్నాటివీరచరిత్రం.

అని ప్రాణనాయకుని దీవించి కటారిని దిరిగి యిచ్చివేసెను.

వీరపత్నిచే మనఃపూర్వకమైన దీవన లందుకొని బాలచంద్రుఁడు కార్యమపూడికదనరంగమునకుఁ బోయి ప్రాలెను. తండ్రి బ్రహ్మనాయని ఆజ్ఞనుబొంది యుద్ధముచేసెను. పేరొందిన శూరుల నెందఱినో తునుమాడి యాంధ్రదేశమునఁ బుట్టిన అభిమన్యుకుమారుఁడని ఆతఁడు వాసి కెక్కెను; తుద కాతఁ డాత్మదేహమును సమిద్ధమైన శస్త్రవహ్నిని వ్రేల్చి వీరస్వర్గ మలంకరించెను.

అది విని వీరకుమారి మాంచాల తాను నిజమైన వీర పత్ని నైతినని సంతోషసముద్రమునఁ దేలియాడెను.

పదునాఱుసంవత్సరములైన నిండని బాలప్రాయమున యౌవనాశల నన్నిఁటిని గాలఁద్రోసి కీర్తికోసరము ప్రాణ నాథుని

"పల్నాటియుద్ధమే పచ్చీసు నీకు
త్రోసిరాజుగు నీకు తోడిమార్బలము

బ్రతికిన పల్నాడురతనాలమేడ
చచ్చిన పల్నాడుపుచ్చలబీడు."

—మదమంచి అనంతమ్మ.

అని చెప్పి కదనరంగమున కంపిన రమణీమణిని గాంచు భాగ్యము మఱి యేదేశమునకును బట్టలేదు.

జగద్విఖ్యాతమైన కోహినూరురత్నరాజమునకు జని స్థానమగు నీ యాంధ్రరత్నగర్భ కొక్కదానికే యట్టి వీర కుమారీరత్నమును గాంచు నదృష్టము గల్గినది.

తెనుఁగుదేవళమున నిత్యము జరుగుచుండు వీరపూజకు వీరపత్ని మాంచాల యశోలత కలకాలమును బుష్పములు, ఫల ములు నిచ్చుచుండును.

శ్రీ

# రాగమ్మ

క్రీస్తుశకము ౭౧౨-వ సంవత్సరమున ముహమ్మదు కాసీము సింధుదేశముపై నెత్తివచ్చెను. గోమాంసభక్షకులగు ముహమ్మదీయులు రాజ్యస్థాపనాసక్తితోఁ గర్మభూమి యగు హిందూదేశమునఁ గాలిడుట కదియే తొలిసారి.

సింధుదేశాధిపతి దాహిరురాజు రాజపుత్రసేనలఁ గూర్చుకొని కాసీము నెదిరించి వీరస్వర్గ మలంకరించెను. సేనాని చనిపోవుటచే హైందవసైనికులు ముహమ్మదీయులతో నిభాయించలేక పలాయితులైరి.

అప్పుడు దాహిరురాజు ధర్మపత్ని రాణీబాయి స్త్రీబృందముతోఁ జిచ్చుఱికి మానము కాచుకొనెను.

నాఁడు మానవతి రాణీబాయి రాజఁబెట్టిన చిచ్చు ముహమ్మదీయుల విక్రమధాటితోపాటు సింధునదీ ప్రాంతము నుండి హిందూదేశమున నాలుగుమూలలు వ్యాపించి మఱి పది శతాబ్దులకుఁ గాని చల్లారినదికాదు.

వేదయుగమునందు యాగహవిస్సులతోఁ దృప్తుఁడైన అగ్నిహోత్రుఁడు ముహమ్మదీయయుగమునందు మానధనలగు హిందూమహిళాలలామల దేహాహుతులతో దీప్తుఁడైనాఁడు.

సేతుశీతనగవ్యాప్తమైన భరతవర్షమునం దాముహమ్మదీయయుగమున నెందఱో మానవతీమణులు మానసంరక్షణా

ర్థము దమప్రాణముల నగ్నిదేవున కాహుతియిచ్చిరి. అట్టి వారిలో నాంధ్రక్షత్రియరమణి రాగమ్మ యొకతె.

రాగమ్మ గొట్టుముక్కుల భగవానురాజు కొమార్తె.

గోదావరిమండలములోని పెద్దాపురసంస్థానమున కధిపతియైన వత్సవాయి రాయపరాజున కామె పట్టమహిషి. పెద్దాపురసంస్థానపాలకులయందు రాయపరాజునామము ధరించిన వారిలో నాతఁడు రెండవవాఁడు. విక్రమాటోపములు మెఱపించి యాతఁ డుద్దండరాయపరా జను బిరుదమందెను.

రెండవ రాయపరాజు క్రీస్తుశకము ౧౭౭౭-వ సంవత్సరములో సంస్థానాధిపత్యము వహించెను. ఆతఁడు ధర్మపత్ని రాగమ్మయందు తిమ్మరాజు, బలభద్రరాజు, సూరపరాజు లను ముగ్గురఁ బుత్రులఁ బడసెను. అందు మూఁడవపుత్రుఁడైన సూరపరాజు పాలుత్రాగు పసితనముననే తల్లిదండ్రుల కడుపునఁ జిచ్చుపెట్టి చనిపోయెను.

రాయపరాజు ఇరువదియైదుసంవత్సరములు రాచఱికముచేసి క్రీస్తుశకము ౧౭౯౭-వ సంవత్సరమున దేహము చాలించెను.

ఆతఁడు మరణించుసరికిఁ దిమ్మరాజు, బలభద్రరాజు మిక్కిలి పిన్నవారు. జ్యేష్ఠుఁడైన తిమ్మరాజునకే యప్పటికిఁ బదిసంవత్సరములు నిండిరాలేదు. అట్లగుటఁ దల్లి రాగమ్మ తిమ్మరాజునకుఁ బట్టాభిషేకము గావించి, తానే మంత్రిదండనాథాగ్రణుల సాయమున సంస్థానవ్యవహారములఁ జక్కఁబెట్టుచుండెను.

రాగమ్మ స్వయము క్షత్రియరమణి. ఆపై రాజకార్య ధురీణ. విశేషించి రణశూరులైన మన్నెదొరలు, వీరవిక్రములైన క్షత్రియసింహులు నామెను గొలిచియుండిరి. అట్టిచో నామె సంస్థానపరిపాలనము జనరంజకముగ, శత్రుభయంకరముగ సాగిన దని వేఱె చెప్పవలయునా ?

రాగమ్మ సంస్థానవ్యవహారములను గొన్నిసంవత్సరములిట్లు దక్షతతోఁ జక్కఁబెట్టి తిమ్మరాజు చేతి కందివచ్చుటతోడనే యాతని కప్పచెప్పెను. తిమ్మరాజును దల్లియందలి గౌరవముచే సకలకార్యములందును ఆమె సలహా పుచ్చుకొని వ్యవహరించుచుండెను,

ఇది యిట్లుండఁగా హైదరబాదునవాబు కుమ్రుద్దీను అసఫుజా రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులకు సుబేదారుగా నన్వారుద్దీనును నియమించెను. ఆసర్కారులందలి జమీందారు లీయవలసిన కప్పములు బాకీపడియుండ వానిని వసూలుచేయుట కన్వారుద్దీను తన తాబేదారైన రుస్తుంఖానుని క్రీస్తుశకము ౧౭౩౬-వ సంవత్సరమునఁ బంపెను. రుస్తుంఖానునకు హాజీహుస్సే నను నామాంతరముగలదు.

రుస్తుంఖానుఁ డిట్లు మహాలప్కారు (అనఁగా సైన్యాధిపత్యము) అధికారమును స్వీకరించి వచ్చుచుండఁగా నాతని నెటులైన రాజమహేంద్రవరముసర్కారులోఁ గాలిడకుండఁ జేయవలయునని మొగలుతుర్తి కలిదిండి రామరాజును, నూజవీటి సుబ్బన్నయు నేకమై సేనలఁ గూర్చుకొని రెండుమూఁడుమాఱు లేలూరువద్ద నాతనిని దాఁకిరి ; కాని పరాజితులై, పలాయితులై, శరణార్థులై పెద్దాపురము వచ్చిచేరిరి.

ఎదిరి మహాక్రూరుఁడు; మాయావి; ముష్కరతురు ష్కుఁడు. సహాయార్థులై వచ్చినవారు ఖానునితోఁ గదనమునం దోడివచ్చినవారు. అట్టిచో వారి కభయహస్త మొసఁగి యాశ్రయ మిచ్చినచోఁ గోరి యుద్ధము గొని తెచ్చుకొనుటయే.

అయినను రాగమ్మ ధైర్యసాహసములు గలిగిన క్షత్రియరమణియగుటచే నందుకు జంకక వారికి శరణ మిచ్చెను.

పిఠాపురపాలకుఁడైన రావు వేంకటకృష్ణారావు గూడ నీ తిరుగుఁబాటుదార్లతోఁ గుమ్మక్కాయెను.

వీరందఱు నేకమై రుస్తుంఖానుని గోదావరిదాఁటి రాకుండఁ జేయవలె నని యోచనలుచేసి బలములను సమ కూర్చుకొని యుద్ధమునకు సిద్ధపడిరి.

ఇంతలో ఖానుఁడు గోదావరినిదాఁటి రాజమహేంద్ర వరము వచ్చెను. ఒకటిగాఁ గూడిన సంస్థానాధీశ్వరుల సైన్య ములు క్రీస్తుశకము ౧౭౩౪-వ సంవత్సరమున తురుష్కసైన్యా ధిపతితోఁ దలపడెను. ఈపట్టుగూడ విజయము రుస్తుంఖాను నిదే అయినది.

అప్పుడు చేయునదిలేక రామరాజు, సుబ్బన్న, రావు వేంకటకృష్ణారావును తోటపల్లిమన్యములకుఁ బాఱిపోయిరి.

త న్నెదిరింప రామరాజాదులకు రాగమ్మ సైన్యసాహా య్యము చేసె గదా యను కసి ఖానునిమనమున జాగరిత మగు చుండెను. అందుకు రాగమ్మ కేదైన తగిన శాస్తి జేయవలయు నని రుస్తుంఖానుని తలఁపు.

పెద్దాపురసంస్థాన మప్పటికి ముహమ్మదీయులకు లోబడి యుండని స్వతంత్రసంస్థాన మగుటచే మహాలష్కరుఁడు వల్లేరు మీఁద బండిగా నేమియుఁ జేయలేకపోయెను. శౌర్యజీవులగు క్షత్రియులును, మన్నెదొరలును గోటలో నంటరాని యగ్నిహోత్రములవలె విక్రమించి యుండుటచేఁ జొరాయించి పెద్దాపుర దుర్గము ముట్టడించుటకు వీలులేదు.

ఖానుఁ డీసంగతిసందర్భములు పర్యాలోచించుకొని వంచించి పెద్దాపురమును సాధించి స్వాధీనము చేసికొన తల పెట్టెను. అందు కాతఁడు రాజమహేంద్రవరమునుండి సేనలఁ గదలించుకొని పెద్దాపురమున కరిగి పశ్చిమమున నున్న పాండవులవారి మెట్టపై దండువిడిసి రాయబారములు నడపఁ బ్రారంభించెను.

రాగమ్మాదేవి తొలుత రుస్తుంఖానుని నమ్మలేదు. ఆతని రాయబారము లందలి కుటిలసంకల్పవాసన యామెకు సోఁకిన దేమో? నమ్మకమును బుట్టించుటకై రుస్తుంఖానుఁడు తన పుత్రుఁడగు నూరుద్దీనుహుస్సేనుఖానుని రాయబారిగాఁ జేకొనెను.

నూరుద్దీను కొంతకాలము పెద్దాపురమున వత్సవాయి వారి కొలువులో నౌకరీ చేసినవాఁ డగుటచే నాతనిమాటలు రాగమ్మ విశ్వసించునని రుస్తుంఖానుఁ డాలోచనచేసెను.

తండ్రి స్వభావము పూర్తిగ నెఱిఁగిన నూరుద్దీనుహుస్సేనాతనిని మొదట నమ్మలేదు. అందుపై రుస్తుంఖానుఁడు న్యాయము తప్పనని కత్తి పట్టుకొని ప్రమాణముచేసెను. అప్పుడు నూరుద్దీనుహుస్సేను తండ్రిని నమ్మి రాయబారము నడపినాడు.

'మీ సంస్థానము మిక్కిలి ప్రాచీనమైనది; ధర్మపరిపాలనకుఁ బెట్టినది పేరు. అట్టి మీ సంస్థానమును మీకు స్థిరపఱుచుటకు మే మెవ్వరము? ధర్మదేవతయే మీకు స్థిరపఱిచియున్నది. ధర్మప్రభువులగు మీ కొమరుల నొక్కనారి బేటికిఁ బంపినచో వారి దర్శనము చేసికొని ధన్యుల మగుదుము. మేముగూడ వారితో మైత్రి పాటించి సంస్థానమును స్థిరపఱిచి వెడలిపోఁ గల' మని నూరుద్దీనుహుస్సేను తండ్రిమాటలుగా రాగమ్మాదేవికి మనవి చేసికొనెను.

నూరుద్దీనుహుస్సేను ముఖమును జూచి రుస్తుంఖానుని మాటలయందు సంపూర్ణవిశ్వాస ముంచి రాగమ్మ నమ్మిన బంటయిన చల్లాపెద్ది యను వానిని మఱియు నిరువురుముగ్గురనుచరులను మాత్రమే గౌరవపరివారముగఁ దోడిచ్చి తన కుమారులను రుస్తుంఖానుని బసకుఁ బంపెను.

ఎట్టి విషపుగడియయందు కోటగుమ్మమును దాఁటిరో కాని ఆ రాజకుమారులు మఱి తిరిగిరాలేదు.

వత్సవాయి తిమ్మరాజును, బలభద్రరాజును తురుష్కశిబిరము చేరిరి.

రుస్తుంఖానుఁడు రాజకుమారులతో నిష్టాగోష్ఠి నెఱపుచుండగాఁ దురుష్కభటులు డేరాలోనికి వచ్చి సలసల కాఁగిన నూనెలో జొన్నకంకులు ముంచి వానితో రాజపుత్రులను గొట్టసాగిరి.

రుస్తుంఖానుఁ డేమియు నెఱుంగనివానివలె నొక ప్రక్కకు నోసరిల్లెను. నూరుద్దీ నీద్రోహమును జూచి రాజకుమారుల రక్షింప సిద్ధ మగునంతలో నొక పచ్చితురక కళ

పెళకాఁగిన నూనెను వారిపై దిమ్మరించెను. రెప్పపాటులో రాజకుమారులు ప్రాణములు విడిచిరి.

తండ్రి యీసురకృత్యమునకు నూరుద్దీను కంటగించుకొనియెను.

ఇదిచూచి చల్లాపెద్ది గుఱ్ఱమునెక్కి కోటలోని కుడాయించెను. రాజపుత్రుల క్రూరవధ నగరిలోఁ దెలిసినది.

అప్పుడు మానవతియైన రాగమ్మ యిట్లు వచియించెను.

'ఇఁకఁ దురకలు కోటమీఁదఁ బడుదురు. అప్పటియుద్ధమున మనమే జయింతుమని చెప్పఁజాలము. మన మోడితిమేని గోమాంసభక్షకులగు తురకలు మన మానములు మన్నింపరు. రుస్తుంఖానుడు చిచ్చులేకయే చిముడు మచ్చరీఁడు. ఉద్రేకమున రాని, శస్త్రధరులై యుద్ధావని లేని రాజపుత్రులను నమ్మించి దొంగచాటునఁ జంపించిన అసురుఁడు. అట్టివాఁ డెట్టిపనికైన నొడికట్టును. వానితో యుద్ధమున నోడి మానభంగమునకుఁ బాల్పడుటకంటె అసూర్యంపశ్యములైన మన ఈ శరీరముల నగ్నిహోత్రున కాహుతి నిచ్చుటయే క్షత్రియరమణుల మగు మనకు విహితధర్మము.'

సంస్థానసేవకులలో విశ్వాసపాత్రుఁడైన చల్లాపెద్ది ఇదియే ఉత్తమమైన మార్గ మని నిష్కర్ష చేసెను.

మానభంగభీతి త్వరపెట్ట కోడండ్రును, దక్కిన రాణివాసపుస్త్రీలును రాగమ్మతో నగ్నిప్రవేశ మొనర్చుటకు ఉత్సాహపడిరి.

జోహారొనర్చుటకు రాణివాస మంతయు లక్కమేడకుం జేరుకొనియెను. రాగమ్మాదేవి యానతి నంది చల్లాపెద్ది లక్కమేడకు నిప్పుపెట్టెను.

అంతట అగ్నిజ్వాల లాకాశమంటి ఆమానవతుల కుత్తమలోకప్రాప్తి నొనగూర్చెను.

శాత్రవమిళితమైన సతీత్వమును గుబాళించు బూడిద రాసులతో నిండియున్న పెద్దాపురపుకోట రుస్తుంఖానుని వైవసమయ్యెను.

మానసంరక్షణార్థము ప్రాణములు తృణప్రాయముగ నర్పణము చేయుటలో రసపుత్రరమణులకుం దెనుఁగు తెలవ లిసు మంతయుఁ దీసిపోవువారు కారని పెద్దాపురపుకోట ఇట్లు క్రీస్తుశకము ౧౭౩౮-వ సంవత్సరములోఁ బెద్దపెట్టునఁ జాటినది.

మఱి యిరువదిసంవత్సరములకుఁ బిమ్మట ౧౭౫౭-వ సంవత్సరములో బొబ్బిలికోట యీవిషయమునే బొబ్బరించినది.

"నీవారాండ్రు విశుద్ధవహ్నిశిఖల స్నేహంబు నర్పింప నీ
పావిత్ర్యంబులు మింటిపై కెగసె శోభల్ నింపు నక్షత్రమై"

—వేంకట కాళిదాస కవులు.

౬

# మహాలక్ష్మమ్మ

మహాలక్ష్మమ్మ మొల్లవలెఁ గవయిత్రి కాదు. రుద్రమ్మ వలె మహారాజ్ఞి కాదు. నాచివలె మహావిద్వాంసురాలు గాదు. నాగమ్మవలె మంత్రాంగమునఁ జదురాలు గాదు.

అయిన నామె నాంధ్రరమణీమణులలో నొకతెనుగాఁ బరిగణింపవలసియున్నది.

కానయితే ఆమె సామాన్యసంసారస్త్రీయే. కాని త్యాగబుద్ధి, స్వార్థరాహిత్యము, స్వామిభక్తి లక్ష్మమ్మచరిత్ర ఆంధ్రులకుఁ జిరస్మరణీయముగా నొనర్చి యామె యశస్సౌరభ మాంధ్రదేశోద్యానవనమును బరిప్లుతము గావించునట్లుచేసినవి.

రుస్తుంఖానుని క్రూరకర్మమునకు రాగమ్మాదేవి నెనరైన చుట్టాలతోడను, గోడళ్ళతోడను బలివోయినప్పుడు వత్సవాయి వంశము నిర్వంశము గాకుండ నిలుపుటకుఁ దిమ్మరాజుసుతుఁ డేడుమాసముల కసుగందు మిగిలియుండెను. ఆతని పేరు రాయ జగపతి.

పాలుత్రాగు పసితనముననే 'నాఅన్న' వారి నెల్ల పోఁ గొట్టుకొని చెట్టులేని పక్షివలె దిక్కుమాలియున్న ఈ రాజ కుమారుని దగ్గఱ దీసి రుస్తుంఖానుఁ డను రాక్షసుని బారి నుండి రక్షించుభారము తలపై నిడుకొనినది యొక యబల.

ఆ అబలయే మన ప్రస్తుతకథకు నాయికయైన మహాలక్ష్మమ్మ. ఆమె పూర్తినామము కొంపెల్ల మహాలక్ష్మిసోదెమ్మ. కొంపెల్లవారు పెద్దాపురసంస్థానమునఁ జిరకాలము పౌరోహిత్యము నెఱపిన వెలనాటి వైదికబ్రాహ్మణులు.

చిచ్చుఱుకుటకు ముందు రాగమ్మాదేవి యొకసారి మనుమని నెత్తుకొని ముద్దులాడి ముప్పదికోట్లదేవత లాతని నరసి రక్షించునట్లుగా దీవించెను.

పిమ్మట రాగమ్మ బాలుని లక్ష్మమ్మచేతి కందిచ్చి యిట్లు చెప్పెను.

'తల్లీ! ఈ పేగును దీసి మీమెడలో వైచుచున్నాము. యాదవకులమునకు ముసలము వచ్చినట్లు రెండువందల సంవత్సరములనుండి యేకాధ్వరముగఁ బెద్దాపురసంస్థానమును బరిపాలించుచుండిన వత్సవాయివంశమునకుఁ గానిదినములు వచ్చినవి. ఈ సుప్రసిద్ధక్షత్రియవంశ మింతతో నిర్వంశము గాకుండ నీవంశాంకుర మెటులైన నిలిచి యుండవలయునని మాకోరిక-కావున నీబిడ్డ నిప్పుడే మీచేతులలోఁ బెట్టుచున్నాము. ఈపాపని నవమాసములు మోసి కడుపారఁ గనుటకే కాని చేతులారఁ బెంచుకొనుటకు మాకోడలికి ఋణము లేకపోయినది. ఇఁక నీముద్దుబిడ్డకుఁ దల్లియైనను, తోడైనను మీరే. మాకోడ లీపాపని గడుపునఁ గన్నది. మీరు కళ్ళను గన్నారు. అంతే భేదము. కావున నీతనిని మీ బిడ్డగా భావించుకొని యెన్ని కష్టములైన పడి తురకల చేతులలోఁ బడకుండ విజయనగరమునకుఁ దీసికొని పోయి మహారాజ్ఞి పాదములమీఁద వైచి మీరు గూడ నక్కడనే యుండి రక్షించుచుండవలసినది.

విజయనగరాధీశ్వరుఁడైన పూసపాటి సీతారామచంద్రరాజును, మా తిమ్మరాజును దోడియల్లుండ్రు. సీతారామచంద్రరాజుధర్మ పత్ని యీ పసిబాలునకుఁ బినతల్లి. ఈ చుట్టఱికపుసంగతులు మీ రెఱిఁగినవే. మీకు విజయనగరమునఁ దప్పక ఆశ్రయము దొరకును. కావున తురకల కంటఁ బడకుండ విజయనగరము చేరి యీ కసుగందును కాపాడ వలసినది. ఇది మా కోరిక. ఇంకొకజన్మమున మీ కడుపునఁ బుట్టి మీ యీ ఋణము దీర్చుకొందును.'

ఇందుకు లక్ష్మమ్మ త్రికరణశుద్ధిగ నొప్పుకొని యిచ్చినది. 'ప్రభుకార్య మవశ్యము నెఱవేర్తును. నాకంఠమునం దూపిరి యాడుచుండఁగా రాయజగపతి కేమియుఁ గీడు రానీయ' నను లక్ష్మమ్మ విశ్వాస్యవచనములు విని రాగమ్మయు, రాజపత్ను లును నిశ్చింతతో నగ్నిప్రవేశ మొనర్చిరి.

శిశువు నెత్తికొని పారాచౌకీలచెంతకు వచ్చుసరికిఁ దురక లెదురై లక్ష్మమ్మ నటకాయించి 'అక్కడాఁగుము. ఇతఁడు రాజపుత్రుఁడు. ఎచ్చటికిఁ దీసికొని పోయెద' వని గద్దించిరి.

తోడనే యామె 'అయ్యో! ఇది యేమి పాపము? నవ మాసములు మోసి కని పెంచిన నాపిల్లవానిని రాజపుత్రుఁ డనియెద రేమి?' యని నిర్భయముగ మాఱువలికెను.

'ఈపిల్లవాఁడు నీకొడుకేని వీనియెంగిలి తిని మాసందేహ మును దీర్పు' మని యొక తురకభటుఁడు జామిపండొకటి లక్ష్మమ్మ కిచ్చెను.

తక్షణమే లక్ష్మమ్మ ఆపండు బాలునినోట నిడి పిదపఁ దాను తినివేసెను. అందుపైఁ దురకభటులు బాలునితోఁ గూడ నామెను విడిచిపుచ్చిరి.

పరోపకారార్థము ప్రాణత్యాగ మొనర్చుటకంటెఁ గుల త్యాగ మొనర్చుటయే మిక్కిలి కష్టప్రదమని. ప్రాణత్యాగ మొనర్చిన వ్యక్తికి అంతటితో నిహలోకసంబంధము వీడిపోవును. కాని కులత్యాగ మొనర్చిన వ్యక్తిని బ్రతికియున్నంత కాలము 'నిది కులభ్రష్టమైన వ్యక్తి' యని అయినవారును గానివారును వ్రేలెత్తి చూపుచుందురు. ఇట్టి దుర్భరజీవితముకంటె మరణమే సుఖాంచితముగదా !

అందును వర్ణాశ్రమధర్మముల కాయువుప ట్టనఁదగిన హిందూదేశమున సంఘసంస్కరణవాయుప్రసారము బొత్తిగా లేని మూఁడుశతాబ్దులకుఁ బూర్వము కులభ్రష్టత్వమున కొప్పు కొనుట సర్వభ్రష్టగుటయే.

ఈపట్టున వర్ణాశ్రమధర్మవ్యతిరేకము పరోపకారచింతతో జరిగిన దని అట్టి వ్యక్తిని బ్రశంసించు విశాలహృదయులు కోటికొక రుందురేమో ?

అయితే అందుకు లక్ష్మమ్మ చింతింపలేదు. గాలిపాటు వంటి ఆవేశమునకు దాసోహముసేయు జనుల నిందాప్రశంసల నామె సరకుగొనలేదు. పాంచభౌతికమును, సాపాయమును నైన దేహమునకే గాని నిత్యమైన ఆత్మకుఁ జెందని కులమర్యా దల నామె పరిగణింపలేదు. 'కులమున కేమి ? రాజపుత్రుని రక్షించినఁ జాలు'నని ఆమె నిష్కర్ష చేసికొనియెను.

స్వామిభక్తి, పరార్థచింత లక్ష్మమ్మ నిందుకుఁ బురికొల్పినవి.

తురకలను మోసపుచ్చి కోటదాఁటి లక్ష్మమ్మ పెద్దాపురములోని తన ఇంటికి బాలుని దీసికొనివచ్చెను. ఆమెభర్త ఆమె పూనిన కార్యమునకు మిన్నందెను. ఆ బ్రాహ్మణదంపతులు రాజకుమారునితో విజయనగరమునకుఁ బయనమైరి.

రుస్తుంఖానునితో రాజమహేంద్రవరమునఁ దలపడి యోడి తోటపల్లిమన్యములకుఁ బాఱిపోయిన రామరాజు, సుబ్బన్న, రావు వేంకటకృష్ణారావును గొండవాళ్ళసాయమునఁ బితూరీ రేఁప యత్నపడుచుండిరి. కాని యింతలో మరణము తోసికొని వచ్చుటచే మన్యపుజ్వరములు తగిలి వారు మరణించిరి.

అంతట రావు వేంకటకృష్ణారావు సన్నిహితజ్ఞాతియైన రావు బుచ్చన్న పితూరీనాయకుఁడై దేశముపైకి వచ్చెను. రుస్తుంఖానుఁడు రావు బుచ్చన్నను బితాపురముకడ దాఁకి యాతని తల తీయించెను. సిమ్మటఖానుఁడు కళింగదేశముపై నెత్తిపోవఁ దలఁపుగొనెను.

ఇంతలో పెద్దాపురమునఁ దనభటులు యథార్థ మెఱుఁగ లేక రాజకుమారుని నిరపాయముగ వదలిపెట్టిన సంగతి యాతనికిఁ దెలియవచ్చినది.

అందు కాతఁడు మండిపడి బాలుని తిరిగి పట్టుకొనుటకు విశ్వప్రయత్నము లొనర్చెను. బ్రాహ్మణదంపతులు బాలునితోఁ జేబ్రోలుకడ దొరికిపోయిరి.

ఆతఁడు తమ బిడ్డఁడేకాని రాజపుత్రుఁడు కాఁడని పోదెమ్మ యెంతి గోల పెట్టినను ఖానుఁడు వినలేదు. పరీక్షించి చూచెదనని రుస్తుంఖానుఁడు కత్తులను, పుస్తకములను బాలుని ముందుంచెను. అసలింటిరాచబిడ్డ కావున నాయేడుమాసముల కసుగందు కత్తిమీఁదఁ జేయివేసెను.

అది కని కిరాతుఁడగు ఖానుఁడు సాభిప్రాయముగఁ దల పంకించి 'యిది పులిపిల్లగాని మేఁకపిల్లగా' దనుచు రాయజగపతిని ఖైదుచేసెను.

కడుపును, గాళ్లను బట్టుకొని బ్రతిమాలినమీఁదట లక్ష్మమ్మ కూడ గారాగారమున నుండి పిన్నవానిని బెంచుటకు ఖానుఁ డొప్పుకొనెను.

కారాగారమున రాయజగపతి జీవనస్థితి యొరుగాలిలో దీపమువలె నున్నది.

నిత్యమును దాను మొగము కడుగుకొనువేళ శిశువును దీసికొనివచ్చి యెదుటఁ బెట్టుచుండ వలయునని ఖానుని సుగ్రీవాజ్ఞ. ఆరాచబిడ్డ వీరశైశవమునకు ఖానుఁడు కండ్లలో కారము జల్లుకొనుచుండెను.

ఆరాక్షసుఁ డాబాలున కెప్పటి కెట్టి ఘాత తలపెట్టునో? పోదెమ్మ ఆత్మసుఖమును మఱచి శిశుసంరక్షణార్థము తపస్సు ధారపోయుచుండెను.

రాయజగపతి బాలారిష్టములఁ దప్పించుకొని పెద్దవాఁడై నూటమీఁద నూరేండ్లును బ్రతికి పెద్దాపురసంస్థానపాలకుఁడై విలసిల్లవలయునని లక్ష్మమ్మ వేయిదేవులకు మ్రొక్కని ఘడియ లేదు. వీలు చిక్కినపుడెల్ల ఆమె ఖానునిభార్యకడకుఁ బోయి

తన కన్నీళ్ళతో నామె కాళ్లుకడిగి తనకుఁ బుత్రభిక్ష పెట్టుమని పరిపరివిధములఁ బ్రార్థించుచుండెను. అఁడుప్రేగు కావున ఖానుని యిల్లాలు కనికరమూని పెనిమటి శిశుహత్య చేయకుండఁ గథ నడుపుకొనివచ్చినది.

సోదెమ్మ భర్తవలన నెప్పటి వర్తమాన మప్పుడు విజయనగరమున కందఁజేయుచుండెడిది.

విజయనగరమునుండి సాహాయ్య మనుకొన్నంతత్వరలో రాలేదు, అక్కడకూడ విషమపరిస్థితు లేర్పడుటచేత.

సీతారామచంద్రరాజు పితృవ్యపుత్రుఁడైన విజయరామ రాజుతో సంస్థానమును బంచుకొని వేఱుగా రాజ్యపాలనము చేయుచుండెను. విశేషప్రజ్ఞావివేకియగుటచే సీతారామచంద్ర రాజుప్రతిభ వీనుమిగిలినది. అందుకు విజయరామరా జీసూని విషప్రయోగము చేయించి సీతారామచంద్రరాజును దుడ ముట్టించెను,

అందుపై నాతని సహధర్మచారిణియు భర్తతో సాగు మానముచేసెను. ఇట్లు రాయజగపతి పినతల్లియుఁ, బినతల్లి భర్తయు మరణించుటతో విజయనగరమునుండి రావలసిన సాహాయ్యమునకు నీళ్లు వదలుకొని లక్ష్మమ్మ నిస్సహాయయై నిలబడెను.

ఇఁక నా యబలకు, నా యనాథబాలునకు దిక్కెవ్వరు?

ఆత్మప్రభ హెచ్చుటకై అన్నను జంపినను విజయ రామరా జన్నపుత్రుఁడైన ఆనందగజపతి యెడలను, వత్స వాయి రాయజగపతి యెడలను బ్రేమగలిగి యుండెడివాఁడు.

విజయరామరాజు ధర్మపత్ని చంద్రయ్యామ్మాదేవి కూడ నీ పసిపిల్లలయెడ నెనలేని ప్రేమ గలిగియుండెడిది.

అట్లగుట రాయజగపతిని జెఱవిడిపించి విజయనగరము నకుఁ గొనిపోవ రామరాజు సకలప్రయత్నములు గావించు చుండెను. ఈప్రయత్నములలోఁ గొన్నిసంవత్సరములు సాగి పోయినవి. ఇన్ని సంవత్సరములును లక్ష్మమ్మ తన ఆశ లన్నియు విజయరామరాజు చేయు సాహాయ్యముపై బోటాగ్గి రోజు లీడ్చుకొనుచు వచ్చినది.

నమ్మించి ద్రోహముచేసిన తన తండ్రిని నూరుద్దీను హుస్సేను డేరాకొయ్యలతోఁ బొడిచి చంపి పెద్దాపురమునుండి తాను పరిపాలనము ప్రారంభించెను.

ఇఁక నూరుద్దీను రాయజగపతిని జెఱ విడిపించునని జనులు సంతోషించిరి. కాని అతఁడు రాజ్యలోభమున జగపతి రాజుకారాగారబంధనముల మఱింత బిగలాగి తండ్రికిఁ దగిన కొడు కనిపించుకొనెను.

నూరుద్దీనుఖానుఁడు బాలుని వదలిపెట్టు నను ఆశ యి ట్లడఁగాఱినది. ఇంతియే గాదు, దినదిన మెస రేఁగుచున్న ఖానుని రాజ్యకాంక్ష రాయజగపతిని మట్టుపెట్టఁ బురికొల్పు నేమో యను భీతి ప్రేమభరాలసమైన సోదెమ్మ నవనీతహృద యమునం దాఱని అగ్నిహోత్రమువలె నుడుకాఱుచుండెను.

ఈవిషయము సోదెమ్మపెనిమిటి యెప్పటికప్పుడే విజయ నగరమునకుఁ గొనిపోవుచుండెను. విజయరామరాజున కేమి చేయుటకును బాలుపోవుటలేదు. త్వరపడి దండెత్తిపోయినచో ఖానుఁడు గోపించి బాలుని చంపునేమో ?

శిశువును గొని తెచ్చుటకు దండోపాయముతప్ప ఉపాయాంతరము బొడకట్టుట లేదు. బాలుఁ డున్నగదికిని కోట సింహద్వారమునకును నడుమ నేడు పహరాలుగలవు.

లక్ష్మమ్మకుఁదప్ప లాఁతివారికి రాజపుత్రుని దర్శనమే దుర్లభమై యున్నది.

చెఱసాలచెంత మెఱియలవంటి పచ్చితురకలు విచ్చుకత్తులతో షష్టిఘడియలు పహరా నిచ్చుచుందురు.

అట్టిచో సీవులినోటికండను విడిపించుకొను టెట్లు ?

ఇంతలో నూరుద్దీనుఖానుఁడు కళింగదేశమును లోఁగొనుటకుఁ బెద్దాపురమునుండి విజయయాత్ర వెడలెను. ఇట్టి సమయమునకై యెదురు తెన్నులు చూచుచుండిన విజయరామరాజు తగు సిబ్బందిని వెంటఁబెట్టుకొని రెండవకంటివానికిఁ దెలియకుండఁ బెద్దాపురమువచ్చి చేరెను.

అప్పుడు మహాలక్ష్మిసోదెమ్మ కనకముతోఁ గావలివాండ్ర కన్నులు గప్పి బాలుని చెఱనుండి తీసికొనివచ్చి విజయరామరాజుచేతులలోఁ బెట్టెను. వారలతో రామరాజు విజయనగరమునకుఁ దరలెను.

రాయజగపతికారాగారవినిర్గమనవార్త జలతైలబిందువై యంతటను బొక్కినది. ఖానుఁ డిది విని మండిపడి విజయరామరాజును వెనుదగిలెను. లడాయికిఁ బూనుకొని వచ్చుచున్న ఖానుని విజయరామరాజు చేఁబ్రోలుకడ నెదిరించెను.

అప్పుడు దారుణయుద్ధము జరిగినది. విజయనగరపువారి సేనలలో అనకాపల్లి బోయ లనఁబడు ఫౌజు రెండువేలమంది యుండిరి. వా రందఱును బిఱికికండలేని బిరుదుబంటులు. వారు

పరాక్రమించి నూరుద్దీను ఎక్కియున్న ఏనుఁగును చుట్టుముట్టి యంబారిత్రాళ్ళను తెగఁగోసి ఖానుని పట్టుకొని ఆతనితలను సొరకాయముచ్చికవలెఁ దఱిగిరి.

తమ ప్రభుని కలనిపాటు తిలకించి తురుష్కసైనికు లీఁగలవలె నెగిరిపోయిరి.

విజయలక్ష్మినొంది విజయరామరాజు బాలుని సురక్షిత ముగా విజయనగరమునకుఁ దీసికొనిపోయెను.

కొంపెల్ల మహాలక్ష్మిసోదెమ్మ చేతి చలువవలన రాయ జగపతి పెరిగి పెద్దవాఁడై తరతరములనుండి తన పెద్దలు పాలిం చిన పెద్దాపురసంస్థానమునకుఁ బాలకుఁ డయ్యెను.

లక్ష్మమ్మ ఉన్నతచరిత. ఆమెస్వామిభక్తి యెనలేనిది. అడుగడుగున నాపదలు హిమాలయపర్వతములవలె విఱిగి మీఁదపడుచుండినను బెంబేలుపడక ఆమె రాజపుత్రుని గాపాడినది.

తా నబల. పూనినది కొండంత కార్యము. ఏడుమాస ముల కసుగందు సంరక్షణము. గొడ్డు కసాయివాఁడైన రుస్తుంఖానునితో విద్వేషము. మార్గమధ్యమున ఖైదు. బాలు నికి దినదినగండము. విజయనగరమునుండి రావలసిన సాహా య్యమున కెప్పటికప్పుడే వెనుకబాటు. సాటిలేని స్వామిభక్తి, ఈడులేని పరోపకారచింతయు నామెను బ్రేరేచి యీయిక్కట్లు పాట్ల నతిక్రమింపఁ జేసినవి.

తుద కామె కృతకృత్యురాలై పెద్దాపురసంస్థానము నకుఁ బ్రభుభిక్ష పెట్టినది.

రాయజగపతివలెనే చిత్తూరురాణా ఉదయసింగు గూడఁ జిన్నతనమున దల్లిదండ్రులఁ బోఁగొట్టుకొనెను. విప్రవనిత లక్ష్మమ్మ రాయజగపతికి సంరక్షకురాలైనట్లే పున్న యనుదాసి ఉదయసింగునకుఁ బెంపుడుతల్లి యయ్యెను.

రాయజగపతి సంరక్షణార్థము లక్ష్మమ్మ స్వశరీరసుఖత్యాగము, కులత్యాగము నొనర్చి కడగండ్ల నతిక్రమించినది.

ఉదయసింగుక్షేమమునకుఁ బున్న గడుపారఁ గన్న తన తనయునే బలినెట్టినది.

పసితనమునందిట్టి స్వామిభక్తి గలిగిన స్త్రీరత్నముల ప్రాపు నొందిరి గావుననే రాయజగపతియు, నుదయసింగును బెద్దలై ప్రభుత నెఱపిరి.

పున్న, లక్ష్మమ్మలవంటి పూతచరితలు స్వార్థపరత్వముగల ఈమానవలోకమున గోవిందద్వాదశులవలె నరుదుగ లభ్యమగుచుందురు.

స్వార్థరహితమైన లక్ష్మమ్మ రాజసేవానిరతికి మెచ్చి విజయనగరాధీశులామెపేరిట లక్ష్మీపుర మను అగ్రహారమును గట్టించి యిచ్చిరి.

రాజ్యభ్రష్టత నొందిన ఆంధ్రరాజకుమారుల రహస్యరక్షణభారము వహించి పాటుపోటుల కాఁగి తుదకుఁ గృతకృత్యురాండ్రయిన ఆంధ్రస్త్రీలు ఆంధ్రులచారిత్రకగగనమున మువ్వురు మెఱయుచున్నారు.

ఒకర్తుక మన ప్రస్తుతవినుతికిఁ బాల్పడిన కొంపెల్ల మహాలక్ష్మిసోదెమ్మ.

రెండవయామె బొబ్బిలిఘోరయుద్ధమునాఁడు రాణి మల్లమ కుమారుఁడు వేంకటరంగారావుని సంరక్షింప దొరకొన్న దాసి వేంకటలక్ష్మి.

మూఁడవయామె తంజాపురి మధుర ఆంధ్రనాయక రాజుల యుద్ధ మప్పుడు తంజనగరరాజకుమారుఁడు చెంగమల దాసును సంరక్షింపదొరకొన్న దాది.

చెంగమలదాసు దాది క్రీస్తుశకము ౧౬౬౨-వ సంవత్సరమునను, మహాలక్ష్మమ్మ ౧౭౩౮-వ సంవత్సరమునను, వేంకటలక్ష్మి ౧౭౫౬-వ సంవత్సరమునను దమపైఁబడిన మహా కార్యనిర్వాహణమునకుఁ గడంగిరి.

వీరియం దిట్లుకాలముచే చెంగమలదాసు దాది ప్రథమ గణ్య కాఁగాఁ బడిన కష్టముచే మహాలక్ష్మమ్మ ప్రథమగణ్య యగుచున్నది.

రహస్యరక్షణము కోరుసరికి వేంకటరంగారావు ఐదు సంవత్సరములవాఁడు; చెంగమలదాసు నాలుగేండ్లవాఁడు; రాయజగపతి ఏడునెలల పొత్తులపాప.

ఆటలపాటల మరగిన బిడ్డల రక్షణముకంటె నడ్డాలలోని బిడ్డను సాఁకుట కష్టతరముగదా! ఆసాఁకుటయు సాధారణపరి స్థితులలోఁ గాదు, వివరింపరాని విషమపరిస్థితుల నడుమ.

వేంకటరంగారావును గాపాడుటలో వేంకటలక్ష్మి శత్రువులచేఁ జిక్కుటయేగాని కారాగారవాసకష్టమునకు గురి కాలేదు. చెంగమలదాసుని రక్షించుటలో నాతని దాది స్వయం కృతమైన అజ్ఞాతవాసమేగాని శత్రువులచేఁ జిక్కుటకూడ నెఱుఁగదు.

ఇఁక రాయజగపతిని రక్షించుటలో మహాలక్ష్మమ్మ పడని కష్టములేదు. గొడ్డుమాంసము తిను పచ్చితురకవాని కారాగారమున సంవత్సరములకొలఁది ఉండి ఆమె పంచకరపాటులు పడినది ; అగ్నిపరీక్షలకుఁ డాళినది.

కావుననే చెంగమలదాసు దాది, వేంకటలక్ష్మి, మహాలక్ష్మమ్మ అను మూఁడు నక్షత్రములలో మహాలక్ష్మమ్మ మహనీయ తేజమున వెలుఁగొందు చున్నది.

> "ప్రాణిలోకంబు సంసారపతిత మగుట
> వసుధపైఁ బుట్టి గిట్టని వారు కలరె?
> వారిజన్మంబు సఫల మెవ్వారివలన
> వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు."

# ౭

# సీతమ్మ

"దమయంతికైవడి రమణుని సేవించె
రుక్మిణివలె భాగ్యరూఢిఁ గాంచె
ననసూయపోలిక నన్నినోములు నోఁచె
వాణిరీతి పవిత్రవాణి యయ్యె
వినతచందంబున వినతశీలముఁ బూనె
రోహిణికరణి సద్రుచి వహించె
భూదేవిమాడ్కి సొంపుగఁ దాల్మిచే మించె
మితసూక్తి నెఱపె సుమిత్రభాతి
నన్నదానంబు లిడె విశాలాక్షిభంగి
భూప్రజలఁ గల్పలతవోలెఁ బ్రోదిసేసె
దంతులురి రామభూవరోత్తమునిపుత్రి
ఖ్యాతసద్గుణనికురంబ సీతమాంబ."

—రామవిలాసము.

ఇది క్రీస్తుశకము ౧౭౫౮-వ సంవత్సరము. అప్పుడు పెద్దాపురమునకు వత్సవాయి రాయజగపతి యేలిక. ఆతని పట్టపుదేవి సీతమ్మ. ఆమె పతివ్రతాశిరోమణి; కాట్రేనికోన నివాసుఁడైన దంతులూరి రామరాజుపుత్రిక.

సీతమ్మకు మన కథాకాలమునాఁటి కిరువది సంవత్సరములు; రాయజగపతి కిరువదినాలుగుసంవత్సరములు.

ఆతరుణదంపతుల ఆనుకూల్య మింతింతగాదు. ఏవిషయ ములందును పొరపొచ్చములులేక వారు చిలుకగోరంకలవలె సుఖముగా నుండిరి. ఇతరేతరానురక్తులగు నాయువయువతుల సుఖసంసార మను వృక్షమునం దమృతఫలముగాఁ దిమ్మరాజను కుమారుఁడు గలిగెను.

రాయజగపతి పాలుత్రాగు పసితనమునఁ దల్లిదండ్రులఁ బోఁ గొట్టుకొని కొంపెల్ల మహాలక్ష్మివలన రక్షింపఁబడి విజయనగరము చేరుకొనెను. ఆసంస్థానపాలకుఁడైన విజయరామరాజు తన అన్నపుత్రుఁడైన ఆనందగజపతిని, వత్సవాయి రాయజగపతిని సమానప్రేమతోఁ బెంచుచుండెను.

ఆనందగజపతియు, రాయజగపతియుఁ గొంచ మించుమించు సమానవయస్కులు. క్రీడాచపలమగు బాల్యముననే ఈరాజకుమారు లొండొరులయెడ నసూయ వహించిరి. కోడిపందెము లీయసూయను మఱింత వృద్ధిచేసెను.

కొంతకాలమునకు రాయజగపతి పెద్దాపురము నందును, ఆనందగజపతి విజయనగరము నందును బట్టాభిషిక్తులైరి. చిన్నతనమునం దంకురితమైన మాత్సర్య మింకను వారిహృదయములందు పాముపగవలె జాగరిత మగుచునే యుండెను. కావున వా రొండొరుల సాధించుటకుఁ దలఁపుఁగొనిరి. ఈతలఁపులు గార్యరూపమును దాల్చునా ?

తాల్ప కేమి ? తలపెట్టినవా రిరువురును సంస్థానాధీశ్వరులు. ఇరువురకును అంగబల మున్నది; అర్థబల మున్నది; కార్యరంగమునకు దుమికించుటకు వారిహృదయములందు సర్వదా జాగరిత మగుచున్న మాత్సర్య మున్నది.

పైఁగా నానందగజపతిని మహత్వాకాంక్ష యను పిశాచ మావహించినది. కావుననే ఆతఁడు ముందు కార్యరంగమునఁ బ్రవేశించినాఁడు. అందాతఁడు కార్యసాధనమే ప్రధానముగ నెన్నుకొనెను గాని ధర్మమును గాని నీతిని గాని పాటింపలేదు.

ఆనందగజపతి యెట్లో వంచనచేసి రాయజగపతిని, ఆతనిభార్య సీతమ్మను, వారి కుమారుఁడు తిమ్మరాజును బంధించుటకు ఉచ్చులు పన్నెను. రాయజగపతిమాత్రము వానిని దప్పించుకొనిపోయెను. సీతమ్మయుఁ, దిమ్మరాజును ఆనందరాజు ఖయిదులోఁ జిక్కిపోయిరి.

తప్పించుకొనిపోయిన రాయజగపతి భార్యాపుత్రులఁ జెఱవిడిపించు ప్రయత్నములో నాహారనిద్రల మఱచెను. పిఠాపురము జమీందారు రావు నీలాద్రిరాయని, కాకర్లపూడి వారిని మద్దతు చేసికొని క్రీస్తుశకము ౧౭౫౯-వ సంవత్సరమున ఆనందరాజు సానూను పోవుచుండఁగా రాయజగపతి యటకాయించెను. అది విని ఆనందరాజు వారిపైకి నాలుగు వేల రాణువను బంపెను.

ఉండుటకుఁ బెద్దాపురమువారిపక్షమునం దింతకంటె నెక్కువ సైన్యమే యుండెను. రాయజగపతిసైన్యము రెండు వేలు; రావు నీలాద్రిరాయని రాణువ రెండువేలు; కాకర్లపూడివారి ఫౌజు వేయి మొత్త మయిదువేలమంది పెద్దాపురమువారిపక్షమునం దుండిరి. కాని ఈసైన్యమునకు బహునాయకత్వదోషము పట్టెను.

యుక్తకాలమునం దిరువాగులవారును ఉండూరుకడఁ దలపడిరి. సందడికయ్యము జరిగెను. విజయనగరమువారి ధాటికి

నిలువఁజాలక రావు నీలాద్రిరాయఁడు పాఱిపోయి భద్రాచలము పట్టెను. వీరుఁ డగుటచే రాయజగపతి పట్టుదలతో నిలిచి పోరెను. తుదకు గుండుదెబ్బ తిని ఆతఁడు నేల కొరగెను. అది క్రీస్తుశకము ౧౭౫౯-వ సంవత్సరము డిసెంబరుమాసము.

మాత్సర్యపిశాచగ్రస్తుఁడైన ఆనందరాజు రాయజగపతి యుద్ధభూమిని పడిన వార్త విని ఆతనితల కొట్టి తీసుకొని రమ్మని ఆజ్ఞ యిడెను.

సత్యవరపు జమీందారుఁడైన రామభద్రపాయకరాయఁ డందుమీఁద ఆనందరాజు వద్దకుఁ బోయి యిట్లు చెప్పెను.

'మహారాజా! ఇట్టిపని చేయుట రాజధర్మము గాదు. మీతండ్రి మిమ్ములను, ఈ రాయజగపతిరాజును బెంచినాఁడు. వీరికిఁ బోయిన సంస్థానము నిర్వాహకము చేసినాఁడు. అట్టి వానిని మీరు తల కొట్టించినచోఁ జాల యపకీర్తి వచ్చును. కావున ఇప్పుడు మీరు పాలకి, బోయీలను పంపించి యుచిత గౌరవములతో నాతనిని దోడ్కొని వచ్చుట ధర్మము.'

ఏకళతో నుండెనో ఆనందరాజు పాయకరాయని మాటలు చెవిని బెట్టెను. 'మీరు పోయి జగపతిరాజును బాలకిలో నెక్కించి మోయించుకొని రావలసిన' దని ఆనందరాజతనితో ననెను.

తత్క్షణమే రామభద్రపాయకరాయఁడు పోయి రణభూమియందు వచ్చేప్రాణము పోయేప్రాణముగా నున్న వత్సవాయి రాయజగపతిని పల్లకిలో నుంచి ఆనందరాజుకడకుఁ దోడ్కొనివచ్చెను.

అచ్చట జగపతిరాజునకు గాయములు కట్టించెద మనిరి. 'అక్కఱలే'దని ప్రాణముకంటె మానమే అధికముగ నెన్ను ఆవీరాధికుఁడు సైగచేసెను. అట్లు కొంతసేపుండి మూఁడు జాముల వేళ రాయజగపతి దేహము చాలించెను.

ఈసమాచారము రామభద్రపాయకరాయఁడు ఖైదులో నున్న సీతమ్మతోఁ జెప్పెను. ఆపతివ్రత యీమాట వినుచునే సహగమనమునకు సిద్ధపడెను. ఆనందరాజున కీసంగతిని జెప్పఁగా నాతఁ డామె యిష్ట మెట్లో అట్లే కానిమ్మనెను.

సీతమ్మ సహగమనమునకుఁ బోవుచుఁ బాయకరాయ నితోఁ 'తండ్రీ! వత్సవాయివంశమున కెల్ల ఆధారమైన మా చిన్నవాఁడు ఖైదులో నున్నాఁడు సుమీ!' యనెను.

అనఁగాఁ బాయకరాయఁడు 'అమ్మా! తీసికొనివచ్చి పిల్లవాని నొకసారి చూపుదునా?' యనెను. అందుమీఁద నామె 'అయ్యా! వా రెందుకుఁ జూపనిచ్చెదరు? నిప్పులలోనికిఁ బోవుదానను నేను జూచి మాత్ర మేమి చేయఁగలను? అన్నిం టికి మీరే యున్నా' రనెను.

ఆమె పెనిమిటిచితి చెంతకుఁ బోయెను.

అప్పు డానందరాజుభార్యలు ఆచారము ననుసరించి సీతమ్మకుఁ బసుపుకుంకుమలను బంపిరి.

వానిని స్వీకరింపక ఆసాధ్వి వారి కిట్లు కబురుచేసెను. 'మీ కత్యంతసమీపకాలములో నిట్టియవస్థ తటస్థింప నున్నది. మీరు పరదేశమువారు గాన ఇప్పటినుండియు జాగ్రత్త పడ వలయును. ఈశ్వరకృపవలన మా కివి గలవు.'

'నాకుఁ గలిగిన యోగమే యానందరాజుభార్యలకు మూఁడునెలలు తిరుగకుండ సంభవించుఁగాక!' యను శాప వాక్యమును బల్కి యావిశుద్ధచరిత నిశ్చింతముతో నగ్నిప్రవే శము చేసి పునరావృత్తిలేని పుణ్యలోకమునకుఁ బోయెను.

సీతమ్మ శాపవాక్యమునకు భయపడెనో యేమో గాని ఆనందరా జున్నట్టుండి యామె సహగమనము చేసిన రెండు మాసములకు శక్తిపూజాధురంధరుఁ డైనాఁడు.

ఆతఁడు బెజవాడపోయి కనకదుర్గపూజ ప్రారంభించి నాఁడు. వలదని మంత్రిపుంగవులు వాదించిరి; హితశ్రేష్ఠులు వారించిరి. అయిన నాతఁడు మానలేదు.

పూజలుచేసి తిరిగివచ్చుచుండగా నాతనికి రాజమహేం ద్రవరము వచ్చునప్పటికి జ్వరము తగిలినది; స్ఫోటకము కనిపిం చినది; ఉష్ట్రికాయలంత పొక్కులు పొక్కి మూఁడుదినములకు (క్రీస్తుశకము ౧౭౬౦-వ సంవత్సరము ఫిబ్రవరి నెల ౨౫-వ తేదీని) ఆతఁడు మరణించినాఁడు. ఆతనిని ఖననము చేసిన స్థల మిప్పటికిని రాజమహేంద్రవరమునందు గోతిమీఁకూలమున మునిసిపల్ హైస్కూలునకు వెనుకతట్టున నేర్పాటుగా నుండి అలనాఁటి విషాదచరిత్రను దలఁపించుచున్నది.

ఆనందరాజుమరణము విని యాతని సహధర్మచారిణులు సహగమనము సలిపిరి.

సీతమ్మ శాపము, రాయజగపతి క్షోభ తగిలి ఆనంద రాజు మరణించినాఁడు; ఆతనిరాణు లగ్ని చొచ్చినారు; ఇఁక నేమి కీడు మూఁడ నున్నదో యని భయపడి విజయనగరము

వారు తమ ఖైదులో నున్న వత్సవాయి తిమ్మరాజును దీసికొని వెళ్ళి పెద్దాపురసంస్థానమునకుఁ బట్టముగట్టిరి.

ఇది యంతయు సీతమ్మశాపవాక్యఫలమగునా యని కొందఱు సంశయింపవచ్చును.

శపించి సీతమ్మ సహగమనము చేసిన తరువాత మూఁడు మాసములైన తిరుగకుండ ఆనందరాజు మరణించిన మాట, యాతని భార్యలు సహగమనము చేసిన మాట చారిత్రకసత్యములు. అట్లగుట సీతమ్మ శాపవాక్యము తప్పినదో, తాఁకినదో చరిత్రయం దేమాత్రపు విశ్వాస మున్నవారైనను సులభముగ నిర్ణయింపఁ గలరు.

విశుద్ధమైన ప్రవర్తనము, నిరుపమానమైన పాతివ్రత్యము గలిగి వఱలినవారి నోటినుండి వెలువడిన మాటలు వీర్యవంతములైన ఔషధములవలె నమోఘముగఁ బనిచేయు నని భారతీయత్వముగల వా రెల్ల రంగీకరింతురు.

"పెండిలినాఁడు, భూబృందారకులు గన్య
నప్పగించిరో లేదొ యధిపుఁ గూర్చి
సహచారిణివి గమ్మ సకలకాలమునందు
నిందుఁజందురుని చంద్రికయుఁ బోలెఁ
దొలుకాఱు మెఱుఁగులు విద్యుల్లేఖయును బోలె
ననుగమింపగఁ బాడి యతివ మగని
బిత్రృవనంబునదాఁక బతివిమానము వెంట
నై సేసి కొలనాడ గదలుభంగి
చితికికంఠ మొకింత లేకఱమి వేడ్క
జిచ్చులకుఁబోవు వికచరాజీవనేత్ర

కశ్వమేధంబుఫలము తథ్యంబు గలుగు
బదముపదమున కిది వేదభాషితంబు."

—కాశీఖండము.

అను పౌరాణికుని వచనమును సీతమ్మ సంపూర్ణచిత్తముతో నమ్మినది.

కడుపునఁబుట్టిన నొక్క కుమారునిగూడఁ దుదిసారి చూచుపాటి మోహమునకై నను పాలుపడక మగని పాదపంకేరుహములమీఁదనే తన మనస్సు నంతను లగ్నముచేసి యామె సాగుమాన మొనరించినది.

ఆంధ్రదేశమున నడచిన రాజకీయములగు సహగమనములలో సీతమ్మ చేసిన సహగమనము అతిలోకమైనది.

ఈయతిలోకమైన సహగమనము మూలమున మఱి కొన్ని సహగమనములు సంఘటిల్లినవి.

ఆదర్శకసతీత్వమును ప్రపంచమునకుఁ జాటు బూరగొమ్ములగు సహగమనములకుఁ బంటపొలమగు భారతభూమియందే యాంధ్రేతరభాగములం దిట్టిసంఘటనములు కానరావు. ప్రత్యేక మీసంఘటనములు ఆంధ్రజనని నోఁచిన నోములపంట.

బోయని కనురెప్పపాటులో భస్మీభూతము చేసిన దమయంతి, దావాగ్నిని జప్పగఁ జల్లార్చిన చంద్రమతి మున్నగు పౌరాణికపతివ్రతాశిరోమణుల పవిత్రచరిత్రములను దలఁపించు నాంధ్రపురంధ్రి సీతమ్మచరితము నాంధ్రసోదరీమణు లెల్ల వేళల స్మరించుచుందురుగాక!

౧౫

# మల్లమ్మ

"జవమున్ సత్త్వములేని మా తెనుఁగుదేశమ్మెల్ల సౌఖ్యమ్మడిన్
సవరింపంగల తావకీనశుభవర్చస్సుల్ మదిన్ నిల్పి, క్షా
త్రవతీ! నీయనిరూప్యభావనలఁ దోరమ్మైనగీతాలఁ గా
వ్యవిపంచిన్ బలికించుచుండెదరు మమ్మా, ఆంధ్రపుత్రుల్ సదా."

—వేంకటకాళిదాసకవులు.

క్రీస్తుశకము పదునెనిమిదవశతాబ్ది మధ్యభాగమున బొబ్బిలిసంస్థానమును రావు గోపాలకృష్ణరంగారావు పరిపాలించుచుండెను. ఆతఁడు కులమునకు వెలమ; జగదేకవీరుఁడు. శౌర్యనిధి వెంగళరావాతని సహోదరుఁడు. శూరనారియగు మల్లమ్మ రంగారాయనిధర్మపత్ని. ఆమె దామెర్లవారింటి యాఁడుబడుచు. దామెర్ల ధర్మారాయఁ డామె సోదరుఁడు.

ఆకాలమున విజయనగరసంస్థానమున కధిపతి విజయరామరాజు. ఇతఁడు క్షత్రియుఁడు.

ఇరుగుపొరుగు సంస్థానాధీశ్వరులగు రంగారావునకును, రామరాజునకును మనసులో రవరవలు పుట్టెను. తుదకవి ప్రబలశత్రుత్వముగాఁ బరిణమించెను.

క్రీస్తుశకము ౧౭౫౩-వ సంవత్సరమున హైదరాబాదు నవాబు నిజామల్లి ఉత్తరసర్కారులను (గంజాము, విశాఖ

పట్టణము, తూర్పు గోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు మండలములు) బరాసువారి కిచ్చెను.

చాలకాలమునుండి సరియైన జమాబందీలులేక ఉత్తర సర్కారులలోని జమీందారులు శిస్తులు బకాయిపెట్టి యుండిరి. అగుటచే ఆశిస్తుదస్తులు వసూలుచేయుట అత్యావసర మయ్యెను.

అందుకని పరాసువారి గవర్నరు బుస్సీదొర హైదరు జంగను తురకవానిని సిరస్తాదారుగాఁ జేకొని ఉత్తర సర్కారు లలో జమాబంది చేయునిమిత్తము ౧౭౫౬-వ సంవత్సరము నవంబరు నెల ౧౬-వ తేదీని హైదరాబాదులో బయలుదేఱి రాజమహేంద్రవరము వచ్చెను.

అచ్చట నాతఁడు కోటిలింగక్షేత్రమున మకాముచేసి జమీందారుల కందఱకుఁ దాఖీదులు పంపెను. ఆతాఖీదు లందుటయే తడవుగ జమీందారు లందఱును బుస్సీకడకు వచ్చిరి.

నవలక్షకళింగాధీశ్వరుఁడు విజయరామరాజు కూడ సపరివారముగఁ జనుదెంచెను. బొబ్బిలి జమీందారు రావు గోపాలకృష్ణరంగారావు మాత్రము రాలేదు.

దివాణమువారికిని, రావువారికిని రంధి కల్గించుటకు దివ్యమైన సమయము లభించినదని భేదనిపుణుఁడు విజయరామరాజు మేరమీఱిన సంతోషమున మునుకలువైచెను.

తాను బయలుదేఱుటకు ముందు విజయరామరాజు బొబ్బిలివారితో రాయబారము నడపెను. 'మీసేనల; మాసేనల నొకటిగాఁ గూర్చుకొని యేకస్థులమై బుస్సీదొరను తిరస్క

రింత'మని విజయరామరాజు రంగారావునకు వర్తమానము చేసెను.

'మీకు మేము మద్దతు వచ్చువారము కా' మని రంగారావు తిరిగి వర్తమానించెను.

అందుమీఁద నెక్కుడలేని కోపమువచ్చి 'ఈ సంవత్సర మేలాగుననైన రంగారావును సాధించి బొబ్బిలికోట స్వాధీనము చేసికొని దానిని గాడిదలచేత దున్నింపక పోయితినేని నాపేరు విజయరామరాజు కా'దని విజయరామరాజు కుడిమీసము దువ్వి శపథముపట్టెను.

ఈ శపథము నెఱవేర్చుకొనుటకు విజయరామరాజు పరాసుగవర్నరు బుస్సీని, ఆతని సిరస్తాదారు హైదరుజంగును మంచిమాట చేసికొన దలఁచెను. రామరాజు బుస్సీకి వెలలేని నజర్లు ఇచ్చెను. హైదరుజంగునకు లక్షరూపాయిలు లంచము పోసెను.

'జమీందారు లందఱును వచ్చిరి, బొబ్బిలి రావువారు మాత్రము రాలేదు. ఏమి కారణమున?' అని బుస్సీ సిరస్తాదారు నడిగెను.

రామరాజువలన లంచము తినిన హైదరు 'ఉత్తర సర్కారులలో బొబ్బిలి వెలమదొరలు ప్రతాపరుద్రులని పేరు కెక్కియున్నారు. బలగర్వమున వారు మన తాఖీదును పాటింపకుండిరి. విజయరామరాజు మన తాఖీ దందుటయే తడవుగా వచ్చి యేలినవారికి ఎదురుసేవలు చేసెను. బొబ్బిలివారు మనతాఖీదును గడ్డిపఱకగాఁ జూచి' రని బుస్సీతో ననెను.

'ఇది నిజమేనా?' యని బుస్సీ రాజు నడిగెను.

అప్పుడా రాజిట్లు చెప్పెను. 'ఏలినవారు సర్వమును జూచుచుండియు నిట్లడిగెద రేమి? బలగర్వమునఁ గానిచో బొబ్బిలివారు దివాణమన్న యెందుకు లెక్క చేయకుందురు? ఏలినవారు దీనినిగూర్చి శ్రద్ధవహించి కనుగొననిచో మిగిలిన జమీందారులకుఁ గూడ నవిధేయత నేర్పినవా రగుదురు.'

ఇది విని హైదరు 'నిజమే. బొబ్బిలివారిని శిక్షింపనిచో నిఁక నీప్రాంతమున దివాణమనిన లోకువగా నుండును. ఇతర జమీందారులు కూడఁ బెంకెతనము వహించి తిరుగుబాటు చేయఁగల' రని అందించెను.

ఈమాటలు బుస్సీకిఁ దలపట్టినవి. అగుటచే నాతఁడు బొబ్బిలికోట ముట్టడించుటకు నిశ్చయించెను.

'బొబ్బిలిని నాకుఁ బట్టముగట్టినచో బాకీపడియున్న శిస్తు యావత్తు వసూ లిచ్చి మీయాజ్ఞకు సదా బద్ధుఁడనై యుండఁ గల' నని విజయరామరా జప్పుడు బుస్సీదొరకు మనవిచేసి కొనెను. హైదరుసలహామీఁద బుస్సీ రాజునకు బొబ్బిలికోట ఫర్మానా ఇచ్చెదనని మాట కరారు చేసెను.

విజయరామరాజు తనపాచిక పాఱినందులకు పరమా నంద మందెను.

పరాసుసైన్యమును, విజయరామరాజు సైన్యమును బదునొకండు వేలకుఁ బైగా రాజమహేంద్రవరమునుండి బొబ్బిలి కోట ముట్టడికి బయలుదేఱి వచ్చి బొబ్బిలిపాటిమీఁద దండు విడిసెను.

బొబ్బిలివారి కీ గొడవ యేమియుఁ దెలియదు. వారు పెండ్లివేడుకలలోఁ బెనఁకువలు గొని యుండిరి.

సంధికోరనిచో సర్వనాశనము గలుగుట సత్యము. అగుట రంగారావు తన బావమఱఁది దామెర్ల ధర్మారాయని బుస్సీ చెంతకు రాయబారిగాఁ బంపెను.

ధర్మారాయఁడు పోయి బుస్సీతో నిట్లు చెప్పెను. 'మీరు మావిరోధి విజయరామరాజు మాటలు విని మామీఁది కన్యాయముగ, నాకస్మికముగ నెత్తివచ్చినారు. ఇందు మాచేసిన నేర మేమియు లేదు. దివాణమువారి తాఖీదు లందుసరికి మేము పెండ్లిసందడిలో నున్నాము. మాప్రభువు రంగారాయని తమ్ముఁడు వెంగళరావునకు వివాహము జరిగినది. అందువలన సకాలమున మాప్రభువు మీదర్శనమునకు రాలేక పోయెను.'

రాజుమంతనములు తలకెక్కిన బుస్సీ యిది విని 'ఇట్టి సమాధానములతో నింకఁ బ్రయోజనము లేదు. మీ బొబ్బిలిని మమ్ము నమ్మియున్న విజయరామరాజున కిచ్చుటకు మాట కరారు చేసితిమి, ఆడి తప్పువారము కాము. మామాటకుఁ దిరుగు లేదు. కావున మీరు బొబ్బిలివిడిచిపొండు. ఆజ్ఞానువర్తులమై యుందుమని బాసచేసిన యెడల పాలకొండపరగణా మీకీయఁగల' మని చెప్పెను.

'పితృపితామహాగతమైన రాజ్యమును విడిచిపోవలసిన అగత్యము మాకు లేదు. ఇలువెళ్ళి తొలఁగునంతటి శిక్షను బొందుటకు మాచేసిన నేర మేమియు లేదు. అవరోధనజనముచు దోడ్కొని పరభూములకుఁబోయి నవ్వులపాలగుటకు మేము పిఱికిపందలము గాము. బొందిఁగోఁ బ్రాణము లున్నంతవఱకు మేము బొబ్బిలి విడిచి పోవువారము గాము' అని ధర్మారా

యఁడు చచ్చు తెగవేసి బుస్సీదొర యెదుట గొమ్ముగవిఱిచి మాఱుపల్కెను.

సంధి పొసఁగలేదు. ఇఁక సమరమే శరణ్యము.

ఈ సంగతి ధర్మారాయఁడు బావ రంగారావునకుఁ జెప్పెను; చెల్లెలు మల్లమ్మకుఁ జెప్పెను.

అప్పుడు మల్లమ్మకు అంతులేని విచారము గల్గెను. వెంగళరాయని వివాహమునిమిత్తము వచ్చిన చుట్టాలతోటి దోసతోఁటవలెఁ గలకలలాడుచున్న కోట బగ్గంపాడు కావలసి నదేనా యని ఆమె విచారించెను.

'మాకెట్టి కష్టములు కలిగినను చింతలేదు. కాని పెండ్లి వేడుకలు చూడవచ్చిన వీరందఱు బొబ్బిలిపాటిమీఁద మర ణింపవలసి వచ్చునేమో యని విచారముగ నున్నది. వేడు కలలో నింకను సగము తరువాయియున్నవి. ఇప్పుడు వచ్చిన ముట్టడి కొన్నాళ్ళదనుక నాపఁగల్గినచోఁ దరువాయియున్న వేడుకలు జరిపించుకొనవచ్చును; వచ్చిన బంధువులను సుఖ ముగా వారివారి యిళ్ళకుఁ బంపివేయవచ్చును. అప్పుడీముట్టడి కలిగినను ఉత్సాహభంగమును, నిష్కారణ బంధుమారణ మును ఉండదు. కావునఁ గొంతకాలమువఱకు ముట్టడి నాపి యుంచు నుపాయము చేయుట మంచిది. ఈముట్టడికి మూల కారణము విజయరామరాజు గదా ! ఆతనిపేర నొక యుత్త రము వ్రాసినచోఁ గార్యకారిగ నుండఁగల' దని మల్లమ్మ యాలోచనచేసెను.

వేడుక చూడవచ్చిన చుట్టాల క్షేమముకొఱకై వెలమ కుల పౌరుషమున కెట్లో సమాధానము చెప్పి జాబు వ్రాయుట కామె నిశ్చయించినది.

లోకొలువున గూర్చుండి మల్లమ్మ విజయరామరాజు పేర రహస్యముగా నిట్లు లేఖ వ్రాసెను.

"సోదరా !

ఇన్నాళ్ళనుండి మిమ్ములనన్న దేవరగా నమ్మియుంటిని. దామెర్ల వారి సంస్థానము మఱచిపోయి పూసపాటివారి యిల్లే నాకుఁ బుట్టినిల్లనుకొంటిని. ఆడుబిడ్డను ఘోషపెట్టుట మీకు క్షేమముగాదు. తొల్లిటిపగలు మనసునం దుంచుకొని కాని సమయమున దేశ మెఱుఁగని పరాసువారిని మద్దతుగాఁ దీసికొని వచ్చి బొబ్బిలి ముట్టడించుట న్యాయము గాదు. మా వెంగళ రాయని వివాహము చూచుటకుఁ బసిపిల్లలు, పండు ముదుసళ్లు మొదలుగా నెందఱో చుట్టాలు వచ్చియున్నారు. ఎటువోయి యెటువచ్చినను వారికిఁ గష్టపాటు కల్గించుట మాతలఁపు గాదు. కావున నీసారి మన్నింపవలెను. సోదరులగు మిమ్ము సోదరినగు నేను నా నొసటి కుంకుమ, నాకాళ్ళ పసుపు, నాచేతి నల్ల గాజులు, నా మెడలోని నల్లపూస నిల్పుమని ప్రత్యేకించి కోర నవసరము లేదు.

ఇట్లు,

సోదరి, మల్లమ్మ."

దేవి మల్లమ్మ ఇట్లతికరుణముగ లేఖ వ్రాసి ముగించినది; నమ్మినదాది వేంకటలక్ష్మి చేతి కాలేఖ నందించి

'విజయరామరాజున కిచ్చి తిరిగి యుత్తరము తీసికొని ర'మ్మని పంపినది.

రాజసేవలో నేండ్లు కడచిన వేంకటలక్ష్మి యతిజాగ్రత్తగా విజయరామరాజు డేరాకుఁ బోయి యాతని దర్శనము చేసి జాబు చేతి కిచ్చినది.

అందుకొని రామరా జాలేఖను జింపి చదివినాఁడు. 'ముట్టడి మానుటకు వీలులేదు, రంగారాయని హతపఱుపఁ బ్రతిజ్ఞ పట్టియున్నాను. ప్రతిన నెఱవేర్చుకొని తీరెదను. కావలసినచో ముండగ్రాసమునకు నీకు మూఁడూళ్ళ నిచ్చెదను. ఇట్లని మల్లమ్మతోఁ జెప్పు'మని వచించి క్రూరకర్ముఁడు విజయరామరాజు వేంకటలక్ష్మిని వెడలనడపెను.

నిర్దయాత్ముఁడు విజయరామరాజు మాటలు వేంకటలక్ష్మివలన విని మల్లమ్మ కంటగిల్లెను.

'పాపాత్మా! ఈతీరున శిశుబాలవృద్ధులతోఁ బెండ్లిసందడిలో నున్న మాపై హఠాత్తుగ నెత్తివచ్చి మమ్ము హతపఱుపఁ గ్రూరకర్మమున కొడఁబడియున్నావు. నేను పతివ్రతనైనచో నీవు బొబ్బిలిపాటిమీఁదఁ బట్టుమని మూఁడుదినములయినఁ దిరుగకుండ దిక్కులేని చావు చచ్చెద'వని ఆ విశుద్ధ చరిత విజయరామరాజును శపించెను.

శత్రుసైనికులు ౧౭౫౭-వ సంవత్సరము జనవరి నెల ౨౪-వ తేది ఉదయమున బొబ్బిలికోట ముట్టడి ప్రారంభించిరి.

పరాసువారిపౌజును, విజయరామరాజు పౌజును గలిసి శత్రువులరాణువ పదునొకండువేలకుఁ బైగా నుండెను.

బొబ్బిలికోటలో వేయిమంది వెలమవీరులు, ఇతర సైనికులు నాలుగువేలు నుండిరి.

తమ్ము ముట్టడించుసేన రెట్టికి రెట్టి యున్నను బొబ్బిలి రావువారు పిఱుతివియని శౌర్యముతో, మొక్కవోని పౌరుషముతో నెనిమిదిగంటలకాలము కత్తులయుద్ధము చేసిరి.

'కత్తుల యుద్ధము చేయుచున్నంతకాలము మనము బొబ్బిలి రావువారిని గెలువఁజాల' మని విజయరామరాజు బుస్సీకి బోధించెను. అప్పుడు పరాసుసైనికులు తుపాకుల నందుకొనిరి.

సూర్యుఁడు నడిమింట సహస్రకిరణములతోఁ బ్రకాశించుచుండెను. కోటగోడలు తుపాకి దెబ్బలుతిని గుభేలు గుభేలునఁ గూలుచుండెను. శత్రుసైనికులు కోటగోడల కెగఁబ్రాఁకి లోనికిఁ జొఱఁబాఱుచుండిరి. శౌర్యఖనియని ప్రసిద్ధికెక్కిన బొబ్బిలికోట శత్రువుల కైవసమగుట గడియలలో నుండెను.

అపజయశంక గలిగిన వెంటనే రంగారావు నరసారాయఁడను వెలమవీరుని బిలచి తనచేతి పట్టాకత్తినిచ్చి జనానాను రూపుమాప నంతిపురమునకుఁ బంపెను.

తన పెనిమిటిచేతి పట్టాకత్తి పట్టుకొని వచ్చుచున్న నరసారాయని అల్లంతదూరమునఁజూచి మల్లమ్మ సర్వము గ్రహించినది.

వెంటనే ఆమె చిన్నవాఁడు, తన యేకపుత్రుఁడు నగు వేంకటరంగారావును జేరఁదీసి ముఖమునిమిరి ముద్దులుపెట్టి

నమ్మినదాది వేంకటలక్ష్మిని బిలిచి ఆబాలుని ఆమెయొడిలో నుంచి 'మాచెల్లెలు జగ్గమ్మ సాముర్లకోటలో నున్నది. ఈ బిడ్డ నెట్లయినను కష్టపడి ఆమెవద్దకుఁ జేర్పవలెను. రావువంశ మునఁ బుట్టిన ఈ నా చిట్టితండ్రి పెరిగి పెద్దవాఁడై శత్రు సంహారము చేసి కులదీపకుఁడు కాఁగలఁ'డని దీవించెను. బాలుని చేకొని వేంకటలక్ష్మి వెడలిపోయెను.

ఇంతలో నరసారాయఁడచటికి వచ్చెను. ఆతని చేతి నుండి కత్తిపుచ్చుకొని పొడుచుకొని మల్లమ్మ ప్రాణములు విడిచెను. అప్పు డావీరనారి వదనమున ఆనందము, అనంత తేజము తాండవమాడెను. ఆనాఁడు బొబ్బిలి వెలమకుటుం బాకాశమున మిక్కిలి ప్రకాశమానమగు నక్షత్ర మిట్లు తెగిపడెను.

తమరాణి మల్లమ్మ యిట్లగుటచూచి మానవతులగు నితర వెలమకాంతలు 'ఉగములు జగములు నుండఁబోము; ఎప్పటికైనను చావు ఉన్నదే; మానముకొఱకుఁ జచ్చుట యుత్తమ' మని నిష్కర్ష చేసికొని తమప్రాణములను నరసారా యని కటారి కెరచేసిరి. అందు క్రొత్తగఁ బెండ్లియైన పెండ్లి కూఁతురుకూడ నుండెను. ఆమానవతికిఁ బసుపుబట్టలతోడనే పంచత్వము లభించినది.

ఇట్లు మానముకొఱకు సంఘమరణమును వరియించి యానాఁడు బొబ్బిలి వెలమ వెలఁదులు వేలయెఱుఁగని సతీత్వ మున కాదర్శకురాండ్రయి వెలుఁగొందిరి.

స్త్రీలు లయముపొందిన తరువాత వెలమవీరులు రంగారావు నడపఁగా శత్రుసేనలపై దుమికిరి. అనిత్యమైన అస్థిపంజరముపై నాశవిడిచి, అనశ్వరమైన యశముపై దృష్టి నిలిపి వెలమవీరులు బొందిలోఁ బ్రాణము నిలిచినంతవఱకు కత్తి సాహసముతోఁ బోరాడిరి.

సాయంకాలమువఱకు ముట్టడి సాగుచునే యుండెను.

యుద్ధములో రంగారావు వీరశయనము నొందెను. తక్కిన వెలమవీరు లందఱును రణరంగమునఁ బ్రాణములను బాసిరి.

అప్పుడు చీఁకటులతోపాటు శత్రువులు చిత్రవధ నొందిన మానవతీమణులతో నిండియున్న బొబ్బిలికోటలో నిరాటంకముగఁ బ్రవేశించిరి.

నిరాటంకముగఁ బ్రవేశించిరి. ఆమేరకు విజయరామరాజు శపథము నెఱవేఱినది.

ఇఁక బొబ్బిలికోటను గాడిదలచేత దున్నించుట, దానికిఁ దాను పట్టాభిషిక్తుఁడగుట అవశిష్టమైయుండెను.

పంటమొగమునకు వచ్చిన ఈయవశిష్టశపథము తుద నెగ్గక మల్లమ్మ పతివ్రతంబున నింతతో తూలిపోవునా ?

తూలిపోకుండుటకుఁగాను విజయరామరాజు బొబ్బిలికోటలో డేరాలువేయించుకొని యందు విడిసినాఁడు.

'క్షత్రియుఁడు బొబ్బిలిపాటిమీఁదనే దిక్కుమాలిన చావు చచ్చునుగాక' అను వాక్యములతో మల్లమ్మదేవి స్వర్గవాసిని యైనది.

ఆ వాక్యముల నిప్పు డామె చచ్చి సాధించుకొనఁ గలదా ?

కలదు.

ఆమె ఈ వాక్యములు నిర్వహించుటకు బొబ్బిలి వెలమ వీరుఁ డొకఁడేని మిగిలియున్నాఁడా ?

ఉన్నాఁడు.

రంగారావునకు గుండెలీయఁగల మిత్రుఁడు, బొబ్బిలి బెబ్బులియను పేరుగొన్న వీరాధికుఁడు తాండ్ర పాపారాయఁడు అప్పటి కింకను రాజాముకోటలోనే రాణువతీరియుండెను. ఆత నికి బొబ్బిలికోటలో నాఁడు జరిగిన దారుణము తెలియనే తెలియదు.

ఆతఁడు సుఖసుప్తిలో నుండెను. బొబ్బిలిరాణి మల్లమ్మ ఆతనికి స్వప్నమునఁ గనఁబడినది ; నడచిన విషాదవృత్తాంత మంతయు నాతనికి వినిపించినది; మరణించుచుఁ దాను రాజును గూర్చి పలికిన వాక్యముల నాతనికిఁ జెప్పినది.

'నేఁడు ప్రభుపు రంగారావుగారికి తాండ్ర పాపారాయఁ డను సేవకుఁడుండియు లేనట్లే యైనది. రేపు ప్రభ్వీ మల్లమ్మకుఁ గూడ తాండ్ర పాపారాయఁడను సేవకుఁడుండియు లేనట్లు కాఁగూడదు.' అని మల్లమ్మ హెచ్చరించినది.

'తాండ్ర పాపారాయఁ డుండియు లేనట్లొక్కనాఁటికిఁ గూడఁగాదు. నాచేతి ఈ జిపోటులవలన దుర్మరణము నందుటకే విజయరామరాజు బొబ్బిలిపాటిమీఁద దాణ్యము వేసికొని యున్నాఁడు' అనుచుఁ బాపారాయఁడు లేచినాఁడు.

లేడికివలె లేచినదే యాతనికిఁ బ్రయాణమయ్యెను. 'విజయోస్తు' అని మల్లమ్మదేవి స్వర్గీయమైన ఆత్మ ఆతనిని దీవించినది.

పాపము విజయరామరాజునకు బొబ్బిలికోట పట్టాభిషేకలాభ మొనగూడలేదు.

పూతచరిత మల్లమ్మశాపము తగిలి యాతఁడు బొబ్బిలి పాటిమీఁద వెలమవీరుఁడు తాండ్ర పాపయ్యచేతి యీఁటె పోటులవలన దుర్మరణము నొందెను.

రామరాజు శపథ మిట్లు వీటిఁబోయినది. మల్లమ్మదేవి శాపము నెఱవేఱినది. విశుద్ధచరితులే వచనస్థితులు కాఁగలరు.

మల్లమ్మ చరిత్ర ముగిసినది. అగుటకు మల్లమ్మ వీరనారియే. కాని వెలమసంఘమున వెలసిన ఘోషాదురాచారమామె వీరత్వమున కుచితోపయోగ్యవృత్తి లేకుండఁజేసినది. ఇట్టి ఘోరదురాచారమే లేకుండినచో నిశ్చింతతోఁ బ్రాణత్యాగ మొనర్పఁగలిగిన ఆశూరనారి కత్తిపట్టి శత్రుబలముమీఁద నడచి చేతులు పొక్కినదాఁక యుద్ధముచేసి మఱెంత కీర్తి గడించి యుండియుండును.

ఏమైయుండి యుండిన నేమి? అవకాశము కలిగినంతలో ఆమె యనన్యమైన శౌర్యమును బ్రదర్శించినది. రాణివాసపు స్త్రీలందఱికంటె ముందుగాఁ దాను కత్తి కెరమై మానమెఱిఁగిన స్త్రీత్వమునకు మొదలిపేరైనది. బ్రతికియుఁ జచ్చియు నామె వారికి రాణియే యైనది.

వీరనారి మల్లమ్మ కీర్తిగీతమును జరిత్రాభిరతులగు నాంధ్రు లనేకవిధములుగాఁ బునశ్చరణ చేయుచున్నారు. ఆంధ్రహృదయము, కవితాత్మ కలిగిన వా రామె చరితము పాటగనో, పదముగనో, నాటకముగనో, నవలగనో, పద్య కావ్యముగనో, గద్యకావ్యముగనో రచియించి చరితార్థు లగుచున్నారు.

"ముగ్ధమయ్యును శౌర్యాగ్నిదగ్ధమైన
భవదుదారస్వరూపమ్ము పాదుకొనియె
నాంధ్రయావతహృదయరాజ్యాలయందు
మఱచిపోలేరు నీవీరమధురమూర్తి.
నీయమృతవాక్ప్రతిధ్వనుల్ నిలిచిపోయె
నాంధ్రయావతకంఠరవాధ్వములను,
నీరజోమూర్తి ప్రతిఫలించెడిని నాంధ్ర
నారివ్యక్తిత్వమందు ఓ వీరపత్ని!"

—పాటిబండ అలమేలుమంగతాయి.

౯

# రమణమ్మ

అంతులేని లజ్జాసాధ్వసములకు రాణులై గడపదాఁటి తలవాకిలి ద్రొక్కి చూడ నొల్లని ఆంధ్రకాంతలు కూడ నవసరమైనచోఁ గరమునఁ గటారిని గీలించి కదనరంగమున కుఱికినారు. శత్రుమర్దనమున మహిషాసురమర్దను లైనారు.

ఆంధ్రదేశచారిత్రకసంపుటముల నొకపరి పరికించితి మేని తనకు అంకితులుగా నొల్లకుండిన సామంతరాజులపై నాఁకొన్న ఆఁడుసింగమువలె నుఱికి వారిని పాదాక్రాంతులను జేసి మహాదేవరాయలంతటి వానిని ఓటుపుచ్చిన రుద్రమదేవి-మగబిరుదుగట్టి అశ్వారూఢయై ఆహవరంగమున కుఱికి కొసరు కొంకులులేక సేనకంతటికిని నాయకురాలై నాయకురాలను అన్వర్థనామము నార్జించిన నాగమ్మ మొదలగువారు మహిషాసురుని మర్దించిననాఁటి దేవీస్వరూపములను జ్ఞప్తి కెలయించు కత్తి విసరిన ఆంధ్రకాంతలు దృగ్గోచరమగుదురు. వారల చరిత్రలు విపులీకృతములై యున్నవి.

కటారి పట్టియుండిన వీరవనితలలో నొకతెయైనను ఇంతవఱకు విపులీకృతముగాని ఒకానొక ఆంధ్రవీరవనిత వీరచరిత మిట విస్తరింపఁబడుచున్నది.

అయితే కత్తివిసరిన ఇతర ఆంధ్రరమణీమణులకును ఈమెకును ఈషద్భేదముగలదు.

కటారిని వారు కదనము కొఱకుఁ బట్టినారు, ఈమె కదనము మూలమునఁ బట్టినది; వారు చంపుటకు, ఈమె చంపుకొనుటకు. కత్తిపట్టిన కారణమును, పట్టినకత్తి చేసిన పనియు నిట్లు వేఱైయున్నను ఫలముగా ప్రదర్శితమైన మహనీయగుణము మాత్ర మొక్కటియే.

చంపుటలో వా రెంత శౌర్యమును ప్రదర్శించిరో చంపుకొనుటలో నీమెయు నంతయే – ఒక వీసము హెచ్చేయనుట ఔచిత్యము– శౌర్యమును ప్రదర్శించినది.

ఉభయత్ర రిపు జయమే లక్ష్యము; ఆలక్ష్యసాధనము అక్కడ వైరివీరులను చెండి వారిని దరికి రాకుండఁ జేయుట చేత; ఇక్కడ తన్ను తానే చెండుకొని ఊపిరియుండగఁ దాను వైరులచేతఁ బడకుండఁ జేసికొనుటచేత.

ఇఁక నామె కథ వినుఁడు.

రమణమ్మ వెలమకాంత; దామెర్ల ధర్మారాయనిభార్య; బొబ్బిలిరాణి మల్లమ్మకు వదినె. బొబ్బిలికోటలో దారుణమగు సంఘమరణము జరిగి నప్పుడు రమణమ్మ నెలలునిండిన చూలాలు.

అపూర్వవ్యాధశిఖామణి నరసారాయఁడు కత్తినిబట్టి రమణమ్మ దగ్గఱకు వచ్చెను.

శాత్రవరక్తముతో దాహము తీర్చుకొనవలసిన కటారిని నరసారాయఁ డాత్మపక్షమునందలి అతివలపైఁ బ్రయోగింపవలసివచ్చెను. ఈపని నెఱవేర్చుట కాతనికి మొదట బొత్తిగా నిష్టములేక పోయినది. అయినను ప్రభువగు రంగారావు

తన చేతి పట్టాకత్తినిచ్చి పంపినపు డాతని కిది తప్పనిసరి యాయెను.

రంగారాయని సుగ్రీవాజ్ఞ ప్రేరేపఁగా నాతఁడు వెఱ్ఱి చోలవ దెచ్చుకొని యిద్దఱు ముగ్గురు స్త్రీలను జెండాడినాఁడు. అందుతో నాతని హృదయ మట్టి దారుణకృత్యమునకుఁ బరిచితమై కార్కశ్యము వహించినది.

జంకులేని హృదయముతో, సందేహింపని మనముతో నాతఁడు తక్కిన రమణులను దన కత్తిలవ్రేటుల కెరచేసినాఁడు.

ఇప్పు డాతఁడు సిందుచూలాలైయున్న రమణమ్మను సమీపించెను.

లోకభారము లోఁగొనిన విశ్వగర్భుని చిహ్నముతో వెలయుచున్న ఆ నిండుచూలాలిని చూచుటతోడనే నరసారాయని గరవాల మప్రయత్నముగ వెనుకకు లాగుకొని పోయినది. ఎంత ప్రయత్నించినను ఆమెను జంపుట కాతనికిఁ జేతులు రాలేదు.

కార్కశ్యము వహించిన ఆయపూర్వవ్యాధశిఖామణి హృదయము గూడ నప్పట్టునఁ జలించి పోయినది. వ్యాయామసుస్నిగ్ధమైన ఆతని దృఢకాయము గాలిలోఁ దీఁగవలెఁ గంపింపసాగినది. తుద కాతనికి దేహస్మృతియే తప్పి పోయినది.

పట్టుతప్పి యాతని చేతి పట్టాకత్తి ఖంగుమని క్రిందఁ బడెను. ఆఖంగుతో నాతనికిఁ దెలివి కల్గినది. తిరిగి కత్తిపట్టుటకుఁ బ్రయత్నించినాఁడు. కాని ఆతని నరములు తిరిగి తోడుకొని జిగి వహింపలేదు.

మానవతి రమణమ్మ యిది చూచెను. నరసారాయని బలహీనత గ్రహించి యిట్లనెను: 'నరసారాయఁడా! చెప్పి శత్రువులను బొడువఁగల వెలమవీరుఁడవు. అట్టి నీ వీయెడ సాహసముదక్కి, శౌర్యము నేది కొఱగానివానివలె నిలిచియుండెద వేమి? స్త్రీల మానము కాచుట వీరుల విధ్యుక్తధర్మము. ప్రభుని ఆజ్ఞ నెఱవేర్చుట సేవకుని ప్రథమవిధి. నీవు వీరుఁడవు; రాజసేవకుఁడవు. కావున విధ్యుక్తమైన వీరధర్మము నెంచి మీఱరాని రాజాజ్ఞను దలఁచి కత్తిని పట్టుము. నీపని నీవు నెఱవేర్చుకొనుము.'

నరసారాయఁ డీ వీరవచనములు వినెను. లజ్జచే నాతని వదనము వివర్ణమయ్యెను. కాని అపూర్వవ్యాథకృత్యముచేఁ గార్కశ్యము వహించిన ఆతఁడు ప్రబోధింపఁబడి కూడ నానిందుచూలాలిని వధింప సాహసింప లేకపోయెను. ఆతఁ డేమిచేయును? చేష్టలుదక్కి కొయ్యబొమ్మవలె నిలిచి యుండెను.

నివ్వెఱపడి నిర్జీవప్రతిమవలె నిలిచియున్న నరసారాయని జూచి—తుపాకిగుండ్ల దెబ్బలు తిని గుభేలు గుభేలుమని కూలుచున్న కోటగోడల చప్పుడు విని—బ్రతికియున్నచో రాఁగల మానభంగమును దలఁచి యిఁక జాగుచేసిన కార్యము కాదని రమణమ్మ రక్తసిక్తమై నేలపైఁ బడియున్న నరసారాయని కటారి నందుకొని తనంతట తానే పొడుచుకొనెను. బాగుగా ముదిరిన గెలతో గాలిదెబ్బకుఁ నేలఁగూలిన అరఁటిచెట్టువలె నానిందుచూలాలు నేలమీఁదఁ బడెను.

రమణమ్మచేసిన యత్యద్భుతదారుణము, ఉగ్రసుందర మునగు ఈకృత్యమును దిలకించి లోకజ్ఞుఁడగు కవి

"దేవతిర్యఙ్మనుష్యులం దీవిధంబు
పెంపు గనలే దటంచు నిలింపు లెల్ల
వెలమవెలఁదుక సాహసవిక్రమములు
భళిభళీయని పొగడి రభ్రమునసుండి."

—రం గ రా య చ రి త్ర.

అని ముక్తకంఠముతోఁ బలికినాడు.

ఏకాలము నందైనను, ఏదేశమున కైనను, ఏజాతి కైనను తన మానసంరక్షణప్రియత్వముచేఁ గీర్తి సముపార్జింపఁ గల ఆమానవతీమణి మానదేవత కిట్టి దారుణవిధమున బలి వోయెను.

మానముకొఱకు రమణమ్మ యెంతటి దారుణకృత్యము నొనర్చినదో? వింధ్యపర్వతమువలె విఱుచుకొని మీఁదఁబడు చున్న భ్రూణహత్యామహాపాతకమునకు ఆమె యిసుమంత యైన జంకలేదు; అగ్నిపర్వతమువలె హృదయగోళమునం దుడుకొఱుచున్న మాతృప్రేమకు ఆమె రవ్వంత యైనఁ జలింపలేదు.

అయితే రమణమ్మను మాతృప్రేమ తెగఁగోసిన గొడ్డురాలనికాని, భ్రూణహత్య కొడికట్టిన పాతకియనికాని అనుటకు వీలులేదు. మానసంరక్షణార్థము ఆమె యిట్టిపని చేసినది.

వీరవంతమగు బొబ్బిలిగడ్డపై ఊపిరిపీల్చుచున్న కొనిస స్త్రీలు గూడ మానభంగమునకు వెఱచి తమ ప్రాణముల నిచ్చివేయుచుండఁగా నిలువెళ్ళని వెలమకులమునఁ బుట్టిన ఆ రమణీమణి స్త్రీలకు ముఖ్యభూషణమగు మానమును గోల్పోయి బ్రతుకే బంగార మనుకొని చెడి జీవింపఁగలదా ?

పదునాఱవశతాబ్దిని ఉత్తరహిందూస్థాన మందలి గాధామండలసంస్థానాధీశ్వరియైన దుర్గావతి మొగలాయి చక్రవర్తి అక్బరుతో యుద్ధము చేయవలసి వచ్చెను. ఆసమర మునఁ దుదకు గాధామండలమువారికి అపజయశంక పొడ మెను.

అప్పుడు దుర్గావతి పవిత్రమైన తన శరీరము మ్లేచ్ఛుల చేతఁ జిక్కి మైలపడకుండుటకు ఆత్మసేవకులలో నొకనిని బిలిచి తన్ను ఖండింపఁగోరెను. అట్టి కానిపనికి సాహసింపలేక అతఁడు 'నావలనఁ గా' దనెను.

అందుమీఁద వెనువెంటనే వీరనారి దుర్గావతి తనకుఁ దానే పొడుచుకొని చనిపోయెను. వీరహృదయముగల అంగన అమానుషము జరుగుట భరింపలేదు.

అగుటనేకదా నెలలు నిండిన చూలాలై యున్నందునఁ దన్ను తెగటార్ప జంకిన నరసారాయని కాదని తనకుఁదానై పొడుచుకొని వీరాంగనారత్నము రమణమ్మ మృతినొందినది ?

రమణమ్మ వీరహృదయమును యథారీతిని వివరించు టకుఁగాని, ఆమె మానసంరక్షణప్రియత్వమును ఉచితరీతిని

వర్ణించుటకుఁగాని వాఙ్మయమునకుఁ దగినశక్తి లేదు. ఆంధ్ర కీర్తికిఁ గల్పాంతమువఱకు రక్షణదేవతలై వెలయఁగల ఆంధ్ర రమణీమణులలో వీరనారి, మానవతి యైన రమణమ్మ యెన్న దగినది.

"ఎన్ని నాళ్ళయ్యెనో విచ్చుకొన్న రక్త
నాళముల చిందిపోతి వుష్ణతరరక్త
మీ తెనుఁగు ధాత్రిపై నాహరించుకొందు
రాయసృక్తీక్ష్ణ తాభర మాంధ్రసతులు."

—పాటిబండ అలమేలుమంగతాయి.

శ్రీరస్తు

# ఆంధ్రరమణీమణులు

## (రెండవ భాగము)



'ఆంధ్రభూమి' సంపాదకుఁడు

ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

వ్రాసినది.

*

* *

# విషయసూచిక



* *

*

•

# ఉపక్రమణిక

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్రదేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥"

—మనుస్మృతి.

"ఎచ్చట స్త్రీలు పూజింపఁబడుదురో అచ్చట దేవతలు క్రీడింతురు; ఎచ్చట పూజింపఁబడరో అచ్చట అన్ని క్రియలు ఫలములేనివగుచున్నవి." అని మనువు చెప్పినాఁడు.

మనువు చెప్పినాఁడు. అవును. నిజమే. భారతీయుని కొఱకే.

కాని భారతీయుఁడు స్త్రీని దేవిగఁదలఁచి పూజించు సంగతి విస్మరించి చాలకాల మైనది.

ఆతఁడు స్త్రీస్వభావమును అనుమానించినాఁడు. అనుమానించి ఆమెను అవమానించినాఁడు. ఇంటి నాలుగుగోడల సందున స్త్రీని ఆతఁడు ఖైదుచేసినాఁడు; అంధకారమునఁ జెరలాడించినాఁడు.

ఆ పంజరకీరమునకు వంటయిల్లే వైకుంఠమైనది; కుటుంబమే కైలాసమైనది. శ్రమయెఱుఁగక కుటుంబవ్యక్తులను సేవించుటలో నాస్వార్థత్యాగిని జీవితము గడపినది. అంతియే కాని సంఘజీవిక సేవని చేయుటకును ఆమెకు అవకాశము లేక

పోయినది. అట్టిచో నింక దేశముమాట తలంచుటకే వీలులేదు కదా !

విద్యలేక వికాసములేక ఇట్లు పరాభవింపఁబడిన స్త్రీ పతనము నొందినది.

ఫలమేమి కల్గినది ?

పతనమునొందిన స్త్రీ తన జన్మప్రదాయిని. పతనము నొందిన స్త్రీ వహ్నిసాక్షికమగు సఖ్యమున జన్మాంతమువఱకు తన పార్శ్వవర్తిని—అయిఉండఁ బురుషునిబుద్ధికి ఉద్గమనశీల మెక్కడ ? ఆతని ఆదర్శములకు ఔన్నత్యమెక్కడ ?

తన తనయులకు ఉద్గమనశీలమగు బుద్ధి ; ఉన్నతమగు నాదర్శము లేకుండుటవలన శతాబ్దులనుండి భారతమాత దైన్యము ద్రవ్వెడు కన్నులతో నధోముఖయైయున్నది.

ఈ ప్రబోధసమయమునందు హిందూదేశమునకు ముఖ్యావసరము లేవి యని సమయశాంఖికుని ప్రశ్నింపుము. దానికి ఆతఁడు విద్యావతియైన తల్లి, విద్యావతియైన భార్య అని ఘోషించును.

జాతి నాగరకతాబీజములను పెంచి పోషించు ఆదిశక్తి తల్లి; జాతిమూర్తికి రూపసిద్ధినిచ్చి తన్మహనీయస్థితి నిల్పు శిల్పిని భార్య.

లాలన మెఱిఁగిన తల్లిచేతులతోడనే బిడ్డకు అక్షరాభ్యాసము కావలయును. ముగ్ధమోహనములైన భార్య మాటలతోడనే పురుషునకు ఉత్సాహచైతన్యములు కలుగవలయును.

మాతృదేవి వాక్కులు ప్రేమపూరితము లైనంత మాత్రమునఁ జాలదు; ఆమె సంకల్పములు గంభీరములు గావలయును. అర్ధాంగి చిఱునవ్వు చివురులు దొడఁగినంత మాత్రమునఁ జాలదు; ఆమె దృక్కులు తమోభేదకములు గావలయును.

గృహస్థాశ్రమమున నూతనముగఁ బ్రవేశింపఁబోవు యువకుఁడు సంఘసేవ, సారస్వతసేవ, దేశసేవ, మానవసేవ చేయ నుత్సాహముతో నుఱకలు వేయుచున్నాఁడు.

కాని ఆ ఉత్సాహము అచిరకాలముననే చల్లారిపోవు చున్నది. ఉత్సాహమే చల్లారిపోయిన ఆతని కింకఁ గార్యశౌర్య మెక్కడ? ఇట్లగుటకుఁ గారణ మేమి?

తల్లియు, భార్యయు విద్యావతులు కాకపోవుటయే.

విద్యావతికాని తల్లికి లాలించు నేర్పేకాని మనశ్శక్తులఁ బెంచు యోగ్యతలేదు. విద్యావతిగాని భార్యకుఁ బ్రేమ చిలికించు తెలివియేకాని చైతన్యము ప్రసాదించు ఉత్సాహము లేదు.

సంఘసేవకుఁడు, సారస్వతార్చకుఁడు, దేశోద్ధారకుఁడు, మానవకళ్యాణమూర్తి కావలసిన యువకుఁ డీకారణమున ఆత్మ కుటుంబమును ఆరాధించు పూజారి యగుచున్నాఁడు; ఉత్పథము నుండి యధఃపతితుఁ డగుచున్నాఁడు.

ఏనాఁడు బిడ్డకు అక్షరాభ్యాసముచేయు యోగ్యత తల్లికిఁ గల్గునో, ఏనాఁడు పురుషునకుఁ గార్యశౌర్యము ప్రసాదించు నుత్సాహము భార్యకుఁ గల్గునో ఆనాఁడు భారతయువ

కుల కీపూజారితనము తొలఁగిపోవును. అప్పుడు భారతసంఘము అభ్రంకషమైన ఉత్తమపథము నందును.

కావున స్త్రీకి అట్టి యోగ్యత, అట్టి ఉత్సాహము కలిగించుటకు భారతదేశమున నేఁడొక విపులసత్ప్రియత్నము జరుగుచున్నది.

ఈ విపులసత్ప్రియత్నము సత్వరసత్ఫలము నందు సాధనములలో అనుకరింపఁదగిన రమణీమణులచరిత్రలు స్త్రీలచేఁ జదివించుట యొకటి.

## ౧

# చానమ్మ

'విఱిగి వచ్చిన ప్రాణవిభునకు బసు పిచ్చి
వేడినీళ్ళను తోఁడె కోఁడ లొకతె'

—రాయప్రోలు సుబ్బారావు.

బ్రహ్మతేజము, మహాక్షాత్రము నొక్కటఁ దనయందు చిక్కఁబట్టి పరశురామునివలె 'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర' మ్మని చాటి చెప్పి యసహాయశూరుఁడై యొప్పిన తనపతి యొకప్పుడు విధివశముచేత స్వబలము చెల్లాచెదరు కాఁగా రణరంగమునం దొంటరిపాటున నిలువరాక వీరవిహారము విరమించి యింటికి వచ్చుట చూచి, ఆతనికి వీరసందేశమిచ్చి ప్రబోధితుఁ జేసి సమరోన్ముఖుఁ గావించి వీరస్వర్గ మిప్పించిన ఆంధ్ర వీరపత్ని చానమ్మ ధన్యచరిత్ర మాంధ్రలోకమునకు నందు ముఖ్యముగ నాంధ్రరమణీమణులకును బ్రాతస్స్మరణీయము గదా!

చానమ్మ తిక్కన యర్ధాంగి. వీరవిక్రమములు నెఱపి యాతఁడు 'ఖడ్గతిక్కన, రణతిక్కన' యను బిరుదుబీరములు వహించెను. తిక్కన కొట్టరువు సిద్ధయామాత్యుని జ్యేష్ఠ పుత్త్రుఁడు.

విరాటపర్వముఁ దొట్టి తుదముట్ట నాంధ్రమహాభారతము 'నాంధ్రావళి మోదముం బొరయ' 'బుధసంతోషము

నిండార' రచియించిన తిక్కనసోమయాజీతనికిఁ బినతండ్రి కుమారుఁడు.

పదమూఁడవ శతాబ్దియందు విక్రమసింహపురమున (నెల్లూరున) రాజ్యమేలిన మనుమసిద్ధిరాజునకు మంత్రిమణియై, సేనానియై రణతిక్కన వెలుగొందెను.

యాదవులకుఁ గాటమరాజు ప్రభువు. ఆతఁడు కనిగిరి సీమలోని యెఱ్ఱగడ్డపాడున కధిపతి.

కనిగిరిసీమలో నొకప్పు డనావృష్టి దోషము సంభవించెను. పచ్చికబీళ్ళన్నియు నెండి యెడారు లగుటచేఁ బశువులకు మేఁత కఱవై నది.

అప్పుడు కాటమరాజును, యాదవులును దమ పసుల మందలను మనుమసిద్ధిరాజు మేఁతబీళ్ళకుఁ దోలికొనివచ్చి పుల్లరి నిచ్చు నొడంబడికపైని తొలకరించువఱకును మేపుకొనిరి.

పశువులమేఁతయైనఁ బిదప వారక్కడ తమ కోడెదూడలలో నేదో నష్టము కల్గినదన్న నెపమునఁ బుల్లరి నెగవేసిరి. అందుపై మనుమసిద్ధిరాజాలమందల నటకాయించెను. అప్పుడు పోరు పొసఁగెను.

సిద్ధిరాజు గొప్ప సైన్యమును సమకూర్చుకొని సమర సన్నాహములు సాగించెను.

తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేఁగి చొక్కరాజు, పెద వరదరాజు, అర్లుకొండ అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగరాజు, ఉర్లకొండ

సోమన్న, ఉదయాద్రి ఉమ్మయ్య, చెన్నపట్టణము చంద్రశేఖరుఁడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పాపతిమ్మరాజు, వెలకంచి వెంగళపతిరాజు, ప్రభగిరి పట్టణము పద్మశేఖరుఁడు మున్నగు యోధులు మనుమసిద్ధిరాజునకు బాసటయై వచ్చి నిలిచిరి.

ఈ వీరు లందఱకు ఖడ్గతిక్కన మొనగాఁడై జైత్రయాత్రకు వెడలెను.

కాటమరాజు కూడ యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

పల్నాటి ప్రభువైన పద్మనాయఁడు, పల్లికొండ ప్రభువైన చల్ల పిన్నమనాయఁడు, దొనకొండ అయితమరాజు, ఎఱ్ఱయ్య, పాచయ్యనాయఁడు, ముమ్మయ్యనాయఁడు, పుత్తమరాజు మొదలగు యాదవవీరులు కాటమరాజునకుఁ దోడ్పడ వచ్చిరి.

ఈ సైన్యమున కంతయుఁ బిన్నమనాయని మంత్రియైన బ్రహ్మరుద్రయ్యయను నారాధ్యబ్రాహ్మణుఁ డాధిపత్యము వహించెను.

ఉభయవాహినులును పాలేటియొడ్డునఁ బంచలింగాల కొండకడ డాకొని తలపడియెను.

అప్పుడు దొమ్మియుద్ధము జరిగినది.

అందు సిద్ధిరాజుసేనలు యాదవవీరులఁ బరాక్రమ ధాటికి నాగలేక వీఁగఁబాఱఁజొచ్చెను. సిద్ధిరాజుసేనానియగు ఖడ్గతిక్కన ధైర్యము చిటిలిపోయినది. ఇంతకు మున్నె న్నడు ఖుసిపోని అతని ఖడ్గధాటి మొద్దువాఱెను.

నిజబలములు చేవదొఱఁగి చెట్టొకపిట్టయై చెదరిపోఁగా నొంటరిపాటున యుద్ధభూమియందు నివ్వెఱపడి నిలిచియున్న తిక్కన్నను దిలకించి ప్రతిపక్షయోధుఁడైన పిన్నమనాయఁడు

'పోరు నిలుపుమోయి భూసురోత్తముఁడ !
సరిగాదు మాతోడ సమరంబు సేయ
అగ్రజుల్ మీరు, యాదవులము మేము
ఉగ్రముల్ మామీఁద నుంపంగరాదు.'

—కాటమరాజు కథ.

అని అహమికతో నెత్తిపొడుపు మాట లాడెను.

అపుడు తిక్కన్న చేయునదిలేక తన దురదృష్టమునకు దురపిల్లుచు మఱల నింకొకప్పుడు సేనలఁ గూర్చుకొని వచ్చి తలపడవచ్చునని తలంచి సంగ్రామరంగమునుండి గుఱ్ఱమును మఱలించుకొని పురమునకు వచ్చెను.

వైరికి వెన్నిచ్చివచ్చిన తిక్కన్నను జూచి విక్రమసింహపురవాసు లీసడింపు పలుకు లాడి వికావికనవ్విరి.

అవును, నవ్వరా? అయినఇంటఁబుట్టి కానిపని చేసినచో నవ్వరా ?

పుట్టినది శౌర్యమునకు విశ్రామభూమియగు కొట్టరువు వారి వంశమున; పూనినది అసాధారణము, అనన్యదుస్సాధము నైన వాహినీపతిత్వము; చేపట్టినది కఠోరఖడ్గము; వహించినది 'రణతిక్కన' యను వీరబిరుదము. అట్టిచో పగఱకు వెన్నిచ్చినయెడల నవ్వులపాలు గాకుండునా ?

ఈసడింపు వాక్యము లాతని కింటియందు విస్తరించి వినిపించినవి. 'కడుపు చెఱుపఁబుట్టిన ఈబరిగొ'ట్టని సిద్ధయామాత్యుఁడు కొమారునియుల్ల ముచ్చిపోనాడెను.

తిక్కన్న స్నాన మాడఁబోవ నాఁడువారు జలకమాడు మఱుఁగుపట్టున భార్య చానమ్మ నులకమంచ మడ్డుపెట్టి దానిపైఁ బసుపుండనుంచి నీళ్ళబిందెఁ దెచ్చిపెట్టెను.

'ఇదియే'మని వ్యసనపడి యాతఁ డడుగఁగా చానమ్మ

'పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెందున్?
ముగు రాఁడువార మైతిమి ;
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్.'

—చాటుధార.

అని ముదలకించి నూటిపోటు మాటలాడెను.

'ఇంతవఱకును ఈయింట అత్తగారును, నేనును ఇరువురమే స్త్రీలము. ఇపుడు యుద్ధభూమినుండి పారిపోయి వచ్చి మీరును ఆఁడువారితో జమ ఐనారు. ఇక ఈయింట ఆఁడువారము ముగ్గురమైతిమి. కావున తమరు పడఁతివలెఁ బసుపు రాచుకొని జలకమాడుఁడు' అని చానమ్మ వాఙ్మయమైన శరములతో పతిహృదయమును తూటాడించెను.

ఇన్నాళ్ళదనుకఁ దలలో నాలికవలె ననుకూలవతియై యుండిన అర్ధాంగినాఁ డిట్లు బెడిదురాలై యుండుట గమనించి కించపడి చేయునది లేక యాతఁడు భోజనమునకు లేచెను.

తల్లి ప్రోలమ్మ యన్నములో అతనికి విఱిగిన పెరుగు పోసెను. 'ఇది యే' మని యాతఁ డనఁగా నామె త్రుంచివైచినట్లు

'అసదృశముగ నరివీరుల
మసిపుచ్చక విఱిగివచ్చు మగపంద క్రియన్
గసపున్ మేయఁగఁ బోయిన
పసులన్ విఱిగినవి, తిక్క! పాలు న్విఱిగెన్.'

—చాటుధారం.

అని తూటారించి తూలనాడెను.

చేసికొన్న భార్య యట్లు చెంగనాడెను. కడుపారఁగన్న తల్లి కక్కసించి యిట్లు త్రుంచివైచెను. అందుతో ఆతనికి ఉక్కు రోషమువచ్చినది.

వైరుల శరవర్షమునఁ జప్పఁగఁ జల్లారిన ఆతని శౌర్యమును నిప్పుకణములవంటి వారిపోటుమాటలు లేవంజోపి రవులఁ బెట్టినవి.

చిరకాలసముపార్జితమైన వంశప్రతిష్ఠ రూపొంది యప్పుడు తిక్కసేనాని నిట్లని హెచ్చరించెను.

'విజయాధిపుని దాడి వెనువెంటఁ దగిలినఁ
ప్రాణముల్ దాచిన పందగజము!
పెంపేది పాలేట బిరుదు లన్నియు వైచి
పరుగెత్తి వచ్చిన పాఱుఁబోత!
దురములోఁ జావక దొరలెల్ల హాసియింప
మంచాన కొరిగిన కొంచెకాఁడ!
చతురంగబలముతో సమరంబు సేయక
మానంబు విడిచిన మందబుద్ధి!

యనుచు నార్వేలవారు ని న్నుపహసింప
ధరణి నెల్లూరిలో నెట్లు తిరుగఁగలవు ?
వైరులను గెల్చి సత్కీర్తి వఱలుమయ్య !
మంత్రికులహేళి ! తిక్కనామాత్యమాళి !'

—చాటుధార.

అంతట తిక్కన్న తినుచున్న యన్నము విడిచి లేచి వెంటనే గుఱ్ఱమునెక్కి యుద్ధభూమి కుఱికాయించెను.

అయితే ఇపు డాతనికి జయసంపాదనము ప్రధాన ప్రసక్తి గాదు.

కొట్టరువువారి వీరవంశమునకుఁ దనమూలమున వచ్చిన మచ్చ దుడిచివేయవలయుననియే ఆతని ప్రస్తుతదీక్ష.

ప్రాణములకుఁ దెగించిన పరశురాముఁడు ఖడ్గముతోఁ గదనరంగమునఁ జొఱఁబడెను.

తిక్కదండనాథాగ్రణి ఖడ్గఘాటికి మాఱులేకుండెను. 'వచ్చినవాఁడు ఫల్గునుఁ' డని యాదవవీరులు బెదరిరి; పరిభ్రమించిరి.

సమరాంగణమున రణతిక్కన పచరించిన యుద్ధక్రమమును జరిత్రకారుఁ డి ట్లభివర్ణించుచున్నాఁడు.

'పదటున వాజిరాహుతులపై దుమకించుచుఁ దిక్కఁ డార్చినన్
బెదిరి పరిభ్రమించి కడుఁబిమ్మట వీరులు భీతచిత్తులై
యదెయదె డాలు వాల్మెఱుఁగు లల్లవె అల్లదె యాతఁ డంచనన్
గొదుకక యాజిఁజేసె రిపుకోటుల కందఱ కన్నిరూపులై.'

—చాటుధార.

ప్రతి యెవ్వరును లేక వీరవిహారము సల్పుచున్న ఖడ్గతిక్కన్నను గని యాదవులసేనాని బ్రహ్మరుద్రయ్య ముందునకు వచ్చెను. ఆ విప్రవరుల కిరువురకును జాలసేపు ద్వంద్వయుద్ధము జరిగినది. తుద కిద్దఱును నేల కొఱగిరి. అప్పుడు క్షాత్రమిళితమైన బ్రాహ్మణ్యము రక్తస్రవంతులతోఁ బ్రవహించినది.

ఇట్లు మొక్కవోని అసహాయసాహసుఁడై విక్రమపౌరుషాదుల నెఱపి వీరస్వర్గమును జూఱలాడి

'చిక్కక మన్మసిద్ధివిభుచే ముచుగొన్న ఋణంబు దీర్చె మా
తిక్కనమంత్రి సోమశిలదేవర సాక్షిగఁ బెన్న సాక్షిగా
నెక్కిన వాజి సాక్షిగ మహి న్నుతికెక్కిన కీర్తిసాక్షిగా
స్రుక్కక మారుకొన్న రణశూరులు సాక్షిగఁ గొండసాక్షిగన్.'

—చాటుధార.

తనపతి వీరశయన మలంకరించిన శుభ వర్తమాన మాలించి వీరపత్ని చానమ్మ నిశ్చింతతో సహగమనము చేసినది.

సమరధర్మము వీసరఁబుచ్చి వచ్చిన ఖడ్గతిక్కన్నకు వీరసందేశ మిచ్చి రణమునకుఁ బంపి యాతనికి వీరస్వర్గసుఖమిప్పించి యాతఁ డపయశఃకూపమునఁ బడకుండఁ గాపాడిన కీర్తివనితాశిరోమణియగు చానమ్మది.

పతి కెదురాడ నోడి చానమ్మ మూగయై యుండినచో 'ఖడ్గతిక్కన, రణతిక్కన' యని జనామోదమునొంది యున్న పతి బిరుదుబీరములు బెడిసకొట్టి యుండును; యశోభరితమగు కొట్టరువువారి వంశము దుర్యశఃపంకమున బ్రుంగుడువడి యుండును; ప్రోలమాంబ వీరమాత యగుటకు బదులు భీరు

మాత్రమై యుండును ; విశేషించి తాను వీరపత్ని యనిపించు కొనుటకు వీలులేకుండియుండును.

ప్రమాదించిన పతికి విధ్యుక్తవీరధర్మము జ్ఞప్తికిఁ దెచ్చి పరువుమర్యాదలు నిలిపి చానమ్మ వీరపత్ని యనిపించు కొనినది.

కావుననే చానమ్మ కీర్తిప్రబంధమును నాఁటినుండి నేటివఱకుఁ దెనుఁగువారు పునశ్చరణ చేయుచున్నారు. పుట్టిన యింటికి, మెట్టిన యింటికిఁ బరువుప్రతిష్ఠలు సంపాదించి తన ధన్యచరిత్రముచే మాతృభూమిని పునీత మొనర్పఁ గలిగిన చానమ్మవంటి స్త్రీరత్నమును జమలో నొకతెగాఁ బడయఁ గలిగి నందుల కాంధ్రస్త్రీలోకము గర్వింపవలసి యున్నది.

అభిమానవతియైన అంగన ప్రాణనాయకుఁడు పిఱికివాఁ డగుట భరింపలేదు.

అట్లగుటనే కదా, జోధపురాధీశ్వరుఁడైన జస్వంతసింగు షహాజహాను పక్షమూని ఔరంగజేబుపై నెత్తివెళ్ళి యుద్ధమున గాయపడి యోడి పురమునకు రాఁగా మానవతియైన జోధపుర రాణి పురద్వారములు బిడాయించి 'పరాజితుని దీనాననము నీ పురస్త్రీలకుఁ జూప నక్కఱలే' దని కచ్చితముగఁ గబురు చేసెను.

అయితే, జోధపురపు రాణివలె చానమ్మ కఠోరత పూన లేదు. మాటలతోడనే మనోరథ మీడేర్చుకొన్నది.

ప్రమాదవశమునఁ బెడమార్గము ద్రొక్కిన పతులకు సరియైన మార్గమును జూపుటలో రమణీమణులు చానమ్మ చారిత్రమును మేలుబంతిగఁ జేకొనియెదరు గాక !

వీరపత్నియైన చానమ్మ విక్రమతకీర్తికి

'రణరక్తబంధురారుణమైన ఖడ్గతి
క్కైన కత్తికడిగిన కదనభూమి'

ఒక్కింతయే గాక విపులమగు నాంధ్రావని యంతయు విహారమందిరమై వెలయుచున్నది.

'పదను మాటలు తాపి పసుపుముద్దలతోడ
పతికి తనుత్రాణ మతికె పత్ని
విరిగిన పాలతో తరుగని శౌర్యాగ్ని
కల్పించె సుతునిలో కన్నతల్లి.'

—శ్రీ శ్రీనివాస సోదరులు.

## ౨

# రాజగోపాలమ్మ

'ఘనసామ్రాజ్యము వైరి పాలుగ గతిన్ గాన్పించినన్ దాలిమిన్
దనకుం గూరిమివేలుపైన పతియానన్ మీఱకే ఘోరమా
రణమున్ జేసి కులాభిమానమును సంరక్షించుకొన్నట్టి కా
మినిచారిత్రముఁజెప్పఁ బూనితిని కూర్మిన్ మీర లాలింపుఁడీ.'

—శ్రీ శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి.

కటకము మొదలుకొని కన్యాకుమారి వఱకు వ్యాపింపించిన కర్ణాటాంధ్రసామ్రాజ్యమునకు నియంతయై వెలుఁగొందిన కృష్ణదేవరాయల కాలమున ఆమహనీయుని ప్రాపునొంది తమిళదేశమున తంజావూరు, మధుర మొదలగు తావులందు ఆంధ్రనాయకరాజ్యములు వెలసి వర్ధిల్లినవి.

ఈ ఆంధ్రనాయకరాజులు తెలుఁగుదేశమునుండి మంత్రులు, దండనాథులు, పండితులు, కవులు, గాయకులు, వేశ్యలు మొదలయినవారిని అచ్చటికి తీసికొనిపోయి వలస నెలకొనిరి.

క్రీస్తుశకము పదునేడవశతాబ్ది ద్వితీయార్ధమునందు తంజావూరు ఆంధ్రనాయకరాజ్యమున విజయరాఘవనాయఁడును, మధుర ఆంధ్రనాయకరాజ్యమున చొక్కనాథనాయఁడును ప్రభుత్వము చేయుచుండిరి.

విజయరాఘవనాయనికి రాజగోపాలస్వామి ఇష్ట దైవము. అతని కొలువుమందిరమునకు రాజగోపాలవిలాస భవన మని పేరు.

తన మనమునకు ఇన్ని విధములుగా నచ్చిన రాజగోపాలాభిధానమును ధరించిన రాజగోపాలాంబికను అతఁడు పట్టపు దేవిగా వరించెను.

రాజగోపాలాంబిక వలన విజయరాఘవనాయఁడు మన్నారప్పనాయఁడు అను కుమారుని బడసెను. అతఁడు పెరిగి పెద్దవాఁడై వివాహితుఁడై పితృభక్తుఁడై వఱలుచుండెను.

మన కథాకాలమునాఁటికి రాజగోపాలాంబిక, విజయరాఘవులకు వరయోగ్యమైన పుత్రిక ఒకర్తుక ఉండెను.

విజయరాఘవనాయఁడు మొక్కవోని స్త్రీ విద్యాభిమాని; కృష్ణాజి, రంగాజి, చంద్రరేఖ మున్నగు విదుషీమణులను తన ఆస్థానమున నిలిపిన ఉచితజ్ఞుఁడు. అగుట అతఁడు తన ముద్దుపెంపు బాలకు ముద్దార విద్దెలు నేర్పించెను.

ఆమె కుశాగ్రబుద్ధి కావున దినక్రమమున ఉపదేశకాలములందు సకలకళావిద్యలు నేర్చెను. పైగా నవయౌవన విలాసవతియై నిరతిశయసౌందర్యముతో నొప్పారు చుండెను.

విద్యావతి, విలాసవతి ఐన ఆకన్యను గురించి మధుర దళవాయి వెంకటకృష్ణప్పనాయకుఁడు వినెను. ఆమె తన ఏలిక రాజా చొక్కనాథనాయనికి భార్యయగుచోఁ జాల బాగుండు నని అతనికిఁ దోఁచెను. కాగా ఆసంగతి అతఁడు తన దేవరకు విన్నవించెను. చొక్కనాథనాయఁడును ఆనందముతో దానికి

అంగీకరించి విజయరాఘవనాయనివారివద్దకు కన్యను అడుగఁ బంపెను.

తంజాపురమున రాజగోపాలవిలాసభవనమున విజయరాఘవనాయఁడు ఒకనాఁడు కొలువుదీరియుండెను. అప్పుడు మధురనుండి చొక్కనాధనాయని బంధువులును, స్థానాపతులును, పురోహితులును వచ్చి విజయరాఘవనాయని దర్శించి ఆతని భేటికి యోగ్యమైన వస్త్రభూషణాదులు సమర్పించిరి.

"వచ్చిన వర్తమాన మేమి" అని నాయఁడు వారిని ప్రశ్నించెను.

వచ్చినవారు ఇట్లు చెప్పిరి. "మా ఏలినస్వామి రాజా చొక్కనాధనాయనివారు వివాహము చేసికొన తలపెట్టి కన్యార్థము దేవర సముఖమునకుఁ బంపినారు. వారికిని మీకును తరతరములనుండి ఇచ్చి పుచ్చుకొనుటలు ఉన్నవి గదా! ఇది చిరకాలముగా నడచివచ్చుచున్న సంబంధమే. కావున దేవరవారు దయతలఁచి శుభవార్త వెంటనే దయచేయవలెను."

వచ్చినది వికాసవదనముతో స్వీకరింపఁదగిన వివాహమంగళప్రశస్తమైన సందేశము. కాని ఈ సందర్భమున విజయరాఘవనాయుని వదనమున పిసరంతయైన వికాసము పొడసూపలేదు. మీఁదు మిక్కిలి ఆతనివదనము అప్రయత్నముగ సంకుచితమైనది; ఎనుబది హేమంతముల అనుభవముచేఁ గలిగిన సడలుపాటు గానరాకుండ సన్నని బంగారుదారములచేత ఎత్తి గట్టిగఁ గట్టించుకొనిన ఆతని కనుబొమలు సయితము అప్పుడు అప్రయత్నముగ ముడివడినవి.

సందేశహరులతో అతఁడు ఇట్లు చెప్పెను. "మీ దొర ఏ మొగము పెట్టుకుని కన్యకను ఇమ్మని అడుగఁబంపినాఁడు? మీ చొక్కనాధనాయని పితామహుఁడైన తిరుమలశౌరికి వెనుక మా అచ్యుతరఘునాధమ్మను వివాహముచేసిరి. ఆ తిరుమలశౌరి ఒకప్పుడు క్రొత్తగా నగరు కట్టించి పట్టమహిషి యగు అచ్యుతరఘునాధమ్మకు జూపినాఁడు. హాస్యము కొఱకు ఆమె ఆ కొత్తనగరు తంజావూరులోని తన తండ్రి నగరికి ఎంతమాత్రము సాటిరాదని చెప్పి నవ్వెను. ఉడుకుఁబోతు అగు తిరుమలశౌరి ఆ నవ్వుతాలి మాటకు ఓర్వలేక ఆమెను బాకుతోఁ బొడిచి చంపినాఁడు. ఆ సమాచారము విని మావారు అందఱును ఘోరుఘోరున దుఃఖించి—'ఇటువంటి క్రూర కర్మునకుఁ దెలియక పిల్ల నిచ్చినాము. ఇచ్చినందుకుఁ దగిన శాస్తి అయినది. ఇఁక జన్మజన్మపి మనము వారితో సంబంధము చేయరాదు'—అని ఒట్టు పెట్టుకొనినారు. ఇట్లు జరిగి ఉండఁగాఁ దిరిగి సంబంధము కావలెనని మీ దొర ఏ బుద్ధితో మావద్దకు మిమ్ములను పంపినాఁడు?"

విజయరాఘవనాయఁ డిట్లు వారి కోరిక త్రోసిపుచ్చెను. వారు కొనివచ్చిన ఖేటివస్తువుల నయినను స్వీకరింపలేదు. పైగా తన సేవకులకు అజ్ఞాపించి ఆ వచ్చినవారిని తత్క్షణమే కోట బయటకు బంపించివేసెను. ప్రతిదినము ఉదయమున జాము లోగాఁ బండ్రెండువేల బ్రాహ్మణ్యమునకు షడ్రసోపేతముగా జ్యేష్ఠాంశ మిప్పించికాని తాను భుజించుట ఎఱుఁగని ఆ అన్నదాత కోటబయటనైనను ఆ సందేశహరులకు బత్తెము భరణము విచారించు ఏర్పాటులు చేయలేదు.

ఈ విధమున అవమానమును పొంది వారు పోయి రాజా చొక్కనాథనాయనితో నడచిన వృత్తాంతము యావత్తు పూసగ్రుచ్చినట్లు శ్రుతపఱచిరి.

తోడి సంస్థానీకుఁడనగు నేను అడుగఁబోగా ఆతఁడిట్లు చేయునా అని చొక్కనాథనాయఁడు ఒక్కపెట్టున మండిపడి తన దళవాయి వేంకటకృష్ణప్పనాయని పిలిచి దండు కూర్చుకొని పోయి తంజావూరు కోటను ముట్టడింపుమనెను. ప్రభుని ఆజ్ఞ తలనిడుకొని వేంకటకృష్ణప్పనాయఁడు క్రీస్తుశకము 1673-వ సంవత్సరమున తంజావూరు కోటను ముట్టడించెను.

తంజనగరము సేనాని రంగప్పనాయఁడు వేంకటకృష్ణప్ప నాయనికి ఎదురెక్కి యుద్ధముచేయ సాగెను. తంజావూరి కోటలో విశేషసైన్యము- ఇరువదివేలకు పైగా- ఉండెను.

అందుకు మధురవారు ఎంతమాత్రమును జంకక దండు పురిగొలిపి ఫిరంగులు మోర్చాలపై ఎత్తించి కోటపైని ఉన్న సైన్యముమీద లక్ష్యముంచి ప్రేల్చసాగిరి. మధురవారు ఇరువదివేల గుండ్లకు పైగాఁ బ్రేల్చిరి. ఎడతెగని గుండుదెబ్బల కాగలేక తంజావూరు సేనలు విఱిగిపోవ దొడంగెను.

ఈలోగా మధురవారు అగడ్తను కొయ్యపలకలచేత మూయించిరి. ఇడిసిపడిన తోవలవెంట కొందఱు, వాకిళ్ళవెంట కొందఱు మధురసైనికులు కోటలోఁ బ్రవేశింప నారంభించిరి. కొంచెము కొంచెముగా తంజావురి కోట శత్రువుల స్వాధీనము గాఁజొచ్చెను.

అప్పుడు వేంకటకృష్ణప్పనాయఁడు విజయరాఘవనాయని కిట్లని కబురుచేసెను. "విశేషసైన్యముతో మేము కోటలోఁ

జొఱబడుచున్నాము. క్రమముగా మీ సేనలు విఱిగిపోవుచుం డుట మీరు చూచుచునే యున్నారు. గడియకో, అరగడియకో కోట మాస్వాధీనమై తీరును. ఇప్పుడైనను మీరు మా రాజునకు కన్య నిచ్చి సంధి చేసికొనుచో మాఫౌజును వెనుకకు మరలించుకొని పోయెదము.''

దీనికి విజయరాఘవనాయఁడు ''రాజ్యము పోయినను, సర్వనాశన మైనను మీకు భయపడి కన్యను ఇచ్చువారము కాము. రాజీప్రస్తావన మాతోఁ దలపెట్టవలదు'' అని ప్రతి వార్త పంపెను.

కొంతసేపటికి తంజావూరుకోట మధురవారి సేనలతో నిండిపోయెను. రాణివాసపుస్త్రీ లున్న అంతిపురమును మాత్రము ఇంకను శత్రువులు ఆక్రమింపఁజాలకుండిరి. అప్పు డచ్చట సందడికయ్యము జరుగుచుండెను.

అద్దిచూచి విజయరాఘవనాయఁడు తన కొమారుఁడు మన్నారప్పనాయనితో ఇట్లు చెప్పెను. ''కుమారా! ఈ యుద్ధమున మనము ప్రాణములు విడుచుట ఇఁక నిజము. మనము మరణించిన పిమ్మట మధురసేనానులు మహలుచొచ్చి మన చిన్నదానిని తీసికొనిపోయి తమ రాజునకు వివాహము చేయుదురు. ఇది తప్పదు. అప్పుడు మన మాటకు ఓటుపాటును, వారి పట్టుకు చెల్లుపాటును గలుగును. రాజ్యము పోయినను, ప్రాణములు పోయినను, సర్వనాశనమయినను మన పౌరుషము నిలుపుకొనవలెను; వారు పట్టిన పట్టు చెల్లనియ్యరాదు. ఇప్పుడు మన మేమాత్రము వెనుకంజ వైచినను మన పేరుకు హాని వచ్చును; మానము పోవును. కాబట్టి స్త్రీల నందఱను మనమే

దైవికము పొందించవలెను. మహాలులోనికిఁబోయి ఈ కార్యము నెఱవేర్పవలసిన భారము నీమీఁద నున్నది.''

అవిలంఘనీయమగు తండ్రిఆజ్ఞ ఒకవంక, వీరుని ప్రథమ ధర్మమగు స్త్రీమానసంరక్షణము ఒకవంక తన్ను ఎచ్చరింపఁగా మన్నారప్పనాయఁడు అంతిపురమునకు దారి తీసెను.

మానమునెడ విజయరాఘవనాయనికంటె ఆతనిరాణి రాజగోపాలమ్మ వేయిమడంగుల హెచ్చు అభిమానముగలది. కావుననే ఆ మానవతి ఎదుటిదళము కోట చొచ్చెనని వినుట తోడనే అభిమానవతులగు మిగిలిన అవరోధజనమును ఒక్కచోఁ జేర్చెను. తుపాకిమందుతో నిండిన కుండలు రప్పించి వారిచుట్టును పేర్పించెను. శత్రువులు హఠాత్తుగాఁ జొఱబడినచో మందుకుండలకు నిప్పుపెట్టుటకైన అవకాశముండదేమో అని ఆమె ఆనతినంది రాణివాసపు స్త్రీలు కత్తులు, జముదాళ్లు దూసికొని ప్రాణములు అర్పింప సంసిద్ధలై యుండిరి.

ఏలినవారిఆజ్ఞ ఎప్పుడు వచ్చునా అని విజయరాఘవ నాయనిరాణి రాజగోపాలమ్మ ఎదురుచూచుచుఁ బ్రతిక్షణమహా యుగములు గడుపుచుండెను. కుమారుఁడు మన్నారప్పనాయఁడు ఇంతలో అచ్చటికి వచ్చెను. "ఏలినవారికి క్షేమమా? మాకు ఏమి ఉత్తరువు ఇచ్చిరి?'' అని రాణి ఆత్రముతో ఆతనిని ప్రశ్నించెను.

ఆతఁడు తాను వచ్చినపని తల్లికి నివేదించెను.

ఆమాటలు వినుచునే ఎంతమాత్రమును ఆలసింపక రాణి పొడుచుకొని మరణించెను. మాటవాసికొఱకు ఆమె ఇట్లు ఆయుధమరణమును వరించినది. అది చూచి మిగిలిన

రమణీమణులును ఒకరినొకరు కత్తులచేతను, కటారుల చేతను నఱుకుకొన ప్రారంభించిరి.

ఇంతలో మన్నారప్పనాయఁడు మందుకుండలకు నిప్పు ముట్టించెను. రెప్పపాటులో అగ్నిజ్వాలలు ఛటచ్ఛటాయమానమై నగరంతయు ఆక్రమించి ఆనగరిలో ఆఁడుపురుగు లేకుండ దగ్ధము చేసెను.

ఆకాసనుంటిన జ్వాలాజిహ్వాలు మన్నారప్పనాయఁడు మఱలి వచ్చుటకు పూర్వమే జరిగిన వర్తమానమును విజయరాఘవనాయనికిఁ దెలియఁజేసినవి. ఇంతలో మన్నారప్పయుఁ దండ్రి చెంతకు వచ్చెను.

రాజగోపాలస్వామిభక్తుఁడు, రాజగోపాలవిలాససంసద్భవనాధ్యక్షుఁడు, రాజగోపాలాంబికాధవుఁడు ఐన విజయరాఘవనాయఁడు అప్పుడిది యంతయుఁజూచి మనమున ఇనుమంతయైన ఖేదము చెందనియక రాజగోపాలుని గుడివైపు మొగమై చేతులు జోడించి ఇది యంతయు రాజగోపాలుని కల్పితమనచుఁ దిరిగి యుద్ధకార్యనిమగ్నుఁడయ్యెను.

అనంతరము తండ్రి కొడుకు లిద్దఱును చేతులతీఁట వోవునట్లు యుద్ధము చేసి వీరజనోచితమగు ఆయుధమరణమును పొందిరి.

తంజావూరు ఆంధ్రనాయకరాజ్యసంబంధమున అరవదేశమునందు వలస నిలిచిన ఆంధ్రపురంధ్రి విజయరాఘవనాయనిపత్ని రాజగోపాలాంబికయు, ఆమెతోడి ఆంధ్రరమణీమణులును ఈవిధమున మాటకొఱకు, మానముకొఱకు సంఘ

విలయమును పొందె ఆంధ్రకీర్తిని దిక్కులు తెలిపొందునట్లు ప్రకాశింపఁజేసిరి.

విజయరాఘవనాయనిరాణి రాజగోపాలాంబిక యొక్కయు, ఆమె తోడి తెలుఁగుతెఱవల యొక్కయు మానప్రియత్వము మహిని వెలయించుటకు వారికి మరణవరమును ప్రసాదించిన రాజభవన మిప్పటికిని మసిబాఱిన గోడలతో, బొగ్గులు నిలిచిన దూలములతో, నల్లగా మాడిపోయి పెల్లలు రాలి పడిన గుర్తులుగల కట్టడపు మీఁదితట్టుతో, దట్టముగా నెదిగి యున్న జిల్లేడు డొంకలతో తంజనగరము కోటలో ఈశాన్య భాగమున నిలచియుండి ఆనాఁటివృత్తాంతమును చూపఱ జ్ఞప్తి కెలయించుచున్నది.

ఇప్పటికిని తంజనగరము కోటలో నివశించు మహారాష్ట్రరాజస్త్రీలు ఎవ్వరుకాని ఆతట్టుకుఁ బోవనే పోవరు. ఆంధ్రరమణుల మానప్రియత్వము అక్షరమైన అంతటి పావిత్ర్యమును సంతరించుకొన్నది.

అరవదేశమున వలస నెలకొన్న తోడి ఆంధ్రరమణీమణుల సాయమున విజయరాఘవనాయనిరాణి రాజగోపాలాంబిక ఆ నాఁ డట్లు ఆర్జించిన కీర్తిధనమునకు ఒక్క అరవదేశమందున్న ఆంధ్రులేకాక మిగిలిన ఈ విశాల విశ్వమున వివిధభాగములందున్న ఆంధ్రులందఱునుకూడఁ దొలఁగింపరాని భాగస్వాములై యున్నారు.

# 3

# చెంగమలదాసుదాది

ఆంధ్రరాజపుత్రధాత్రిత్వమున రాణకెక్కిన రమణీ మణులలో చెంగమలదాసుదాది యొకతె.

పాలుత్రాగు పసితనముననే తల్లిదండ్రులఁ బోఁగొట్టుకొని రాజ్యభ్రష్టత నొందిన ఏడుమాసముల కసుగందు వత్సవాయి రాయజగపతి రహస్యరక్షణకుఁ బూని పంచకరపాట్లు పడి తుదకు కృతకృత్యురాలై అతనికిఁ దిరిగి పెద్దాపుర సంస్థానాధిపత్యము సంపాదించిపెట్టిన మహాలక్ష్మమ్మ మహనీయచరితము మనకుఁ బరిచితమై యున్నది.

కుడియెడమలు తెలియని ఐదేండ్ల కుఱ్ఱతనముననే మాతాపితలతోపాటు బొబ్బిలి సంస్థానాధిపత్యమును కూడఁ గోల్పోయిన రావు వేంకటరంగారావు రహస్యరక్షణకుఁగడఁగి అనేకకష్టములను రుచిచూచి చివరకు సఫలీకృతమనోరథయై అతనిని అభ్యుద్ధరించిన వేంకటలక్ష్మి పవిత్రనామమును మనము వినియున్నాము.

మహాలక్ష్మమ్మ ౧౭౩౮-వ సంవత్సరమునను, వేంకటలక్ష్మి ౧౭౫౭-వ సంవత్సరమునను ఆంధ్రరాజపుత్రధాత్రిత్వమున దమపైఁబడిన మహాకార్యనిర్వాహణమునకుఁ బూని విస్తృత కీర్తిని సముపార్జించినారు.

మన ప్రస్తుతకథకు నాయకురాలైన చెంగమలదాసు దాది మహాలక్ష్మమ్మ, వేంకటలక్ష్మిలకంటె ప్రాచీనురాలు. ఆమె ౧౬౭౩-వ సంవత్సరమున తంజాపురి ఆంధ్రరాజకుమారుని రహస్యరక్షణకుఁ బూనినది.

మానము కొఱకు, మాటవాసి కొఱకు తంజాపురి కోటలో రాజగోపాలమ్మ రాణియుఁ, దక్కిన అవరోధజనమును సంఘమరణమున సమసిపోయినప్పుడు రాజవంశము నాఁటితోఁ దుదముట్టకుండుటకు రాజగోపాలమ్మ మనుమఁడు, మన్నారప్ప నాయని కొమారుఁడు నాలుగేండ్ల బాలకుఁ డొకఁడు మిగిలి యుండెను. ఆకుఱ్ఱవాని నామము చెంగమలదాసు.

విక్రాంతిసమయమున చెంగమలదాసును రహస్యముగాఁ గొనిపోయి కాలము కూడివచ్చువఱకు అతనిని రక్షించు మహాభారమును వహించినది యొక వనిత. ఆవనిత అతనిదాది.

మన్నారప్పనాయఁడు వచ్చి విజయరాఘవనాయనివారి ఆజ్ఞ రాణి రాజగోపాలమ్మకును, దక్కిన రాణివాసపు స్త్రీలకు వినిపించెను. తోడనే ఆపడఁతు లెల్ల పరలోకప్రయాణసన్నాహములలోఁ బర్యాప్తలైరి.

అప్పుడు మన్నారప్పనాయనిఇల్లాలు నాలుగేండ్ల తన కుమారుని కడసారి ఎత్తి కఱవుతీర ముద్దాడినది ; ఆబిడ్డకు స్తన్యమిచ్చి యింతకాలముగా సాఁకుచువచ్చిన దాదిని బిలచినది, ఇట్లు చెప్పినది.

"తాయీ ! ఈ బిడ్డను ఇంతకాలము సాఁకుట ఒక లెక్కలోనిదికాదు. ఇఁకమీఁద సాఁకుటయే సాఁకుట. ప్రాజ్య

మైన తంజాపురినాయకరాజ్యమునకుఁ గష్టకాలము వచ్చినది. ఈ కోటలో నిప్పుడున్న ప్రతి ప్రాణియు మరణమును వరించు చున్నది. ఇఁక నీ వంశము నిర్వంశము కాకుండ నిలుపుటకుఁ గాను ఈ నా చిట్టితండ్రి రక్షితుఁడు కావలయును. కావున ఎవ రికిని దెలియకుండ అతిరహస్యముగ నీ బాలకుని నీకు అనువైన స్థలమునకుఁ గొనిపోయి పరిరక్షింపుము. ఈ కోటలోని ధన మును, ఈ రాణివాసపుస్త్రీల నగలును ఇక్కడ రహస్యముగ భూస్థాపితము చేయుచున్నాము.నాకన్నతండ్రి పెరిఁగి ప్రాజ్ఞుఁడైన పిదప ఈ తంజాపురిరాజ్యమును దిరిగి సంపాదించి కులదీప కుఁడు కాఁగలఁడు. ఈ సంకేతస్థలమున నిక్షిప్తమైయున్న ఈ అపారధనరాశిని అప్పుడతనికిఁ జూపుము. అంతవఱకు మీకు వలసియుండు ధనమునకుఁగాను నా మెడలోని ఈ మణి భూషణములను గొనిపోయి విక్రయించుకొనుము ఈబాలకుని రక్షించి ఈ వంశము నిర్వంశము కాకుండఁ జూడ వలసిన భార మిఁక నీది. నే నింకను జాగుసేయుటకు వీలులేదు. అప్పుడే అత్త గారు రాజగోపాలమ్మవారు పొడుచుకొని పరమపదమును బొంది నారు. మానభంగభయము నన్ను త్వరపెట్టుచున్నది. ఇఁక నా నాయనకుఁ దల్లియైన, తండ్రియైన నీవే.'

ఈమాటలు చెప్పుచు మన్నారప్పనాయనిమగువ తన బిడ్డను దాదిచేతుల కందిచ్చినది. పరిపాటిని బట్టి చెంగమల దాసు దాదిచేతులలోనికి ఉఱికినాఁడు. ఆనిముసమునఁ దన జీవనస్థితిలో సంఘటితమైన విపర్యాసము, పాపము, ఆబాలున కేమియుఁ దెలియదు కదా !

రాజస్త్రీ ఇచ్చిన మణిభూషణములను దాది భద్రప

ఱచు కొన్నది; పిల్లవానిని చంకలో పొందికగా నిముడ్చు కొన్నది. కోటవెలుపలికిఁ బోవుమార్గమును బట్టినది.

ఇంతలో అంతిపురమున మంటకుండలకు అగ్నిస్పర్శ కాఁగా ఆభాగమంతయు మంటలతో నిండిపోయినది. అగుట శత్రువులు ఆదిక్కునకు రాలేదు. ఈయదనునసే దాది నేర్పుగా కోటదాఁటి బయటపడి 'బ్రతుకు, జీవుఁడా!' అనుకొని మిన్నం దినది.

మిన్నుముట్టిన ఆ ఆనందములో ఆధాత్రికి దూరము, భారము కనిపించలేదు. బాలునితో ఆమె నేరుగా నాగపట్ట ణముపోయి చేరినది.

నాగపట్టణమున ఉచితజ్ఞుఁడు, రాజభక్తుఁడు నగు ఒక వైశ్య వర్తకుఁడు చెంగమలదాసునకు, అతనిదాదికి. ఆశ్రయ మిచ్చెను.

కేవలము ఆశ్రయ మిచ్చుటయేకాదు. వారికిఁగావలసిన సమస్తసదుపాయములను సమకూర్చి వారిని తనయింట అతి రహస్యముగఁ బరిరక్షించుచుండెను. చెంగమలదాసుపట్ల ఆవర్తకుఁడు వల్లమాలిన అభిమానముంచి అతనికిఁ జదువు, సాములు చెప్పించుటకుఁ జక్కని ఏర్పాటులుచేసెను.

కష్టకాలమునఁ దమ్ము ఇన్నివిధములఁ గనిపెట్టుచున్న వర్తకునిపట్ల దాదికి ఎనలేని కృతజ్ఞత కుదిరినది. కాఁగా ఆమె తఱచు ఆవర్తకునితో నొంటరిపాటున 'మా బాబు పెరిఁగి ప్రాజ్ఞుఁడై తాతతండ్రులు పాలించిన తంజాపురి ఆంధ్రనాయక రాజ్యమునకు ఏలికయై మీకు దళకర్త, ప్రధాని ఉద్యోగ ములు రెండును ఈయఁగలఁడు' అని అనుచుండునది.

ఇది యిట్లుండ తంజనగరము మధురవారి స్వాధీనమైన పిమ్మట రాజా చొక్కానాథనాయఁడు అక్కడ అళగరినాయుడు అనువానిని రాజప్రతినిధిగా నియమించెను. అళగరినాయఁడు చొక్కనాథనాయునికి స్తన్యమిచ్చి సాఁకిన దాదికొడుకు.

ఆహా! కాలవైపరీత్యము! చొక్కనాథనాయునికిఁ బాలిచ్చిపెంచిన దాదికొడుకు అళగరినాయఁడు తంజాపురి దొర యయ్యెను. తంజాపురి దొరవంశమునఁబుట్టిన చెంగమలదాసు రాజ్యమును గోలుపోయి పాలిచ్చిపెంచిన దాది రక్షణలో అనువుకానిచోట అడగియుండెను.

ఇట్లు దాదికొడుకు దొరగా, దొరకొడుకు దాదిబిడ్డగాఁ బడి నిండువత్సరములు సాగిపోయినవి.

చెంగమలదాసు పితామహుఁడు విజయరాఘవనాయఁడు రాజ్యముచేయుచుండిన దినములలో అతనివద్ద రాయసము వెంకన్న అను నియోగిబ్రాహ్మణుఁడు కార్యకర్తగా నుండెను. వెంకన్న మంచితంత్రగొట్టు.

అతఁడు ఎటులనో నాగపట్టణమున చెంగమలదాసు ఉనికిని పసిపట్టినాఁడు. బయలుదేరివచ్చి రాజపుత్రరక్షకులైన దాదిని, వర్తకుని కలుసుకొన్నాఁడు; తిరిగి తంజాపురిరాజ్యము సంపాదించుటకు పన్నాగములు పన్నినాఁడు.

ఆపన్నుగడ ప్రయత్నములలో ఒకసంవత్సరము గడచిపోయినది. ఈలోగా వెంకన్న తంజనగరనాయకరాజసేవలోఁ జీము నెత్తురులు ధారవోసిన రెండువందలమంది వీరులను చెంగమలదాసు వద్దకుఁ జేర్చగలిగినాఁడు.

అప్పుడు అతఁడు దాదితో, వర్తకునితో నిట్లు ఆలోచనలు సాగించినాఁడు.

'దక్షిణాపథమున ప్రస్తుతము బీజపురపుసూల్తాను మొనగాఁడై ఉన్నాఁడు. మన మందఱమును బోయి అతని శరణు కోరుదము. మధురవారు మన తంజనగరరాజ్యము నెట్ల న్యాయముగ లాగుకొనినారో చెప్పుకొందము. అతని సాయమున తిరిగి తంజపురిరాజ్యమును మనము పొందుదము.'

వెంకన్న చెప్పిన ఈ ఆలోచన దాదికి నచ్చినది; వర్తకునకును నచ్చినది. తోడనేవారు బీజపురమునకుఁ బ్రయాణసన్నద్ధులైరి. అందుకు వలయు ధనమంతయు వర్తకుఁ డిచ్చెను.

చెంగమలదాసున కొకపాలకీ, వెంకన్న కొకపాలకి, దాదికి ఒకడోలీ ఏర్పఱుపఁబడెను. వీరితో వర్తకుఁడుకూడ నుండెను. వీరిని అందఱను రక్షించుటకు పదినుంది రౌతులు, నూటతొంబదిమంది కాలిబంటులు.

ఈసన్నాహములతో వారు ప్రయాణమై కొన్నిదినములకు బీజపురముచేరిరి.

అక్కడ వెంకన్న తనబుద్ధిబలమునంతను ఉపయోగించి కార్యస్థుల నందఱను దనకు సుముఖులనుగాఁ గావించుకొనెను. ఆ కార్యస్థులు బీజపురపుసూల్తానుతో అనుకూలముగఁజెప్పిరి.

అప్పుడు సూల్తాను మహారాష్ట్రుఁడు తనవజీరు ఐన శహాజి కుమారుఁడు ఏకోజీనిపిలచి ఇట్లు చెప్పెను.

'ఏకోజీ! పండ్రెండువేల గుఱ్ఱపుపౌజును, అందుకుఁదగిన కాలిదళమును వెంటఁదీసికొని పొమ్ము. తంజావూరు సాధించి

ఆరాజ్యమున చెంగమలదాసుని స్థాపితుని గావించి తగిన బందో బస్తు చేసిరమ్ము.'

అందుమీఁద ఏకోజీ జైత్రయాత్రకు వెడలినాడు. వెంకన్న దారిచూపగా బీజపురసేనలువచ్చి తంజనగరమును ముట్టడించినవి.

అళగరినాయఁడు కొంతకాలము పోరి చూచినాఁడు, కాని దైవము తోడై రాలేదు. కాఁగా అతఁడు ఆలుబిడ్డలతోఁ బలాయనము చిత్తగించినాఁడు.

ఇఁక నేమున్నది? ఏనుఁగుమీఁది అంబారిలోఁ గూర్చుండఁబెట్టి చెంగమలదాసును సకలదళసమేతముగా తంజనగరపు కోటలోఁ బ్రవేశపెట్టిరి. పట్టాభిషేకమునకు ముహూర్తమును నిశ్చయించిరి. ఏకోజీ సమక్షమున చెంగమలదాసునకు తంజాపురికోటలో పట్టాభిషేకము నితాంతవైభవముతో జరిగినది.

పట్టాభిషేకానంతరము చెంగమలదాసు వారివారికిఁ దగినట్లు పారితోషికములు, వస్త్రములు, గంధపుష్పములు ఇచ్చి సత్కరించి సాగనంపెను.

ఆపిమ్మట అతఁడు నగరిలో దాదివద్దకు భోజనమునకు వెళ్ళెను.

జామా, తలపాగ, నడికట్టు, ఇజారు మున్నగు ముస్తాబులతో; పచ్చల పోగులు, వజ్రముల పతకము, వజ్రముల బాజిబందు, రత్నముల తోడాలు మున్నగు-ఆభరణములతో శృంగారించుకొని పుణ్యజలములచేత మంత్రపూతముగా నభిషేకములు పొంది తంజాపురి ఆంధ్రనాయక రాజ్యమునకుఁ బట్టాభిషి

క్తుఁడై వచ్చిన ఆయువకుని తిలకించి దాది బ్రహ్మానంద మందినది.

ఇంతకాలముగాఁ దాను పడిన కష్టములన్నియు నేటికి గట్టెక్కినవి గదా అని ఆధాత్రి ఉత్సాహాతిరేకముతో చెంగ మలదాసుతో నిట్లనినది.

"పదియేండ్లకుఁ బూర్వము నాలుగేండ్ల బాలుఁడవై యున్న నిన్ను ఈస్థలమునుండి అతిరహస్యముగ బయటికిఁ గొని పోయినప్పటి నా ఉద్విగ్నమనస్కతను ప్రస్తుతము నేను సూటిగ వివరింపఁజాలను. నీ మాతృదేవి యొక్కయుఁ, బితామహియొ క్కయుఁ బవిత్రాత్మలు నేడిక్కడ వాయులీనములై యుండుచో వారి వంశాంకురమవైన నీవు వారి సింహాసనమునఁ దిరిగి యుప విష్టుఁడవైనందుకు నిరతిశయానందమును బొందుచుండు ననుట సత్యము. నేను వహించిన బాధ్యతను ఈనాఁటికి జయప్రద ముగ నిర్వహింపఁ గలిగితిని. నాహృదయభారము చాలవఱకుఁ దొలఁగిపోయినది. ఇఁక నాఈ జీవితమున నిర్వహింపవలసిన పని యొక్కటే యున్నది. ఆపనిని నిర్వహించుటకుఁగూడ నిదియే మంచి సమయము. ఆనాఁడు జరిగిన ఘోరవీరరణములో స్త్రీ బాలసహితముగా నెల్లరు హత మగునప్పుడు అప్పటికిఁ గోటలో నిలవయున్న ద్రవ్యమంతయు ఇరువదిలక్షల వరహాలు, ఆరు లక్షల వరహాల విలువచేయు రత్నభూషణములును గొప్పగొప్ప బిందెలలో భద్రపఱచి ఇచ్చటి బిలములోనుంచి పైన గుండు రాళ్లు పేర్చిరి. ఇప్పుడు బ్రతికిఉన్నవారిలో ఆరహస్యము నాకుఁ దప్ప లాతివారికిఁ దెలియదు. నీ మాతృదేవి ఆ రహస్యమును నా చెవులయందు వైచి నీవు పెరిఁగి ప్రాజ్ఞుఁడవైన పిదప నీకుఁ

జెప్పుమన్నది. ఇప్పుడు దుర్గలక్ష్మి నీస్వాధీనమైనది. ఆధనలక్ష్మిని కూడఁ బొంది క్రొత్తగ దఖలుపడిన నీ యీ ప్రాక్తనరాజ్యమున నీ ఉనికి సుస్థిర మొనర్చుకొనుము. నీవు సింహాసన మెక్కుటతో నా బాధ్యతయంతయుఁ దీరినది; ఈ రహస్యమును నీకు నివేదించుటతో నాభారమంతయుఁ దిగినది.'

అసలే చెంగమలదాసు కృతజ్ఞతాగుణబద్ధుఁడు. అందును దాది చెప్పిన ఈమాటలతో నతఁడు అవధిలేని కృతజ్ఞతా ప్రవాహమునఁ దేలియాడినాఁడు. అంతటి అపారధనరాశిని గురించిన రహస్యము తన కొక్కరుతకే తెలిసియున్నను ఆమె కొంచెముకూడ లోభగుణ మూనలేదు. సర్వము అతనికే అర్పించినది.

అప్పుడు చెంగమలదాసు సేవకుల రప్పించి ఆమె ఆనవాలు చూపగా సంకేతస్థలమున రాళ్లు పెల్లగించి బిలము తెఱచి బిందెలతోనున్న అందలి ధనమును స్వాధీనము చేసికొనెను.

తనకు తంజాపురి రాజ్యము వచ్చుటకుఁ బ్రధానకారకుఁడైన బీజపుర సూల్తానున కతఁడు వెలలేని ధనరాశి కానుకగాఁ బంపెను. అతని కార్యకర్త, తంజాపురి యుద్ధవిజేత యైన ఏకోజికిఁగూడ విశేషధనము బహుమానము చేసెను. ఆబహుమానము నందుకొని ఆతఁడు కుంభకోణమున విడిది దిగి యుండెను.

ఆమీఁద కొద్దిదినములకు తంజాపురిలో దళకర్త, ప్రధాని ఉద్యోగము లెవ్వారి కీచ్చుట యను సమస్యవచ్చెను.

రాయసము వెంకన్న నియోగి నిర్వాహకుఁడై యింత కార్యము సాధించినవాఁడు గావున దళకర్త, ప్రధాని ఉద్యోగము లతని కిచ్చుట సమంజసమని కొందఱు ఆలోచన చెప్పిరి.

అందుమీఁద చెంగమలదాసు తన్ను చిన్నప్పటినుండి సాఁకిన దాదితో సలహాచేసినాఁడు. అప్పుడు దాది ఇట్లు చెప్పినది.

"ఆనాఁడు నిన్ను ఒడిలో నిడికొని దిక్కు తెలియక నాగపట్టణము పోయి చేరితిని. అక్కడ సెట్టి మన కాశ్రయ మిచ్చినాఁడు. అప్పుడు ఈ బిడ్డకు తంజాపురిరాజ్యము వచ్చినచో నతనికి దళకర్త, ప్రధాని పదవు లీయఁగలమని వాగ్దానము చేసియున్నాను. మనకు సెట్టి పదిసంవత్సరములు అన్నమిచ్చి అరసి రక్షించినాఁడు. బిజాపురపు ప్రయాణమునకైన కర్చు అంతయు నతఁడే పెట్టుకున్నాఁడు. అంతియే కాదు. ఇంతకాలమును అతఁడు మనలను వెన్నంటి నీడవలె నుండుచున్నాఁడు. ఈ నాఁటి నీ ఔన్నత్యమునకు ఆ సెట్టి పెట్టినదే దీపము. కావున దళకర్త, ప్రధాని పదవులు రెండును వైశ్యున కీయవలసినదే. ఐతే రాయసము వెంకన్నను విడనాడమని నేను చెప్పను. అతనికి సెట్టి కింద పేష్కారీ పదవి కాని, సీమ అమలు కాని ఈయుమనగును."

దాది వాదన చెంగమలదాసు వినినాఁడు. ఆమె మాటల యందలి ఔచిత్యమును అతఁడు ఆకళించినాఁడు. ఇంతకాలమును ఆమె స్వార్థమెఱుఁగక తన్ను సేవించినది. సెట్టియుఁదన్ను గురించి మిక్కిలి శ్రమపడినాఁడు. అగుట అతనిని గురించి ఆమె చెప్పినమాట సమాదరణీయమైనదని అతనికిఁ దోఁచినది.

వెంకన్న దరిమిలా వచ్చినవాఁడు. కావున ముందు సెట్టికిఁ, దరువాత వెంకన్నకు మర్యాద చేయుట సముచితము. ఇట్లని చెంగమలదాసు నిశ్చయించినాఁడు. నిశ్చయించి యథా సమయమున అందుకుఁ గావలసిన వస్త్రభూషణములు, తాంబూల గంధ పుష్పాదులు సమకూర్చినాఁడు. ఏనుఁగు హౌదా; నగారా, నౌబత్తు మున్నగు వాద్యములను నగరివాకిట సంసిద్ధపఱచినాఁడు.

పిమ్మట సెట్టిని ఆహ్వానించి దళకర్త, ప్రధాని పదవుల కద్దిష్టమైన ఉంగరము అతనివ్రేలికిఁ దొడిగి, ఏనుఁగు హౌదాలోఁ గూర్చుండఁబెట్టి ఊరేగింపఁజేసెను.

ఇది వెంకన్నకు నచ్చలేదు. తనకు రావలసిన ఉద్యోగములు సెట్టికిఁ జేరినందుకు అతఁడు ఈసుపూనినాఁడు. కాఁగా పోయి కుంభకోణములోనున్న ఏకోజీతో మంతనము లాడినాఁడు; పట్టు బలవంతముమీఁద ఏకోజీని తంజాపురిపయిఁ గత్తి దూయున ట్లొడఁబఱచినాఁడు.

ఆమీఁద నతఁడు చెంగమలదాసు హితమును గోరువానివలె నతనికి జాబొకటి వ్రాసి పంపినాఁడు. 'ఏకోజీ మీ మీఁద మండిపడుచున్నాఁడు. ఈ ఉదుటున అతని ఎదుట పడుచో నిఁక మీకుఁ బ్రాణములు తక్కవు. కావున ప్రస్తుతము తమరు తంజ నగరము కోటను వీడి పెడఁదొలఁగి పొండు. ఈ వేళకు మాత్రము తప్పి తొలఁగి యుండినచో నతనికి నచ్చచెప్పి మీ రాజ్యము మీకుఁ దిరిగి యిప్పించఁగలను. తడఫుల బట్టి మీవంశమును సేవించుచున్న రాయసము వంశమునకుఁ జెందినవాఁడను కాబట్టి

మీక్షేమముకోరి మీకు ఈ ఉదంతము ముందుగాఁదెలిపినాను: ఆపైన మీ యిష్టము.'

ఈ ఉత్తరమునందలి కుటిలసంకల్పవాసన చెంగమల దాసు పసిపట్టలేక పోయినాఁడు. పదునాలుగేండ్ల బాలుఁడు కావున అతఁడు పసిపట్టలేక పోయినాఁ డనుకొందము.

పెద్దవాఁడైన సెట్టి బుద్ధియు నామాత్రపుదే యయ్యెను. కోటవిడిచి పోవుటయే ఉత్తమ మని ఆకోమటిమంత్రి రాజుకు ఊఁదర ఎత్తించెను.

చేయునదిలేక ఆరాత్రికి రాత్రి చెంగమలదాసు మూఁడు పల్లకులతో, దాదితో, సెట్టితో, వేయిమంది నమ్మిన సేవకులతో, కొంత రొక్కముతో, కొన్ని నగలతో, కొన్ని గుఱ్ఱములతోఁ గోటవిడిచి అయలూరికిఁ బోయినాఁడు.

ఈసారి ఏవిషపు గడియయందు అతఁడు ఆకోటను విడిచెనో కాని తిరిగి రాలేదు.

ఆతఁడు విడిచిపోయిన కోటలో ఏకోజి దళసమేతముగఁ బ్రవేశించినాఁడు. అందుతో తంజాపురి ఆంధ్రనాయక రాజ్యము స్తమించినది; తంజాపుర రాజ్యము మహారాష్ట్రుల పాలఁ బడినది.

ఈసారి ఐనను వెంకన్నకు దళకర్త, ప్రధానిపదవులు దక్కలేదు. పని తీరిన వెంటనే ఏకోజీ ఈ తంత్రగొట్టును దరికిఁ జేరనీయక తఱిమి కొట్టినాఁడు.

ఐతే ఈసందర్భమున ఆంధ్రనాయకరాజ్యాస్తమయమునకు వెంకన్న, చెంగమలదాసుదాది వీరిలో ఎవరు కారణమను ప్రశ్నము పొడసూపుట సహజము.

ఈ ప్రశ్నమునకు సమాధానముగా తంజాపురి ఆంధ్ర నాయకరాజ్య వినాశనమునకు వెంకన్నయే కారణమని ప్రతి వారును చెప్పఁగలరు.

మొదటినుండియు నతని పరిశ్రమమంతయు స్వార్థము కొరకే నడచినది. స్వార్థమునకు భంగము వచ్చుటతోడనే ఆనియోగి తాను కూడఁదీసిన రాజ్యమును తానే కూలఁద్రోసినాఁడు.

దాది విషయమున వరిముల్లు వాసియైనను స్వార్థచింత లేదు. తనకడుపు చింపుకొని చెంగమలదాసుని అందు భద్ర పఱచి పది నిండారుసంవత్సరములు ఆమె కాలము వెళ్ళఁబుచ్చినది. కష్టకాలమున తమకు ఆశ్రయమిచ్చిన వైశ్యునిపట్ల నిండు కృతజ్ఞతతో నిలఁబడినది. అతనికి దళకర్త, ప్రధానిపదవులు వాగ్దానముచేసినది.

తొమ్మిది సంవత్సరములు దాసు, దాది అజ్ఞాతవాసాయాస మనుభవించిన మీఁదఁగాని రాయసము వెంకన్న రంగముమీఁదికి రాలేదు. ఈలోగానే ఆమె ఆపదవులు రెండు సెట్టికిఁ గరారు చేసినది.

వెంకన్ననయినను త్రోసి రాజనమని ఆమె చెప్పలేదు. దళకర్త, ప్రధాని పదవుల తరువాత బేర్కొనఁదగిన పేష్కారి ఉద్యోగముకాని, సీమ అమలుకాని అతని కిమ్మని ఆమె చెప్పనే చెప్పినది.

అసూయాపిశాచావిష్టుఁడైన వెంకన్నకు ఈపదవులు కొంచెపాటివి ఐనవి. కాఁగా అతఁడు ద్రోహచింతనుఁడు, స్వార్థపరుఁడు ఐనాఁడు. అతని ద్రోహచింతయే, అతని స్వార్థ

పరతయే ఈరెండే ఆంధ్రనాయకరాజ్యవినాశనమునకు మూల కందములైనవి.

దాదివద్ద ఇట్టి ద్రోహచింత, స్వార్థపరత మందునకైన కానరావు. నిగూఢవిత్తము విషయము ఆమె కొక్కర్తుకయే తెలియును. ఆఅవకాశమును దొరకపుచ్చుకుని ఆ అపారధనము కొఱకు ఆమె కక్కుర్తిపడలేదు. ఎట్టి దాఁపటికము లేకుండ దానిసంగతి ఆమె చెంగమలదాసునకుఁ జెప్పివైచినది.

ఆమె ఎంతసేపును తాను మన్నారప్పనాయనిమగువకుఁ జేసిన వాగ్దానమును, నాగపట్టణపు వైశ్యునకిచ్చిన కరారును నిర్వహించుకొనుటలోనే శ్రద్ధధాన ఐనది.

తంజాపురి రాజస్త్రీలు అలనాఁడు మాటవాసి కొఱకే పట్టుపట్టినారు, తంజాపురి రాజపుత్రధాత్రి ఈనాఁడు మాటవాసి కొఱకే పట్టుపట్టినది. రెండుసారులును ఆపట్టుపంతములు దుఃఖ పర్యవసితములే ఐనవి.

నాలుగేండ్ల శిశుప్రాయమునను, పదునాలుగేండ్ల బాల ప్రాయమునను చెంగమలదాసు తంజాపురి కోటను వీడిపోవు నపుడు దాది ఆతనిని వెన్నంటియుండినది. తలిదండ్రుల గుఱు తెఱుఁగని ఆబాలుని అన్నివిధముల అరసి రక్షించినది; అన్ని విధముల అతని క్షేమాభివృద్ధులకు శ్రమించినది.

ఇంతకును కాలము కలసిరాలేదు. ఐతే చేపట్టిన కార్య ములో చెంగమలదాసుదాది బుద్ధిపూర్వకముగఁ జేసిన లోప మేమియు లేదు. స్వార్థమెఱుఁగని ఆమె ప్రభుభక్తి ప్రశంసనీయ మైనది.

# ౪

# మంగమ్మ

స్వభాష, స్వజనము, స్వదేశము అయినప్పుడే అబల యొకతె రాజ్యలాంఛనములు వహించి భూమిని శాసించుట బహుకష్టము,

అట్టిచో పరభాష, పరజనము, పరదేశము అయినప్పు డట్టిపని దుర్ఘటమని వేఱె వచింప నవసరము లేదు.

దుర్ఘటమైనను అట్టిచోట రాజ్యమును ఆలించి పాలించి తాము పుట్టిన జాతికిఁ బేరుపెంపులు వెలయించిన రమణీమణు లొకరిద్దఱు ఆంధ్రజాతియందు జనించిరి. అట్టివారిలో మంగమ్మ యొకతె.

మంగమ్మ దళవాయి లింగమనాయకుని కూఁతురు. లింగమనాయకుఁడు చంద్రగిరినివాసుఁడు. ఇతఁడు తన కొమార్తెను మధురనాయకరాజైన చొక్కనాథనాయని కిచ్చి క్రీస్తుశకము ౧౬౬౨-వ సంవత్సరమున వివాహము చేసెను.

మధురనాయకరాజులు ఆంధ్రులు. ఆంధ్రభోజుఁడగు కృష్ణదేవరాయల కాలమునుండియు మధురనాయకరాజ్యమును ఆంధ్రులే పాలించుచువచ్చిరి.

మంగమ్మ పెనిమిటియైన చొక్కనాథనాయఁడు క్రీస్తుశకము ౧౬౫౯-వ సంవత్సరమున మధురనాయక రాజ్యసింహాసన మధిరోహించెను. ఇరువదిమూఁడు వర్షములు రాజ్యపాల

నముచేసి యాతఁడు ౧౬౮౨-వ సంవత్సరమునఁ బరమప దించెను.

ఆదినములలో సహగమనదురాచారము చాల ప్రబలి యుండెను. అయినను మంగమ్మ పతిమరణానంతరము సహగమనముచేయుట కొడబడలేదు. ఆచారఛాందసులగు ప్రజ లేమైన అనుకొందురుగాక! ఆమె చచ్చినవారితోఁ జచ్చుట కొప్పుకొనలేదు.

ఆదినములలో సహగమన మొక సదాచారముగఁ బాటింపఁబడుచుండెను. దానిని ప్రతిఘటించువారే లేకుండిరి. మనోద్రఢిమగల రమణీమణి యగుటచేతనే మంగమ్మ అట్టి దినములలోఁ బ్రజాభిప్రాయమును తృణీకరింపఁగల్గినది.

ఏఘోరదురాచారమును బ్రజాహితవాదులైన బ్రిటీషు గవర్నమెంటువారు సయితము ౧౮౩౦-వ సంవత్సరమువఱకుఁ బ్రతిఘటింపఁ దలపెట్టకుండిరో అట్టి ఘోరదురాచారమును ౧౬౮౨-వ సంవత్సరముననే మంగమ్మ ప్రతిఘటించి నిలిచినది.

ఇది ఆంధ్రరమణుల సంఘదురాచారతిరస్కారప్రియత్వమును లోకమునకు వెల్లడించు గొప్పవిషయము.

చొక్కనాథనాయని అనంతర మాతని కుమారుఁడు రంగకృష్ణముత్తువీరప్పనాయఁడు రాజ్యభారము వహించెను. కాని ఇతఁడు చిరకాలము రాజ్యపాలన మొనర్చుటకు నోఁచుకొనలేదు. పూర్తిగ నేడేండ్లైన బ్రజాపాలన మొనర్చెనో లేదో ౧౬౮౯-వ సంవత్సరమున వీరప్పనాయఁడు స్ఫోటకమువలనఁ జనిపోయెను.

ఇతఁడు మరణించునపుడు కితని భార్య ముత్తమ్మ నెలలు నిండిన చూలాలు. పతిమరణమున ముత్తమ్మకుఁ గలిగిన విచారమునకు మేర లేదు. ఓపలేనిదాననని యైన నాలోచింపక ఆమె పతితో సహగమనముచేయ సంసిద్ధపడెను.

సహగమనము దురాచారమని దానికిఁ బ్రతిఘటించి నిలచిన మంగమ్మ తన కోడలిని- అందును నెలలు నిండిన చూలాలిని- సహగమనము చేయనిచ్చునా !

సహగమన మొనర్ప ముత్తమ్మకు ఎంతటి దృఢ కాంక్ష యైన నున్నది. కాని అట్టి దృఢ కాంక్ష కామె నిండు చూలాలితనము తీరని ప్రతిబంధమైనది.

ఏమైననేమి? తుదకు ముత్తమ్మ అత్తమాటలకుఁ జెవియొగ్గి అప్పటికిఁ దన ప్రయత్నమును మానుకొనక తప్పినది కాదు.

కొన్ని దినములకు ముత్తమ్మ మగశిశువును గనినది. పిమ్మట నామె తన అత్తయగు మంగమ్మ చెప్పిన హితవచనములనైనఁ బాటింపక సహగమనము చేసినది.

రంగకృష్ణముత్తువీరప్పనాయని కుమారుఁడు నాయనమ్మ చేతులలోఁ బెరుఁగుచుండెను. అతనికి విజయరంగచొక్కనాథుడని నామకరణముచేసిరి. అతఁడు మూఁడుమాసముల శిశువై యుండఁగా సింహాసన మెక్కించి సమస్తరాజ్యకార్యములును మనుమనిపేర మంగమ్మయే నిర్వహించుచుండెను.

మంగమ్మ రాజ్యకార్యముల నన్నిటిని గుర్తెఱిగిన ప్రాజ్ఞురాలు. కావుననే మధురనాయకరాజ్యము ఆమె ఏలుబడిలో జయప్రదముగ సాగినది. రాజ్యఖలీనమును ఆమె బహు జాగ్ర

త్తతోఁ బట్టినది. బహుపర్యాయము లామె యుద్ధయాత్రలు సాగింపవలసి వచ్చినను మొత్తముమీఁద ఆమె రాజ్యకాలము శాంతియుతముగ, జయప్రదముగ జరిగిపోయినది.

మంగమ్మ రాజ్యకార్యనిర్వహణభారమును బూనుసరికి మొగలు చక్రవర్తి ఔరంగజీబు దక్షిణభారతదేశమున దన నిరంకుశాధికారమును చెలాయించి ద్రవిడదేశముపై ఎత్తి వెళ్లు యోచనలలోనుండెను.

ఈ సంగతిసందర్భములను దీర్ఘదర్శినియగు మంగమ్మ బాగుగ యోజించినది. మొగలాయి మహాసామ్రాజ్యమునకు నియంతయైన ఔరంగజేబు అపారసేనాబలముతో మధుర నాయకరాజ్యమువంటి చిన్నరాజ్యమున కధికారిణియైనఁ దా నెదిరించి పోరుట రాజనీతికాదని ఆమె నిజ మారసినది.

ఇప్పుడు మంగమ్మను విపరిస్థితులైతే ఎదుర్కొనెనో ఒక శతాబ్దికి బూర్వము గోండు సంస్థానాధీశురాలైన దుర్గావతినిగూడ నట్టి పరిస్థితులే యెదుర్కొనెను.

అపారబలసమేతుఁడైన ఔరంగజీబు మంగమ్మపై నిప్పు డెట్లు కత్తిదూసెనో అపారబలసమేతుఁడైన అక్బరు దుర్గావతిపై నప్పు డట్లు కత్తిదూసెను.

కాని అప్పుడు దుర్గావతి యొక విధముగాఁ బ్రవర్తించెను; ఇప్పుడు మంగమ్మ మఱియొకవిధముగాఁ బ్రవర్తించెను.

దుర్గావతికిని, మంగమ్మకును ఎంతేని తేడాగలదు ప్రవృత్తియందు.

దుర్గావతి రాజనీతి ఒల్లని వీరాంగన; సమయజ్ఞతలేని సాహసికురాలు. మంగమ్మ అట్టిదిగాదు. ఆమె రాజనీతియం

దుండు తికమకల నెఱిఁగిన ప్రౌఢాంగన ; కాలానుగుణ్యాత్వము పాటించు ప్రాజ్ఞురాలు.

ఒకచోట వెనుక ముందు లరయని వెఱ్ఱిచొరవ; రాష్ట్ర రక్ష నేమరిన వీరావేశము ; దలముతప్పిన దేశాభిమానము. మఱియొకచోట పౌర్వాపర్యములఁ బరామర్శించు ప్రాజ్ఞత ; లాభనష్టములఁ దులఁదూఁచి లెక్కించు కార్యజ్ఞత; ఏకతాన మైన రాష్ట్రరక్షాహితబుద్ధి.

అగుటచే దుర్గావతి తనఅల్పసైన్యమును అక్బరుని అపారసేనాబలముతో నెదురొడ్డి పోరి ప్రాణములను, సంస్థానమును గోల్పోయెను. మంగమ్మ అట్లుగాక ఔరంగజీబునకు లోబడి మధుర ఆంధ్రనాయకరాజ్యమును నిలబెట్టినది.

సమయజ్ఞత పాటించి మంగమ్మ అట్లు చేయకుండినచో మధుర ఆంధ్రనాయక రాజ్యము చారిత్రక ప్రపంచమునుండి నాఁడే తుడిచివేయఁబడియుండును. లేదా తోడి తంజావూరి ఆంధ్రనాయకరాజ్యమునకువలెనే ఇదికూడఁ దెనుఁగువారిచేతులనుండి జారిపోయియైనఁడుండును.

మంగమ్మ రాజనీతివలనఁ, బ్రజ్ఞాదక్షతవలన మధుర నాయకరాజ్యము మఱియొక అర్ధశతాబ్ది అవిచ్ఛిన్నముగఁ దెనుఁగువారి అధికారముక్రింద కొనలుసాగినది.

ఔరంగజీబుసేనానియైన జులిఫికారుఖాను ౧౬౯౩-వ సంవత్సరమున జింజికోట ముట్టడించుచుఁ గొంతసైన్యమును దక్షిణమునకుఁ బంపెను.

అప్పుడు తంజావూరి మహారాష్ట్రప్రభువు షహాజీ దోసిలి యొగ్గి మొగలులకుఁ గప్పము కట్టుటకు అచ్చుకొనెను.

మైసూరురాజగు చిక్కదేవరాయలు మొగలులతో సంధిచేసికొని వారి సాహాయ్యసంరక్షణములక్రింద తన రాజ్యమును విస్తరింప నుద్యమించెను.

తోడిరాజు లిట్లు చేసినతోడనే మధురనాయకరాజ్యము నేలుచుండిన మంగమ్మకూడ నిష్టమున్నను, లేకున్నను మొగలులకు లోబడక తప్పినదికాదు. పొరుగుననున్న మైసూరు తంజావూరు రాజులు తలయొగ్గుచుండ నామె యొక్కతెయు మొగలులను ప్రతిఘటించి సముద్రమధుబిందువగుట రాజనీతియగునా ?

మొగలు సామ్రాజ్యముతోఁ దన కిట్లు కలిగిన సంబంధము మంగమ్మ తనరాజ్యోపయోగమునకై వినియోగించెను. ౧౭౦౨-వ సంవత్సరమున జులిఫికారుఖాను తిరిగి దక్షిణమునకు వచ్చినప్పు డామె యాతనికి విలువయైన కానుకల నిచ్చి యాతని తోడ్పాటున ఇదివఱకు తంజావూరురాజు తనరాజ్యమునుండి చీలఁదీసికొనిపోయిన కొన్ని ప్రదేశములను మఱలఁ దనరాజ్యమునఁ గలుపుకొనెను.

౧౭౦౭-వ సంవత్సరమున మంగమ్మ దాదుఖాను అను మఱియొక మొగిలు సేనానికిఁ బ్రార్థనాపూర్వక మగు నొక లేఖ పంపెను.

మొగలులకు సామంతుఁడై ఉదయూరుపాళెయమును పాలించుచున్నవాఁడు విక్రమించి మంగమ్మరాజ్యములోని కొన్ని పట్టణములను ఆక్రమించుకొనెను. ఉదయూరుపాళెమురాజు చేసిన అక్రమము తొలఁగించి తన రాష్ట్రమునకు సదుపాయము

చేయుమని మంగమ్మ దాదుఖానుని లేఖాముఖమున వినయముగ వేఁడెను.

ఆలేఖతో మంగమ్మ ఔరంగజీబునకుఁ బంపుటకుఁగొన్ని, దాదుఖానునకుఁగొన్ని, దివానునకుఁగొన్ని కానుకలను బంపెను. అందు ఔరంగజీబునకుఁ బంపినవానిలో వెలగల నగలు, మణులు నుండెను. దాదుఖానున కిరువదివేలును, దివానునకుఁ బది వేలును వెండిరూక లందు గలవు.

దాదుఖాను వానిని అందుకొని తాను స్వయముగా సహాయార్థము రాజాలనందులకుఁ జింతించుచుఁ గొంతమంది సైనికులనుబంపెను. ఈ విషయమును గమనించితిమేని మంగమ్మ మొగలుసామ్రాజ్యబాంధవ్యమును మధురనాయకరాజ్యాభివృద్ధికి ఎట్లుపయోగించినదో సువ్యక్తమగును.

మొదట ధనమును, పిమ్మట భూమిని, తుదకు జీవితమును హరించి దక్షిణాపథరాజ్యములను రూపుమాపవలయునని ఔరంగజీబు ఉద్దేశించినట్లు మనూసి అను ఆనాఁటి చరిత్రకారుఁడు చెప్పుచున్నాఁడు.

ఔరంగజీబుయొక్క ఈ ఉద్దేశ్యమునకు మంగమ్మ అవలంబించిన పద్ధతి యడ్డుతగిలినది.

మంగమ్మ యే యెండకా గొడుగు ఎత్తినది. మొగలు సేనానులకు లంచములు గ్రుమ్మరించినది. తనరాజ్యమును నిర్మూలింప వలసిన మొగలు సైనికులను ఆమె యుక్తిచాతుర్యముచే మధుర రాజ్యక్షేమాభివృద్ధికి వినియోగింపఁగల్గినది.

మొగలు సామ్రాజ్యముతో మంగమ్మ ఇట్లు రాచకార్యములఁ జక్కఁబెట్టుకొనుచుండఁగా మైసూరు ప్రభువు

చిక్క దేవరాయలు పరభూముల నాక్రమించు పనిలో పర్యాప్తుఁడై యుండెను.

౧౬౭౦-వ సంవత్సరమునాఁటికే అతఁడు కావేరినది వఱకుఁగల బారమహాలు, సేలము భాగములను జయించెను. అటు పిమ్మట బెడనూరులో విశేషభాగము లోఁగొనెను. ౧౬౭౪-వ సంవత్సరమున జరిగిన సంధిలో చిక్కదేవరాయ లంతవఱకు జయించిన భూభాగములన్నియు మైసూరురాజ్యమునఁ జేర్చి కొనుటకు నిర్ధారణ యయ్యెను.

పిమ్మట చిక్కదేవరాయలు తన సేనలను మధురపై మరలించెను. ఔరంగజేబు ఈసమయమున మహారాష్ట్రులతో దండాగొండి పడుచుండెను. అగుటచే మధురరాజ్యమునకు సాహాయ్యముచేయుటకుఁగాని చిక్కదేవరాయని శిక్షించుటకుఁ గాని ఆతనికి సావకాశము లేకపోయినది.

సమయము కనిపెట్టి చిక్కదేవరాయలు సేలము, కోయంబత్తూరులపై ఎత్తివెళ్ళి అచ్చటి స్థానికప్రభువుల జయించి వారిని తనకు సామంతులుగాఁ జేసికొనెను; తన దళవాయి కుమారయ్యను మధురరాజ్యములోని తిరుచునాపల్లిని ముట్టడించుటకుఁ బంపెను.

తిరుచునాపల్లి పట్టుకొనికాని తిరిగి మైసూరునకుఁ బోనని కుమారయ్య ఒట్టుపెట్టుకొనెను. కాని హఠాత్తుగ మహారాష్ట్రులు మైసూరుపైఁ బడుటచే కుమారయ్య ఒట్టుతీసి గట్టున బెట్టి తిరుచునాపల్లి వీడి స్వరాష్ట్రరక్షణార్థము తిరుగుమొగము పట్టవలసి వచ్చెను. తిరిగి పోయినవారు పోఁగా మిగిలిన మైసూరు సైనికులను మంగమ్మ అతిసులభముగ ఓడించెను.

మైసూరు సైనికుల పీడ వదలించుకొనిన వెంటనే ఆమె తిరువాన్కూరుపై ఎత్తి వెళ్ళవలసివచ్చెను.

౧౬౭౩-వ సంవత్సరము మొదలు ౧౬౮౯-వ సంవత్సరమువఱకు మధురపాలించిన తిరుమల నాయకుఁడు విక్రమించి తిరువాన్కూరుపై దండయాత్ర సాగించెను. అప్పటి తిరువాన్కూరు ప్రభువు భయపడి తిరుమలశౌరికిఁ గప్పముకట్టుట కచ్చుకొనెను. తిరుమలశౌరికిఁ గొంతకాలము తరువాత మధుర పాలించిన చొక్కనాథనాయని కాలమున రాజ్యమునందు కల్గిన అశాంతి అవకాశముగఁ దీసికొని తనరాజధానియందు సేనల వృద్ధిపఱచుకొని తిరువాన్కూరురాజు మధురపైఁ దిరుగఁబడుటకు వేచియుండెను.

అయినను చొక్కనాథనాయని పుత్రుఁడు రంగముత్తు వీరప్పనాయకుఁడు మధుర నేలుచుండగా అప్పుడు తిరువాన్కూరు పాలించుచుండిన ఉమ్మాయమ్మరాణి (౧౬౭౭-౧౬౮౪) తిరువల్వేణి పురమునకు స్వయముగ వచ్చి వీరప్పనాయకునకు వెలలేని కానుకల నిచ్చి దాసోహమన్నది.

౧౬౮౪-వ సంవత్సరమున రవివర్మయనువాఁడు తిరువాన్కూరున కేలిక యయ్యెను. ౧౬౮౯-వ సంవత్సరమునుండి మంగమ్మ మధురరాజ్యవ్యవహారములను చక్కఁ బెట్ట మొదలిడెను. తోడనే రవివర్మ కప్పముకట్టుట మానెను.

అగుటచే మంగమ్మ రవివర్మపైఁ గత్తిదూయవలసి వచ్చెను. తిరువాన్కూరు రాజ్యమునుండి కప్పము వసూలు చేయుటకు ప్రతి సంవత్సరము మంగమ్మ సేనలను బంపుచుండెను.

తనపై నిట్లు ఏటేట ఎత్తివచ్చుచున్న మధురసేనలకు రవివర్మ ఎదురొడ్డలేకపోవుచుండెను.

ఇట్టి పరరాజపీడయే గాక రవివర్మను నిజమంత్రులపీడ కూడ వేధించుచుండెను. రాజకీయవ్యవహారముల నన్నిటిని తమ పిడికిళ్ళయందు చిక్కఁబట్టి మంత్రులు అతడు పెదవి మెదపెనేని తిరుగఁబడుటకు సిద్ధముగ నుండిరి. ప్రతిఘటించువారు లేక మధురసైనికులు తిరువాన్కూరు దేశమును తమ ఇష్టము వచ్చినట్లు దోఁచుకొని యింటికి వచ్చుచుండిరి. ఏటేట ఇది యొక మామూలై పోయెను.

తమ రాజ్య ముఖద్వారముననున్న ఆరంబొలి కనుమను పరిరక్షించుకొనఁ గల్గియుండిరేని తిరువాన్కూరున కిట్టి దోఁపిడులు ప్రతివత్సరము లేకుండియుండును. కాని ఆరాజ్యమున మెండుకొనియున్న అంతఃకలహము లా యారంబొలికనుమను పరిరక్షించుటకు వీలులేకుండ చేసినవి. చేయునదిలేక తిరువాన్కూరు ప్రజ లిట్లే బాధపడుచుండిరి.

ఇట్లుండగా ౧౬౯౭-వ సంవత్సరమున రవివర్మ ఒకయుక్తి పన్నెను. అతనికి ఇంటియందు మంత్రులపీడ- బయట మధుర సైనికుల పీడ. ఉపాయశాలియగు రవివర్మ ఈ రెండు పీడలను ఒక్కదెబ్బతో వదల్చుకొనుటకు ఊహచేసెను.

కప్పము రాఁబట్టుటకై మామూలు ప్రకారము మధుర సైనికులు ౧౬౯౭-వ సంవత్సరమున తిరువాన్కూరుపై నెత్తి వెళ్ళిరి. వారిని యెదిరించువారే లేకపోయిరి. నేరుగా వారు రాజధానీనగరమగు కోర్కులమువఱకుఁ బోయిరి.

అప్పుడు రవివర్మ బహుప్రమాదకరమైన ఒక పద్ధతి నవలంబించెను. మధురసైనికులతో నాతఁడు సంధి చేసికొనెను. మంత్రులను నిర్మూలించుటలోఁ దోడువచ్చెదేని వారికిఁ దన రాజ్యమునఁ గొంతభాగమును, కోర్కులము నగరమును ఇచ్చుటకు రవివర్మ ఒడంబడిక నడపెను.

ఆ ప్రకారమే యాతఁడు దుర్గమును మధురసైనికులఁ జేతులలోఁ బెట్టెను. వారి సాయమున మంత్రులలోఁ గొందఱిని తుదముట్టించెను. కొందఱు సచివులు పలాయనము చిత్తగించిరి. మఱికొందఱు విశేషధనము అపరాధముగ నిచ్చి ప్రాణములు దక్కించుకొనిరి.

మంత్రులపీడ ఇట్లు వదలినది. కాని రవివర్మకు సంతోషమేమియు లేదు. ఆతని రాజ్యమందలి ప్రధానదుర్గము మధురవారిచేతులలో నుండెను. అతని ప్రాణములు, అతని రాజ్యము, అతని సర్వస్వమును వారి యధీనమున నుండెను.

అయినను రవివర్మ చలింపలేదు. తెగువఁదెచ్చుకొని ఆతడు మధురసైనికులున్న దుర్గమును హఠాత్తుగ ముట్టడించెను. అదరిపాటున పైబడిన రవివర్మధాటికి మధురసైనికులలజడి నొందిరి. ప్రాణములపై ఆశపుట్టి వారు పలాయనము చిత్తగించిరి. వెన్నంటి తరిమి వారిని రవివర్మ చిత్రవధ కావించెను. మధురసేన పూర్తిగ నశించెను.

ఈవిషాదవృత్తాంతమును ఇంటికిఁ జేరవేయుటకు మాత్రము కొద్దిమంది ప్రాణములతో బయటపడిరి.

మంగమ్మ ఇది వినెను. రవివర్మను తగినవిధమున శిక్షించినఁగాని నిద్రింపరాదని ఆమె శపథము పట్టెను.

౧౬౯౭-వ సంవత్సరమున తన దళవాయి నరసప్పయ్యకు ఆమె విశేషసైన్యము తోడిచ్చి తిరువాన్కూరుపైఁ బంపెను. నరసప్పయ్య గొప్ప యుద్ధముచేసి రవివర్మ నోడించెను; మధుర దళవాయి చెప్పిన సంధిపరతుల కాతఁడు అంగీకరించెను. బాకీ యున్న కప్పము అణాపైసలతో నిచ్చివేసెను; అమూల్యము లగు నాభరణముల నెన్నిటినో అపరాధముగ సమర్పించెను. దళవాయి నరసప్పయ్య తిరువాన్కూరునందు పట్టుకొనిన ఫిరంగులు మధుర, తిరుచునాపల్లి కోట బురుజులపై విలసిల్లి మంగమ్మ జయమునకు సాక్ష్యమిచ్చుచుండెను.

తిరువాన్కూరు రాజుతో యుద్ధము ముగిసినదో లేదో ఇంతలో మంగమ్మ తంజావూరు ప్రభువుతోఁ దలపడవలసి వచ్చెను.

తంజావూరి మహారాష్ట్ర ప్రభువు షహాజీ మొదటినుండియు మంగమ్మతో వైరమూని కలహమునకుఁ గాలు ద్రవ్వుచుండెను. మొగలు సైనికుల సాహాయ్యమున నాతనిని శిక్షింపవలయునని ఆమె ఊహ. కాని అట్టి సాహాయ్యము సమయమున కందకుండెను.

షహాజీ ఇదికనిపెట్టి మధురరాజ్యములోని కొన్ని పట్టణములఁ బట్టుకొని సరిహద్దు ప్రదేశములను దోఁచుకొనుచుండెను.

మొక్కవోని రాష్ట్రశ్రేయోహితబుద్ధిగల మంగమ్మ యిది చూచి సహింపలేకపోయినది. ౧౭౦౦-వ సంవత్సరమున ఆమె తన దళవాయి నరసప్పయ్యను తంజావూరు మీఁదికిఁ బంపెను. తంజావూరు సేనలు మధురరాజ్యమున దోఁపిడి చేయకుండ

నాపుటకుఁ గాలిరూనునది ఉత్తరభాగమున మధుర దళవాయి దండు విడిసెను.

కాని ఆతఁడు తంజావూరి యశ్వసైనికులఁ జాకచక్యమును, ధాటిని అరికట్టలేకపోయెను. దండు విడిసి ఒక చోట నుండుటకంటె తంజావూరిసేనల వెనుఁదగిలి యుద్ధకథనము నడుపుటయే మధురరక్షణమునకుఁ మంచి పద్ధతి అని నరసప్పయ్య నిశ్చయించెను.

అగుటచే నాతఁడు రెండవకంటివానికిఁ దెలియకుండ నదిని దాఁటి తంజావూరి రాజ్యముపైఁబడి కొల్ల పెట్ట ప్రారంభించెను.

ఇందుతో తంజావూరి సైనికులకు దిగులుపుట్టెను. వారికిఁ గాలుసేయి ఆడని కంగారుగలైను. అట్టి కంగారులో వారు రాజధానీనగరరక్షణమును ఏమరి నదినిఁదాటి ఒక్కపెట్టున మధుర దళవాయిపైఁ బడుటకు నూహచేసిరి.

అప్పుడు నది నిండువఱదకుఁబొంగి గట్లొరసి శరవేగమును మించి పాఱుచుండెను. తంజావురివారి పక్షమున పెక్కుమంది సైనికులును, పెక్కు గుఱ్ఱములును నదిని దాఁటుచుండఁగనే ప్రవాహ వేగమునకుఁ గొట్టుకొనిపోయెను. తంజావురి సేనలు అల్లడితల్లడియై మధుర సైనికులఁ జేతులలోఁ బూర్తి నాశనము నొందెను. నరసప్పయ్య తంజావురి రాజ్యమును నాశన దేవతకు విహారమందిరముగఁ జేసెను.

మధురవారి విజయవృత్తాంతము దేశదేశములకు ప్రాఁకిపోయినది. షహాజీ ధైర్యము పూర్తిగఁ జిటిలిపోయినది. తన ముఖ్యమంత్రియైన వాగోజీపండితుని కాపట్యమే ఈ అపజయమునకుఁ గారణమని ఆతనికిఁ గోపము పేరెత్తినది.

వాగోజీ పండితుని యెడ ప్రజ లిదివఱకే ద్వేషము వహించియుండిరి. సమయము కనిపెట్టి ఇప్పు డాతనిని పదభ్రష్టుని చేయుటకుఁ బ్రజలు ప్రయత్నించిరి.

కాని పండితుఁ డిసుమంతయైనఁ జలింపలేదు. షహాజీని దర్శించి ఇట్లు విన్నవించెను. 'విక్రమించిన శత్రువుతో గౌరవ ప్రదముగ సంధికూర్తును. ఒకవారము దినములు గడువు చాలును. నే నిట్లుచేయలేక పోదునేని నాపీకి నుత్తరింపుఁడు.'

నిస్సహాయస్థితియందున్న షహాజీ పండితున కాతఁడు కోరిన గడువు నిచ్చెను. వెంటనే వాగోజీ తన కార్యదర్శులను స్థానికవర్తకశిఖామణులవద్దకుఁబంపి విశేషధనమును ఋణము చేసెను. వీలుచిక్కినవిధముల నెల్ల ధనము పోగుచేసెను. మూఁడు నాలుగు రోజులలో నాతఁ డైదులక్షల రూకలను సమకూర్చెను.

వానితో మధురవారి మంత్రులకు లంచములు పోసెను. దళవాయి నరసప్పయ్యతండ్రికి ధనతృష్ణ హెచ్చు. వాగోజీ ఆతనికి ఎంచరాని లంచములిచ్చెను. దానితో మధుర తంజాపురి రాజ్యములకు సంధిపొసఁగెను. పండితుని మంత్రాంగము ఫలించినది. ఆతని సంతోషము మిన్నుముట్టినది. ఆతని శత్రువులు తలలు వంచుకొనిరి. తంజాపురి రాజ్యమున ఆతని పలుకుబడి ఇనుమడించినది.

ఈ సంధికార్యముల నిర్వహించుటలో మధుర, తంజావూరు రాజ్యములు పర్యాప్తములై యుండఁగా మైసూరురాజు కావేరీజలమునంతను తన రాజ్యములోని భూములకు మరలించుకొనుటకై ఆనదిపైఁ బెద్ద ఆనకట్ట కట్టెను. అందువలన కావేరి

జలము ఒకచుక్క అయినను క్రిందికి రాకుండెను— మధుర తంజాపురి రాజ్యములకు నీటియెద్దడి కలిగి కఱవు సంభవించునను భీతి పొడమెను. క్రొత్తగాఁ బొసఁగిన సంధివలన స్నేహము నెఱపుకొనుచున్న తంజావూరు మధుర ప్రభువులు ఉభయులును ఏకమై మైసూరుపై నెత్తివెళ్లుటకు యత్నపడిరి.

కాని ఇంతలో వర్షములు తూలగాఁ గురియుటచే చిక్కదేవరాయలు కట్టిన ఆనకట్ట విచ్చిపోయి కావేరి యథాప్రకారముగఁ బ్రవహించి మధుర తంజాపురి రాజ్యములకు జలసమృద్ధి నొడఁగూర్చెను. చిక్కదేవరాయల ప్రయత్న మిట్లు తొలుతనే విఫలమునొందినను మధుర తంజాపురి రాజ్యములకుఁ గల్గిన నూతన స్నేహమును దృఢపఱచుటకు మాత్రము సాధనమయ్యెను.

ఇంతవఱకు మంగమ్మ ఆమె తలపెట్టిన కార్యములందన్నిటియందును జయము గొనుచువచ్చెను.

మారవరాష్ట్ర మనబడు రామ్నాదునకు అధిపతియైన రఘునాధ సేతుపతి మధుర సామంతరాజులలో నొకఁడు. మంగమ్మ మైసూరు, తిరువాన్కూరు, తంజాపురి ప్రభువులతో యుద్ధములందుఁ దగుల్కొనియున్నప్పుడు రఘునాధసేతుపతి మధురకుఁ గప్పము కట్టుట మానివేసెను.

అంతతో నూరుకొనక సాహసించి అతఁడు ౧౬౭౮-వ సంవత్సరమున మధురానగరమునే ముట్టడించి పట్టుకొనెను. కాని మధుర దళవాయి నరసప్పయ్య అతని ఆటలు సాగనీయక అతనిని మధురరాజ్యమునుండి తఱిమి కొట్టెను.

౧౭౦౦-వ సంవత్సరమున మంగమ్మ తంజావురి ప్రభువుతోఁ బోరుచుండెను. అప్పుడు రఘునాథసేతుపతి మంగమ్మకుఁ బ్రత్యర్థియై తంజావూరివారితోఁ జేతులుకలిపెను.

ఆ కోపము మనసునందుంచుకొని మంగమ్మ తంజావూరి యుద్ధము సమాప్తి నొందిన వెంటనే ౧౭౦౨-వ సంవత్సరమున తన దళవాయి నరసప్పయ్యను సేతుపతిపైకిఁ బంపెను. సంధి కుదురుటచే తంజావూరిసేనలు మధురసేనలకుఁ దోడువచ్చెను. అయినను జయము సేతుపతినే వరించెను. అనేక యుద్ధములందు మధురకు జయమొనగూర్చిన దళవాయి నరసప్పయ్య ఈమా అపజయము నొందుటయేగాక ప్రాణములనుగూడఁ గోల్పోయెను.

బహువారములు యుద్ధయాత్రలు సల్పియుండుటచే మధురసేనలు పూర్తిగ నలసియుండెను. మధురసేనకంటె మారవబలము శక్తిమంతమై యుండెను. మధురపక్షమున నున్న బలము మధుర, తంజావూరుసేనల కూటమి. మారవపక్షమునం దేకరాష్ట్రమునకుఁ జెందిన బలముమాత్రమేగలదు. కావుననే మారవసైనికు లైక్యతకల్గి ఏకతానమైన శక్తిని జూపిరి.

కాఁగా ౧౭౦౨-వ సంవత్సరమున సేతుపతి మధురరాజ్యమునుండి చీలిపోయి రామ్నాదును స్వతంత్రముగఁ బరిపాలింపఁ దొడఁగెను. మంగమ్మ సేతుపతిని జయింపలేకపోయెనని ఒప్పుకొనక తప్పదు.

అయితే అంత మాత్రమున ఆమె ప్రతిభ కేమియు లోపములేదు. ఆమె రాజ్యఖలీనము పట్టుసరికి మధురనాయక

4

రాజ్యము విషమస్థితిలో నుండెను. తన శక్తిసామర్థ్యములను, రాజనీతిని ఉపయోగించి ఆమె రాజ్యవిచ్ఛిత్తిని అరికట్టినది. మధురనాయకరాజ్యమునకు తిరుమలనాయకుని దినములలో నుండిన ఉచ్ఛస్థితిని తిరిగి కలిగించినది.

ఒకవంక మొగలులు, మఱియొక దిక్కున తంజావూరు ప్రభువు, వేఱొకప్రక్క మైసూరురాజు, మఱియొండు దెస తిరువాన్కూరు ఏలిక, వేఱొండువంక మారవదేశాధిపతి-చుట్టుముట్టి పంచాగ్నులవలె నామెను బొదవిరి.

తెలివికలిగి యామె మొగలులతోఁ జెలిమి సలిపి మిగిలినవారిని ఒక్కొకరినే వదలించుకొని వచ్చినది. ఇందామెకు దళవాయి నరసప్పయ్య కుడిభుజమువలె సాయపడెను. అతని చావుతో నామెకుఁ గుడిభుజము కూలిపోయినట్లయ్యెను. అగుటనే సేతుపతి తలయెత్త కల్గినాఁడు. బహువారములు జైత్రయాత్రలుసల్పి విసిగి వేసారి నాయకుని గోల్పోయి నిస్సహాయస్థితియందున్న మధురసేనలను 'బ్రహ్మాస్త్రోబ్రహ్మ' మీఁద సేతుపతి యోడించినాఁడు.

మంగమ్మ మతసహనముగలది. ఆమె రాజ్యమున హిందువులు, క్రైస్తవులు, మహమ్మదీయులు నుండిరి. ఆమె సమకాలికులగు తంజావూరు ప్రభువును, మారవదేశాధిపతియుఁ గ్రైస్తవమతబోధకులను, ఆమతము స్వీకరించినవారిని విద్వేషించి పీడించుచుండువారు. కాని మంగమ్మ యట్లుఁగాక విశాలహృదయముతోఁ గ్రైస్తవులయెడ సమరసభావముఁ జూపెను.

మహమ్మదీయమతముపట్ల కూడ ఆమె సహనభావము వహించెను. ౧౭౦౧, ౧౭౦౧-వ సంవత్సరములం దామె మసీ

దులకు భూదానములుచేసినటు లామె వేయించిన శాసనములు చెప్పుచున్నవి.

ఆమె హిందువులకుఁ జేసిన దానధర్మముల కంతు పంతు లేదు.

ఆమె దానగుణము మెచ్చఁదగినది. దేవాలయముల కామె చేసిన దానములను శాసనములు ఘోషించుచున్నవి. మధుర మీనాక్షీ దేవాలయమునఁ గోనేరుకుఁ బశ్చిమభాగమున నామె యొక చిన్నగుడిని నిర్మించినది. ఉత్తమపాళెయములోని కాళహస్తీశ్వర దేవాలయమున కామె దానముచేసినటు లచ్చటి శాసన మొకటి చెప్పుచున్నది.

ఆమె రోడ్లు వేయించినది; సత్రములు కట్టించినది; చెఱువులు తవ్వించినది; చావడులు నిర్మించినది: రోడ్లప్రక్క చెట్లు నాటించినది ; మార్గస్థుల ఉపయోగార్థ మామె అక్కడక్కడ విశ్రామశాల లేర్పఱచినది: చలివేంద్రలు పెట్టించినది.

రామేశ్వరముపోవు రోడ్లమీఁద నామె కట్టించిన చావడులు, సత్రములును కొన్ని నేఁటికిని ఉన్నవి. శివలూరు చెంతగల మానప్పారె అనుచోట నేఁడు 'ట్రావెలర్సుబంగాళా'గా నుపయోగింపఁబడుచున్న భవనము మంగమ్మ నిర్మించినదే.

సోళవందము అనుతావునగల పెద్దసత్ర మామె నెలకొల్పినదే. రైలు పడకపూర్వము రామేశ్వరయాత్రికుల కది విశేషముగ నుపయోగించునది. ఆసత్రము నిరంతరాయముగ సాగుటకు మంగమ్మ భూవసతి గల్పించినది. బ్రిటిష్ ప్రభుత్వము వారు ఆభూమిని తమ స్వాధీనము చేసికొని ఆధర్మశాల కే

కేట మూఁడు వేల నూటయఱువది రూప్యముల నిచ్చుచున్నారు. ఈ వరుమానములో మిగిలిన పైకమును పెట్టి ప్రభుత్వమువారు మధురలో రైలుస్టేషనున కెదురుగా మఱియొక సత్రమును నిర్మించియున్నారు. సోళవందము సత్రమును, మధుర ధర్మశాలయు నేఁటికిని మంగమ్మనామముతోడనే వ్యవహరింపఁబడుచున్నవి. తడంపట్టి అనుచోటగల ధర్మశాలకూడ నామె నామముతోడనే నడుచుచున్నది. తమిళదేశమధ్యముననుండి ఆ సత్రము లెల్లకాలమునకు ఆంధ్రరమణి దాననిరతిని లోకమునకుఁ జాటుచునే యుండఁగలవు.

అన్నదాన సమాజమున కామె ౧౭౦౧-వ సంవత్సరమున భూమిని దానముచేసినట్లు శాసన మొకటి చెప్పుచున్నది. ఆమె పెక్కు అగ్రహారము లిచ్చినది.

ఉయ్యంకొండ కాలువగట్టున ౧౬౯౭, ౧౭౦౪-వ సంవత్సరములందు ఆమె వేయించిన శాసనములు వ్యవసాయాభివృద్ధియందు, నీటిపాఱుదలయందు ఆమెకుఁగల శ్రద్ధను వెల్లడిచేయుచున్నవి. ఉయ్యంకొండ కాలువకు మొదటి పొల్లుకళింగి (హెడ్ స్లూస్) తిరుచునాపల్లికిఁ బదునైదుమైళ్ళ దూరమునఁగల పెట్టయివాట్టలై అనుచోటగలదు. దాని నిర్మాణము చిత్రమైనది. ఆనిర్మాణములోని రాతిస్తంభములు దేవాలయపురాతిస్తంభములవలెఁ జెక్కడపుపనితో నొప్పారుచున్నవి. స్థానిక ప్రజ లీ నిర్మాణము మంగమ్మ కట్టించినదని చెప్పుదురు.

నాఁటి మైసూరురాజగు చిక్కదేవరాయల పిసినారితనమును, మంగమ్మ దానశీలమును ప్రజలు కథారూపముగ నేఁటికిని స్మరించుచుందురు.

నాఁటి మైసూరురాజు చిక్కదేవరాయలు పరమలోభి. దినమునకు రెండువేల పెగోడాలు (ఒక్కొక్కటి మూఁడునర రూపాయిలు) ఖజానాలో వైచినగాని భోజనముచేయువాఁడు కాఁడు. ఇట్లుతఁడపారధనమును పోగుచేసి యొక రహస్యస్థలమునసుంచి ౧౭౦౪ డిసెంబరు ౧౨-వ తేదీని మరణించెను. లోభగుణదూషితుఁడైన అతనిని యమభటులు నరకలోకమునకుఁ గొనిపోయిరి.

కొద్దిరోజులకుఁ బిమ్మట యమభటు లొకనాఁడు ఆరాజునకుఁ దెలిసిన మైసూరుపౌరు నొకనిని పొరపాటున యమలోకమునకుఁ గొనివచ్చిరి కాని, అంతలో యమభటులకుఁ దమ పొరపాటు తెలిసివచ్చినది. కాఁగా వా రాతనిని తిరిగి భూలోకమునకుఁ బంపివేయ నాయత్తపడిరి.

ఈలోగా మైసూరురాజు ఆపౌరుని కలసికొని యతని ద్వారా- భూలోకమున రాజ్యముచేయుచున్న తనకుమారున కిట్లు కబురుచేసెను.

'పిసినారితనమువలన నాకు నరకలోకప్రాప్తిమైనది. దానగుణశోభితయగు మంగమ్మ కొలఁది దినములలో మరణింపఁ గలదఁట. ఆమె కొసము ఈదేవలోకమున బ్రహ్మాండమైన స్వాగతోపచారములు చేయుచున్నారు. నాకును దేవలోకప్రాప్తి కలుగుటకు నాపుత్రుఁడు విశేషదానధర్మములు చేయవలయును. ఈసంగతిని అతనికిఁజెప్పుము. నేను కూడఁబెట్టిన ధనమును నిక్షిప్తముచేసియున్న స్థలము నీకుఁ జెప్పుచున్నాను. జాగ్రత్తగ నాపుత్రునకుఁ దెలియఁజేయుము.'

మైసూరుపౌరుఁడు భూలోకమునకు వచ్చి ఈసంగతుల నెల్ల చిక్కదేవరాయలతనయునకుఁ దెలియఁజెప్పెను.

అతఁడు మొదట ఈమాటలను నమ్మలేదు. కాని ఈ వార్తవచ్చిన కొద్దిరోజులకు మంగమ్మ పరమపదము నొందుటయు, సంకేతస్థలమున నపారధనసంపత్తి దొరకుటయు నతనికి నమ్మికను కలిగించినవి. అందుమీఁద నతఁడు విశేషదానధర్మము లొనరించి తండ్రికి ఉత్తమలోకప్రాప్తి నొనగూర్చెను.

ఇది మంగమ్మ దాననిరతిని, చిక్కదేవరాయల పిసినారితనమును జాటుటకుఁ బ్రజ లల్లిన కథ కావలయు. చిక్కదేవరాయల మరణానంతరమే మంగమ్మ పరమపదమును బొందియుండుట మాత్రము సత్యము.

మంగమ్మనుగుఱించిన మరికొన్ని కథలు- సత్యములైనను, అసత్యములైనను- కూడ నీ సందర్భమున వివరించుట సముచితముగ నుండును.

ఆమెకు అగ్గలమగు దాననిరతి కలుగుటకుఁ గారణముగా జను లీ దిగువగాథను జెప్పుదురు. ఒకనాఁ డామె పరధ్యానముగనుండి ఎడమచేతితో నోటిలో వక్కపొడివైచుకొన్నదఁట. ఈఆచారభంగమునకుఁ బ్రాయశ్చిత్తమునుజెప్ప నామె పండితుల నడిగినదఁట. దానికి వారు విశేషదానము లొనర్చుటయే యీపాపమునకుఁ బరిహారమని చెప్పిరఁట. అందువలననే ఆమె వితరణశీల యైనదఁట.

ఆమె మహాత్వకాంక్షనుగుఱించి ఇట్టిదే యొక కథ.

౧౭౦౪-వ నాఁటికి మంగమ్మ మనుమఁడు పెరిఁగి పెద్దయై రాజ్యకార్యనిర్వహణధక్షుఁ డయ్యెను. కాని మంగమ్మ అధికా

రము మనుమనికీయ నంగీకరింపలేదఁట. అప్పుడు మనుమఁడు తన కిష్టులైన సేనానులతోఁగలసి ఆమెను ఆమెనివశించు రాజభవనమునందే చెఱబెట్టెనఁట. అక్కడ ఆమెను చాల హింసపెట్టిరఁట. అన్నముపెట్టక అలయించువారఁట. ఆమె చెఱగది యినపకటకటాల ఇవతల అన్నముపెట్టువారఁట. ఆ అన్నము నామె కళ్ళతోఁ జూడఁగలిగెడిదఁట; ముక్కుతో వాసనచూడఁ గలిగెడిదఁట. కాని చేతులతోమాత్ర మందుకొనలేక పోయెడిదఁట. ఈవిధముగా నామె వనటఁబొంది వసివాళ్లువాడి చని పోయినదఁట.

విశ్వాస్యమగునా? వంశాంకుర మెక్కడ లేకుండఁబోవునోయని కోడలి సహగమనోద్యోగమును మానిపించి పుట్టిన మగబిడ్డను పెంచి పెద్దచేసి ప్రాజ్ఞతవచ్చిన పిమ్మట రాజ్యాధికారము మంగమ్మ అతని కీయ సందేహించినదనుచో నమ్మఁ గలమా ?

ఈకథ నిజముగఁ గాళ్లులేనిది. కావున నీప్రసక్తి మాని ఇఁక అసలు విషయము నెత్తుకొందము.

మంగమ్మ కట్టించిన మందిరములు కొన్ని ఇప్పటికిని వెలసియున్నవి. తిరుచునాపల్లి కోటలోని సమావేశమందిర మామె కట్టించినదే. మధురలో మంగమ్మమహాలు అను పేరుతో వ్యవహరింపఁబడు భవన మామె నిర్మించినదే. మంగమ్మ ఆభవనముననే చెఱగొనఁబడియెనని చెప్పుదురు. అది ఇటీవల కొంతకాలము జిల్లాజెయిలుగా నుండునది. ఇప్పు డా భవనములోఁ దాలూకాకచ్చేరియున్నది. మధురలోని తమగము అనుపేరుగల మందిర మామె నిర్మించినదే. 'తమగము' అనునది తెలుఁగు

పదము, తమగము అనగా వేసవిగృహము. ఆగృహమునకు కప్పుమాత్ర ముండును. గోడ లుండవు. దూలములు స్తంభముల మీఁద నాధారపడి యుండును. వేసవి విడిదికోసము మంగమ్మ దానిని నిర్మించియుండును. ఇప్పు డామందిరమును చాల మార్పులుచేసి గోడలతో బందోబస్తుగావించి ప్రభుత్వమువారు తమకచ్చేరీలను నెలకొల్పియున్నారు. అయితే మంగమ్మ ఆ మందిరమునకుఁబెట్టిన తమగము అను నామము నేఁటికిఁగూడ వ్యవహారమునం దున్నది.

పతిమరణానంతర మామె సాగుమానముచేయక సంస్కారబుద్ధిని బ్రస్ఫుటముచేసిన విషయము మీవఱకే నివేదితమై ఉన్నది. ఆమె సంఘసంస్కారప్రియత్వమును వెల్లడించు మఱి యొక విషయ మిచ్చట వివరింపఁబడుచున్నది.

మధురలో పట్టునూలుకరణములను నేతకాళ్లుకలరు. వారు పూర్వ మెప్పుడో సౌరాష్ట్ర, ఘూర్జర దేశములనుండి ఆంధ్రదేశముమీఁదుగా మధురకువచ్చి వలస నెలకొనిరి. వారు తెనుఁగు బాగుగ మాటలాడఁగలరు.

వారు సదాచారసంపత్తిగలవారు. వారు బ్రాహ్మణుల వలె నుపాకర్మ మాచరింప నారంభించిరి. మంగమ్మ కాలములో మధురానగరాధికారి వారిని బ్రాహ్మణాచార మవలంబించినందుకు నిర్బంధములో నుంచెను.

అందుమీఁద వారు రాణి మంగమ్మకుఁ దమకష్టపాటును గుఱించి విన్నవించుకొనిరి. మంగమ్మ అప్పుడు పండితపరిషత్తును సమావేశపఱచెను. పట్టునూలుకరణములకు ఉపాకర్మాధికారము న్నదో లేదో తేల్చవలసినదిగాఁ బరిషత్తున కామె ఆజ్ఞ యిడెను.

పరిషత్తువారు విచారణసలిపి పట్టునూలుకరణుల కట్టి యధికార మున్నదని నిశ్చయించిరి. అప్పుడు మంగమ్మ తాళ పత్రముపయి నాపరిషత్తు నిర్ణయము వ్రాయించి పట్టునూలు కరణుల కిచ్చెను.

ఆపత్ర మిప్పటికిని మధురలో పట్టునూలుకరణులవద్ద నున్నది.

పూర్వాచారపరాయణతకుఁ బట్టుపగ్గములులేని ఆదిన ములలో మంగిమ్మ యింతటి సంఘసంస్కారపరాయణతను బ్రద ర్శింపఁగలుగుట నిజముగా శ్లాఘనీయమైనది.

క్రీస్తు శకము ౧౨౬౦ నుండి ౧౨౯౫-వ సంవత్సరము వఱకు ముప్పదియైదు వర్షములు కాకతీయాంధ్ర సామ్రా జ్యమునకు నియంత్రియై రాజ్యకల్లోలములఁ గలఁకఁదేర్చి రాజ కీయ విషమ పరిస్థితులఁ జక్కఁబఱచి సుస్థిరమైన రాజ్యమును దౌహిత్రుఁడు ప్రతాపరుద్రున కప్పగించి దివంగతురాలైన ఆంధ్రరమణీమణి రుద్రమ్మకువలెనే క్రీస్తుశకము ౧౬౮౯ నుండి ౧౭౦౬-వ సంవత్సరమువఱకుఁ బదునెనిమిది వర్షములు మధుర ఆంధ్రనాయకరాజ్యమునకుఁ బ్రభ్వియై రాజ్యకల్లోలములఁ గలఁకఁదేర్చి రాజకీయ విషమ పరిస్థితులఁ జక్కఁబఱచి సుస్థిర మైన రాజ్యమును పౌత్రుఁడు విజయరంగచొక్కనాథున కప్ప గించి మంగమ్మ దివంగతురాలైనది.

తమిళము ప్రధానభాషగాఁగల రాష్ట్రమునకుఁ బాలకు రాలయ్యు ఆంధ్రరమణి మంగమ్మ తానువేయించిన శాసనము లలో విశేషభాగము తెనుఁగుననే వెలయించెను. మంగమ్మ ఆత్మభాషాభిమానమువలన ఆనాఁడా తమిళభూభాగమున

ఆంధ్రము రాజభాషగా విలసిల్లినది. పరరాష్ట్రమునం దుంటిని యని ఆమె స్వభాషను మఱువలేదు.

ఉచితజ్ఞురాలు మంగమ్మ చూపిన స్వభాషాభిమాన మును జ్ఞప్తియందుంచుకొని ఉచితజ్ఞులగు ఆంధ్రులు సీమలు గాని సీమలయందు వలస నెలకొనినను స్వభాషను విస్మరింప కుందురు గాక!

ఆంధ్రజాతికిఁ బేరుపెంపులు వెలయించు రమణీమణు లలో నొకతెయైన మంగమ్మ జీవితచరిత్రనుండి మనము నేర్చు కొనవలసిన ఉత్కృష్టమగు నీతిపాఠమిదియే.

'అల చోళ పాండ్యసీమలఁ దెల్గుసరకార్ల
పసుపు నూయాణమై ప్రాఁకునాఁడు
చూచి సంతోషభారంబు మోచి శిరము
నూఁచు భాగ్యంబునకు నింత నోఁచలేక
యేల పుట్టితి నిపు డిసీ! యేటిబ్రతుకు
కటకటా! దాఁటిపోయె బంగారుయుగము.'

—తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

## మీనాక్షి

మీనాక్షి విజయరంగచొక్కనాధుని భార్య. విజయరంగచొక్కనాధుఁడు మంగమ్మ మరణించిన పిమ్మట ౧౭౦౬-వ సంవత్సరమున మధుర ఆంధ్రనాయక రాజ్యమునకుఁ బాలకుఁడయ్యెను. ఇరువదిఆఱు సంవత్సరములు రాజ్యమును పరిపాలించి అతఁడు ౧౭౩౧-వ సంవత్సరమున ఇహలోకమును వీడెను. పిమ్మట రాజ్యభారమువహించుట కీతనికిఁ బురుషసంతతి లేదు.

అగుటచే రాజ్యనిర్వహణభార మంతయు నొక్కపెట్టున విఱుచుకొని మీనాక్షిపైఁ బడెను.

విజయరంగచొక్కనాధుఁడు తన పరిపాలనాకాలమును దఱుచుఁ దీర్థయాత్రలతో వెళ్ళఁబుచ్చెను. ఆసమయములందెల్ల రాజ్యకార్యము లన్నియు మీనాక్షియే నిర్వహించుచుండునది. ఇప్పు డీక రాజ్యభారమంతయు సర్వకాలమున కామెమీఁదనే పడెను.

యథాశక్తిని ఆమె నాయకరాజ్యపరిపాలనము సాగింపదొరకొనెను. మధురనాయకరాజవంశముతో రక్తసంబంధముగల బంగారు తిరుమల అనువాని పుత్రుని దత్తత చేసికొనెను. ఇతనిపేరు విజయకుమారుఁడు. ఈదత్తస్వీకారమున మీనాక్షికి

నామె సోదరుఁడు వెంకటపెరుమాళ్లు అమితసాహాయ్యము చేసెను.

కాని ఈ దత్తస్వీకారము రాజ్యాభివృద్ధికి దోహదము చేయలేదు. పైపెచ్చు మధురరాజ్యవినాశనమునకును, మీనాక్షీ ప్రాణపరిత్యాగమునకును గారణభూత మాయెను.

చేదోడు వాదోడు కావలసిన బంధువులే మీనాక్షియెడ ద్రోహచింతనులయిరి. తన కుమారుని దత్తత చేసికొన్నదని విశ్వాసమైన లేక బంగారు తిరుమలయ్య యప్పటి మధుర దళవాయి యగు వెంకటాచార్యునితో లాలోచియై మీనాక్షిని సింహాసనభ్రష్టను జేయుటకుఁ బ్రయత్నము సల్పెను. తిరుచునాపల్లి కోటలోఁ జొఱబడి మీనాక్షిని వెడలనడపవలయునను వారి ప్రథమప్రయత్నము భగ్నమయ్యెను.

మధురనాయకరాజ్య మిట్లు ౧౭౩౪-వ సంవత్సరమున గృహచ్ఛిద్రములతో వేఁగిపోవుచుండఁగా ఆర్కాటు నవాబు తన కుమారుఁడగు సఫ్దరాలిని, అల్లుఁడగు చాందాసాహేబును మధుర, తంజావూరు రాజ్యములను జయించి కప్పము రాబట్టుటకై పంపెను.

ఇట్లు మధురపై నెత్తివచ్చిన మహమ్మదీయులతో బంగారు తిరుమలయ్య చేతులుకలిపెను. అతఁడు సఫ్దరాలికి ఎంచరాని లంచములిచ్చెను. సందు దొరికినదికదా అని సఫ్దరాలి మీనాక్షిపైఁ గత్తికట్టెను.

అప్పుడు మీనాక్షి తిరుచునాపల్లికోటలో ఠాణ్యామువేసికొనియుండెను; వేయికళ్ళతోఁ గోటను రక్షించుచుండెను.

ఇట్టి స్థితిలో కోటను ముట్టడించి పట్టుకొనుట కలలోని వార్తయని అతఁడు నిశ్చయించి మోసముచేయఁ దలపెట్టెను. తిరుమలయ్య మీనాక్షిసందున నడచుచున్న తగాదా పరిష్కరించువానివలె నటించుచు సఫ్దరాలి ఉభయుల వాదములు వినుటకని ఒక సభ సమావేశ పఱచెను.

మీనాక్షి తురకవాని మాటలు నమ్మలేదు. ఆసభతో నామె యెట్టి జోక్యమును బెట్టుకొనలేదు. లంచముతిన్న సఫ్దరాలి తీర్పు బంగారు తిరుమలయ్య పక్షమునఁ జేసెను. తీర్పు ప్రకారము కార్యము నిర్వహించు భారము బావమఱఁది చాందాసాహేబున కప్పగించి అతఁడు ఆర్కాటునకుఁ బోయెను.

అప్పుడు మీనాక్షి చాందాసాహేబుతో రాయబారము నడపెను. సఫ్దరాలి చేసిన ఏర్పాటులు జరుగకుండ చూచినచో చాందాసాహేబున కామె కోటిరూపాయి లిచ్చుట కచ్చుకొనెను. చాందాసాహేబు వల్లెయనెను. తన ప్రతిపాదన వినుటయే తడవుగ నెంతమాత్రము జంకుకొంకులులేక చాందాసాహేబు వల్లెయనుటతో మీనాక్షికిఁ గొంతయనుమానము తోఁచినది. అది కనిపెట్టి నమ్మకము పుట్టించుటకై చాందాసాహేబు ఎట్టిప్రమాణమైనను జేయుట కంగీకరించెను.

అందుమీఁద మీనాక్షి సోదరుఁడు వెంకటపెరుమాళ్ళు చాందాసాహేబును కావేరీతీరమునఁగల దళవాయి మంటపమునకుఁ గొనిపోయెను. అక్కడ అతడు ముహమ్మదీయులమతగ్రంథమైన కొరాను శిరమునఁదాల్చి ప్రమాణముచేసెను.

అయితే ఆసమయమున చాందాసాహేబు శిరమున నున్నది కొరానుకాదు. కొరానుఅట్టలో భద్రపఱుపఁబడిన

ఇటికఁబాయి ! మీనాక్షి కాని, వెంకటపెరుమాళ్ళు కాని ఈరహస్యమును గనిపెట్టలేక పోయినారు.

కాఁగా నిశ్చింతముతో మీనాక్షి చాందాసాహేబును తన కోటలోనికి రావించి స్వాగతముచేసెను.

ఇంతలో మీనాక్షి తిరుమలయ్యతో సంధి కావించుకొనెను. అగుటచే నామె తిరుమలయ్యను, విజయకుమారుని సురక్షితముగా మధురకుఁ జేర్చి వారికి చాందాసాహేబునుండి ఏవిధమైన ప్రమాదమును సంభవింపకుండ జాగ్రత్తగా నుంచెను. ప్రత్యర్థు లిరువురు సంధిచేసికొని స్నేహముతో నున్న సంగతి సాహేబునకుఁ దెలిసినది. ఒకరితో నొకరిని డీకొల్పి అధికారము చెలాయించుటకు సాహేబునకు వీలుచిక్కినది కాదు.

మీనాక్షి మోసముచేసినదని భావించి రోషమువహించి యాతఁడు ఆర్కాటునకుఁ బోయినాఁడు.

౧౭౩౬-వ సంవత్సరమున తిరిగి చాందాసాహేబు మధురపై నెత్తివచ్చినాడు. మధురరాజ్యము నీతడవ జయించి తీరవలెనని అతని కృతనిశ్చయము. తిన్నఁగాఁబోయి తిరుచునాపల్లి కోటలో ప్రవేశించి మీనాక్షికిఁగల శత్రువుల నందఱను సంహరింప నుద్యమించినట్లు నటించెను. మీనాక్షి ఇది నిజమని నమ్మి చాందాసాహేబు చేతులలోఁ గీలుబొమ్మ ఆయెను. చూచీ చూడని మఱపుతో నామె చాందాసాహేబు చేతల నంగీకరించుచుండెను.

మధురనాయకరాజ్యపరిపాలనమంతయు చాందాసాహేబు హస్తగతమయ్యెను. తిరుచునాపల్లియందు సాహేబు

పలుకుబడి విస్తరించెను. గోవిందయ్య, రవణయ్య అను మీనాక్షి దళవాయిల నిద్దఱ నాతఁడు ఎనుబదివేల ఆశ్వికదళము తోడను, మఱికొంత కాల్బలముతోడను దక్షిణాదికిఁ బంపెను. బంగారు తిరుమలయ్య చేతులలోనున్న దిండిగల్లుకోటను వారు పట్టుకొనిరి.

చాందాసాహేబు సేనలు మధురాపట్టణముపైకిఁ బోయెను. అచ్చట తిరుమలయ్య కొంతరాణువతో సాహేబు సేనల నెదిర్చి పోరెను. కాని తుదకు ఓడి విజయకుమారునితోఁ గలసి పాఱిపోయెను.

మధురరాజ్యమంతయు ముహమ్మదీయ సేనల కైవసమయ్యెను. చాందాసాహేబు స్వతంత్రించి పరిపాలన ప్రారంభించెను. ఆతఁడు చేసిన ద్రోహమంతయు మీనాక్షి కిప్పటికిఁ దెలియవచ్చినది. కాని కార్యములేదు. శ్రుతిమించి వచ్చినది. కొరాను శిరమునఁదాల్చి చేసిన ప్రమాణమును బూదిఁగలిపి చాందాసాహేబు ఉచ్చనీచములు లేక మీనాక్షిని జెఱఁబెట్టెను.

బ్రతికి చెడ్డది కావున కారాగారవాస మా ఆంధ్రరమణీమణికి దుర్భర మనిపించినది. విషముత్రాగి ఆమె ప్రాణములు త్యజించినది.

౧౫౩౯-వ సంవత్సరము మొదలు అవిచ్ఛిన్నముగా సాగుచుండిన మధుర ఆంధ్రనాయకరాజ్యము నాఁటితోఁ దుద ముట్టినది.

అయితే- మధుర ఆంధ్రనాయకరాజ్య వినాశనమునకు మీనాక్షి యెంతవఱకుఁ గారకురాలు? నిమిత్తమాత్రము.

అండయై యుండవలసిన ఆమె దళవాయి శత్రువులతోఁ గుమ్మక్కు అయినాఁడు.

రాజ్యక్షేమాభివృద్ధికిఁ దపస్సు ధారపోయవలసిన ఆమె దత్తపుత్త్రుఁడును, ఆతని తండ్రియు ద్రోహచింతనులై కొంప మీఁదికిఁ దెచ్చినారు.

కొరాను శిరమునఁదాల్చి చేసిన ప్రమాణములను చాందాసాహేబు గాలికి ఎగురఁగొట్టినాఁడు.

అంతఃకలహములు, పరరాజులదాడి—వీనియందు తగులొక్కని ఏరాజ్యము ముందుకు వచ్చినది ?

పైఁగా 'సర్వముం గదలంజేయు కాలమూర్తి' కూడ నామె కెదురుతిరిగినాడు.

ఇఁక నామె యేమిచేయఁగలదు? కాలపురుషునకు దోసిలి యొగ్గి కారాగారమున విషముత్రాగి మీనాక్షి దుర్భరజీవితమును దుదముట్టించినది.

మధురనగర దేవత మీనాక్షినామమును ధరించిన మీనాక్షి కాలమున మధురనాయకరాజ్య మస్తమించుట శోచనీయ విషయము.

మహమ్మదీయుని మోసమువలన ఆమె నాశనమైనది. పరిపాలనాకాలమున ముహమ్మదీయుల కెప్పుడును ఆమె అన్యాయము చేయలేదు. పైఁగా వారిమతమున కామె దోహదమిచ్చినది.

తిరుచునాపల్లిలోని నత్తర్ షా మసీదున కామె దానములిచ్చినది. ఫకీరు ఒకఁడొకప్పుడు తనకు రోగమును కుదుర్పఁగా

నామె కృతజ్ఞతాపూర్వకముగ తిరుచునాపల్లికి నెనిమిదిమైళ్ళ ఉత్తరమునగల సమయపురమున మసీదు నిర్మించినది; దాన శాసనము వ్రాయించి యిచ్చినది.

రాగి రేకులమీఁదఁ జెక్కఁబడిన ఆదానశాసన మిప్పటికిని ఆమసీదుఈనాందారువద్ద నున్నది.

ముహమ్మదీయమతమున కామె యింత మేలుచేసినను విధివైపరీత్యమున నామె ముహమ్మదీయుని మోసముచేత నాశనమైనది.

ఈ స మ య ము న నే పెద్దాపురసంస్థానపాలకురాలు రాగమ్మాదేవియు మీనాక్షివలె నొక ముసల్మానుని మోసమునకు గుఱియైనది. దర్శనార్థమని మాయచేసి రప్పించి రాగమ్మ పుత్రులను రుస్తుంఖానుఁడు దారుణముగఁ జంపించినది ౧౭౩౪-వ సంవత్సరమున. మీనాక్షికి సాయముచేతునని కొరానుకు బదులు ఇటికెబొంత శిరమునఁదాల్చి చాందాసాహేబు ప్రమాణముగావించి మోసముచేసినదియు ౧౭౩౪-వ సంవత్సరముననే.

రుస్తుంఖానుని మోసము వెంటనే ఫలమిచ్చినది. చాందాసాహేబు మోసము పండబారుటకు రెండేళ్లు పట్టినది.

వివిధప్రాంతములం దుండిన రమణీమణులయ్యు రాగమ్మయు, మీనాక్షియు నిట్లు ఒకేకాలమున ముసల్మానులచే నొకేరీతిని మోసపోయిరి.

# ౬

# ముత్తమ్మ

ప్రియుఁడు పరలోకగతుఁడైన పిదప సతుల
కనుగమన మెందు నర్హా కృత్యంబు దగిన
తెఱఁగు గావింపఁబనుపుము తీర్చికొనెద
నగ్నిముఖమునఁ బతి వియోగాగ్నియంత.'

—జైమిని భారతము.

భారతసతీత్వమును బ్రహ్మాండముగఁ బ్రపంచమునకుఁ జాటు ప్రాక్తనాచారములలో సహగమన మొకటి. ఈ అనుగమనాచార ముత్తరహిందూస్థానముననే- అందును రాజపుత్రస్థానముననే- విశేషముగ విస్తరించి యుండినదని పలువురి యభిప్రాయము.

కాని నిజ మట్టిదికాదు. రసపుత్రభూమిలో సహగమనాచార మెంతగ విస్తరిల్లియుండినదో ఆంధ్రభూమిలోఁగూడ నది యంతగనే విస్తరిల్లియుండినది. రసపుత్రరమణు లెంతటి నిశ్చింతభావముతో, నిర్భయచిత్తముతో సహమరణాచారమును బాటించియుండిరో ఆంధ్రరమణులును అంతటి నిశ్చింతభావముతోడనే, నిర్భయచిత్తముతోడనే ననుమరణాచారమును బాటించి యుండిరి.

ఆంధ్రులదైన విజయనగరసామ్రాజ్యముననేమి; ఆ విజయనగరసామ్రాజ్యశాఖలైన మధుర, తంజాపురనాయక

రాజ్యములందేమి సహగమనాచారము విశేషముగఁ బ్రబలి యుండెను.

చితాకాష్ఠోద్దీపితములగు వహ్నులతో ఆరాజ్యములు పలుతడవలు ప్రకాశమానములైనవి. అనలముఖమున నిమిష వేదనకు నోర్చి పతితోడిద లోకమని ఏగిన ఎలనాగల నెంద అనో ఆరాజ్యముల చరిత్రలు పేర్కొనుచున్నవి.

అట్లు పేర్కొనఁబడిన పేరటాండ్రలో మన ప్రస్తుత కథకు నాయకురాలైన ముత్తమ్మ యొకతె.

అయితే ఆమె మరణించినపతితో చితాగ్నిశిఖాముఖ మున శరీరమును వ్రేల్చిన చిరంటికాదు. ఆమె సహగమనము చేసిన పరిస్థితియుఁ బద్ధతియు నపూర్వములైనవి; అశ్రుతపూ ర్వములైనవి.

ముత్తమ్మ నామము మన కీవఱకే పరిచితమై యున్నది. ఆమె మధురనాయకరాజ్య పాలకుఁడైన రంగకృష్ణముద్దు వీరప్పనాయకుని అర్థాంగలక్ష్మి; ఆంధ్రరమణీమణులలో నొక తెయైన మంగమ్మకుఁ గోడలు.

ఈసంగతులు మన కింతకుముందే ఎఱుకపడియున్నవి. ౧౬౮౯–వ సంవత్సరమున ముద్దువీరప్పనాయఁడు స్ఫోటకము వలన మరణించుటయు, నప్పటికి అతని భార్య ముత్తమ్మ నెలలు నిండిన చూలాలై యుండుటయు, నాకారణమున నామె యప్ప టికి మంగమ్మ ప్రోద్బలముచే సహగమనోద్యోగమును విర మింపవలసివచ్చుటయుఁ, బ్రసవానంతర మామె సహగమన మొనర్చుటయు మంగమ్మ జీవితకథలోఁ బ్రస్తావింపఁబడి యున్నవి.

అక్కడ ఆప్రస్తావన సూచీమాత్రముగ నున్నది. ముత్తమ్మచరిత్ర అట్లు సూచీమాత్రముగఁ జెప్పి వదలివేయఁ దగినదికాదు. అది ప్రత్యేకము ప్రస్తరింపఁదగిన పరువము, ప్రాముఖ్యముగలది.

కావున నామెకథ విపులముగ వివరింపఁబడుచున్నది. వినుఁడు :

మధుర ఆంధ్రనాయకరాజులు ప్రాయకముగ బహు భార్యాలోలురై యుండిరి. ముత్తమ్మ పెనిమిటియైన రంగకృష్ణ ముద్దువీరప్పనాయఁ డట్లుగాక ఎన్నదగిన ఏకపత్నీవ్రతుఁడై యుండెను.

ముత్తమ్మపట్ల ముద్దువీరప్పనాయనికిఁ బ్రాణాధికప్రేమ. ముద్దువీరప్పనాయనిపట్ల ముత్తమ్మకు నంతియ. పుష్పమునకు వాసనవలె నవినాభావసంబంధమున ముద్దువీరప్పకు ముత్తమ్మ సహధర్మచారిణియై సారమైన సంసారసుఖ మనుభవించు చుండెను.

రాగమయము, శృంగారమయమునైన వారి దాంపత్యమునకుఁ బ్రత్యక్షఫలమును బ్రసవించుటకు ముత్తమ్మ తొలి సారి గర్భవతియయ్యెను. నెలలు ఆఱు, ఏడు అతిక్రమింపఁగా నామెకు వేఁకటిభార మతిశయించుచుండెను.

ఇంతలో ముద్దువీరప్పకు స్ఫోటకము సోఁకెను. ఆ వికృత రోగమునుండి అతనికి విముక్తి లేకపోయినది. అతఁడా వ్యాధి వలన ౧౬౮౯-వ సంవత్సరమున మరణించినాఁడు.

జీవితేశ్వరుని అస్తమయముతో ముత్తమ్మ కొక్క సారిగా మిన్నువిఱిగి మీఁదఁబడినట్లయ్యెను. అప్పట్టున

నాయెకు రెండవయాలోచన తోచలేదు. పతితో ననుమరణము పొంది తీరవలెనని ఆమె నిశ్చయించెను.

స్ఫోటకమువలన మరణించినవారిని ఖననముచేయుటయే కాని దహనముచేయరు. కాఁగా నాయెకుఁ బతితోడఁ జితారూఢయై యగ్నిశిఖల నపగతప్రాణయగుటకు వీలులేదు.

అంతమాత్రమున నాయెమ సహగమనోద్యోగమును విరమింపలేదు. ఖననసంస్కారమే కాని దహనసంస్కారములేని బసవమతస్థులు విజయనగరసామ్రాజ్యమునఁ బతితో నాతని పత్నిని గూడ ఖననముచేయుట అనుమరణపద్ధతిగ నేర్పఱచి యుండిరి.

తన అప్పటిస్థితిలో ఆపద్ధతి నవలంబించుటకు ముత్తమ్మ కృతనిశ్చయ యయ్యెను.

సహమరణపద్ధతిని గురించి నిశ్చయమైనది. ఇఁక నాయెమ అత్తయగు మంగమ్మ యనుమతిని బడయవలసియున్నది.

తనభర్త చొక్కనాథనాయఁడు మరణించినప్పుడు అతనితో ననుమరణమునొందక ఆచారమునుమీరియున్న మంగమ్మ కోడలిని- నెలలునిండిన చూలాలిని,- రాజ్యమునకు వారసుని ప్రసవించగల రమణిని- సహగమనము చేయనిచ్చునా ?

సహగమనవ్యవసాయమున నితరమగు సర్వమును విస్మరించియున్న కోడలు ముత్తమ్మను సమీపించి మంగమ్మ సానుభూతిపూర్వకముగ నిట్లు చెప్పినది.

'బిడ్డా! నీ సంకల్పమును నేను తెలిసికొంటిని. ఈసందర్భమున నా ఉపదేశమును నీవు సావధానచిత్తముతో నాలింపవలసియున్నది.

నీమామగారు చొక్కనాథనాయనివారు మరణించు సరికి నేను గర్భవతినై ఉంటిని. నీభర్తను ప్రసవించినపిమ్మట పలువత్సరములకుఁగాని నాకు తిరిగి గర్భము కలుగలేదు. ఎడమై ఎన్నోసంవత్సరములకు గర్భమువచ్చినదిగదాయని నేను అనంతసంతోషమునఁ బొంగుచుండఁగా పాపఫలమున భర్తృహీనను గావలసివచ్చినది.

గర్భవతినై యుండియు నిప్పుడు నీవలె నప్పుడు నేనును సహమరణమునకు సంసిద్ధనైతిని.

కాని పెద్దలు తఱిమిచెప్పి యప్పుడు నన్ను సహమరణోద్యోగమునుండి విరమింపఁజేసిరి. అనంతరము ప్రసవమైతిని. మగబిడ్డ పుట్టెను. కాని అక్కరకురాలేదు.

అందుతో వంశమున కంతకు నీభర్త యొక్కఁడే ఆధారమైనాఁడు. ఇప్పుడు అతఁడును కఱవైనాఁడు. ప్రస్తుత మీఁక నీగర్భస్థమైయున్న శిశువే ఈవంశమున కెల్ల యాధారమై యున్నది.

ఈస్థితిలో నీవు సహగమన మొనర్తువేని మనవంశ మింతతో నిర్వంశమై పోఁగలదు. కులపాలికవు కాఁదగిన నీవిప్పుడు చితాగ్నియందు తనువెరియఁజొఱఁబడుచో నిఁకమా కేమిదారి?"

వాచాప్రాగల్భ్యము మెఱయ మంగమ్మ యిట్లు వచించినది. కాని ఆవాచాప్రాగల్భ్యమునకు ముత్తమ్మ ముగ్ధురాలు కాలేదు.అలనాఁడు సహగమనముచేయక సజీవయైయున్నందుకు ముత్తమ్మకు అత్తపట్ల కొంత అలసభావముకలదు. ఇపుడు తన సహగమనమునకు ఆమె అడ్డువచ్చుచుండుటతో అలసభావమునకు ఆగ్రహము తోడైనది. అగుట ముత్తమ్మ యిట్లుచెప్పినది:

'అత్తా! నీవు ఆరితేరిన గుణాఢ్యవే ఐనను యోషిద్ధర్మములు నాకుఁ జెప్పనక్కరలేదు. విధవనై నేను జన్మనొల్లను. కాఁగా సహగమనము చేయకమానను. ఈప్సితార్థమునకు జాఱుచున్న నాహృదయరుచిని చీకాకు పఱచకుందువుగాక!'

అవంధ్యప్రతిజ్ఞయైన ముత్తమ్మ ఇట్లు పలుకఁగా మంగమ్మ విచారఖిన్నయైనది. రాజవంశము నిర్వంశమగుట కామె కెంత మాత్రమును ఇష్టములేదు. అగుట నామె మఱియొకసారి కోడలికి నచ్చజెప్పఁదలఁచి యిట్లు వచించినది.

'బిడ్డా! నీవు సహగమనమును తలపెట్టినది భర్త నభ్యుద్ధరించుటకేగదా? అయితే అతనిని పున్నామనరకమునుండి కూడ నభ్యుద్ధరింపవలదా? అతనికిఁ బుత్రుని ప్రసాదింపక నీవు పంచత్వము నొందుచో నతఁడు పున్నామనరకము నెట్లుత్తరింపఁ గలఁడు?'

ఈప్రశ్నము ముత్తమ్మ నొక్కసారిగఁ గలచివైచినది. తాను ముద్దువీరప్పకు మనఃప్రియ, ధర్మపత్ని. అగుట అతనిని పున్నామనరకమునుండి యుద్ధరించుటయు నవశ్యకార్యమే. ప్రసవించిన పదపడి సహగమనముచేయుచో రెండు లాభములును ఒనగూడును. '

ఈవిధమైన ఆలోచనతో నామె ప్రతిన కొంచెము పలుచబడినది; మనస్సు కొంచెము మెత్తపడినది. అందుచే నామె మంగమ్మ వైచిన ప్రశ్నకెట్టి సమాధానమును జెప్పక నీళ్లు నమలినది.

అదను, పదను బాగుగ నెఱిఁగిన అనుభవజ్ఞురాలు మంగమ్మ అప్పుడు ముత్తమ్మతోఁ జల్లగా నిట్లు పలికినది.

'బిడ్డా! అనుమరణదీక్షను అసలే విడనాడమని నేను చెప్పుటలేదు. ప్రస్తుత మాపుము. ప్రసవానంతరము దానిని గుఱించి యోచించుకొనవచ్చును.'

ఆమాటలకు ముత్తమ్మ తోడనే ఇట్లు ప్రతివచనములు పలికినది. 'ప్రసవానంతర మింక యోచనఏమున్నది ? అప్పుడు తప్పక సహగమనము చేయనిచ్చెదమనుచో ప్రస్తుత మా ప్రయత్నము విరమించెదను. లేనిచో నిప్పుడే అనుగమనము చేయుదును.'

ప్రస్తుత మాప్రయత్న మాపగలిగినచో దరువాత చూచుకొనవచ్చునని అప్పుడు మంగమ్మ ముత్తమ్మ చెప్పినదాని కెల్ల వల్లె యన్నది. అందుమీద ముత్తమ్మ అప్పటికి సహగమన ప్రయత్నమును విరమించి దిన మొక యుగముగా గడుపుచు ప్రసవసమయమునకై నిరీక్షించుచుండెను.

కొద్దిదినములకు ముత్తమ్మ ప్రసవించినది. మగబిడ్డ పుట్టెను. ముత్తమ్మయు, మంగమ్మయు వంశోద్ధారకుఁ డవత రించినందు కనంతముగ నానందించిరి.

ఆ ఆనందములో ముత్తమ్మ సహగమనప్రయత్నము నేమఱగలదని మంగమ్మ ఆశించినది. కాని యట్లు కాలేదు.

నీళ్లాడిననాఁడే ముత్తమ్మ సహగమనమునకు అత్త అను జ్ఞను కోరినది. మంగమ్మ మఱునాఁటికి వాయిదా వేసినది. మఱునాఁడును అట్లే యయ్యెను. మూఁడవనాఁ డడుగఁగా నాలుగవనాఁటికి వాయిదా పడినది.

రేపు, రేపు శబ్దములతోఁ జీకాకు పుట్టి నాలుగవనాఁడు ముత్తమ్మ గట్టిపట్టు పట్టినది.

అప్పుడు మంగమ్మ సానునయవచనములతో నిట్లు చెప్పి నది. 'బిడ్డా! కళ్లువిప్పని ఆ కసుగందును జూడుము. పురుటిరోజు లైన వెళ్ళని ఆనెత్తురుకందును మాతృహీనను చేయుదువా?'

తన సంకల్పము సిద్ధింపకుండఁ జేయుటకై వేయఁబడు ఈప్రశ్నము నామె చెవినిబెట్టలేదు. 'ఈబిడ్డను సాఁకుభార మిఁక నీది. నా కిఁక ఇహలోకచింత లేదు. ఈనాఁడు నే నెట్లయిన సహగమనముచేసి తీరెదను' అని అవంధ్యప్రతిజ్ఞ యై ముత్తమ్మ పలికినది.

పథ్యమైన పుచ్చుకొనని పచ్చిబాలెంతరా లామె. సహ గమనముచేయనిచ్చుట యెట్లు? అందును సహగమనాచారము మంగమ్మ కంతగాఁ బట్టలేదు.

అగుట ముత్తమ్మ కెట్లులైన సహగమనావకాశము లేకుండ చేయవలయునని మంగమ్మ దీక్షవహించినది.

మంగమ్మ నిజహృదయ మప్పటికి ముత్తమ్మకుఁ దెలిసి వచ్చినది. కాఁగా నిఁక నెంతమాత్రము జాగుసేయకూడదని ఆమె నిశ్చయించినది.

అయితే మంగమ్మ ఆజ్ఞ లేనిది తనకుఁ జితి ఎవరు పేర్చె దరు? ఆమె కేమియుఁ దోచినదికాదు. నిస్పృహ నేత్రములతో నామె పురుటిగదియంతయుఁ గలయఁజూచినది. ఒకమూల మేజాపైఁ బన్నీటితో నిండిన పన్నీరుబుడ్డి యొకటి యామెకుఁ గనిపించినది.

చితాగ్నిశిఖాముఖమున శరీరముఁ వ్రేల్చి అపగతప్రాణ యగుటకుఁ దనకు వీలులేకపోవుగాక—గదియందేయుండి సాధ నాంతరముతో మరణమును వరించుచో నెవ రడ్డఁగలరు?

'పన్నీరుత్రాగినచోఁ జలువఁజేయును. నవప్రసూతలు చలువఁజేయు వస్తువులను దరికిఁ జేరనీయరాదు. వారికిఁ జన్నీటిని త్రాగుటకైన అనుమతిలేదు. అట్టివారు పన్నీరమును త్రాగుచో సూతికావాతము ప్రకోపించి వారిని చంపఁగలదు. ఇఁక సందేహింపనేల?'

పన్నీరుబుడ్డిని చూచినతరువాత ముత్తమ్మ కిట్టి తలఁపులు గలిగెను. కలుగుటయే తడవుగ నామె ఆ గొజ్జఁగినీటినంతయు నొకచుక్కయైన మిగులకుండ గడగడ త్రాగివైచినది.

హిమాంబువులు పానముచేసిన జాముకే ఆనాలుగురోజుల పురుటాలికిఁ జలువలు క్రమ్మినవి; కాళ్లుచేతులు చల్లబడినవి; సూతికావాతము ప్రబలి ఆమె అసువులు తీసినది.

విశాలవిశ్వమున సహగమనాచారసస్యమునకు భరతఖండ మొక్కటే కేదారక్షేత్రము. ఆక్షేత్రమునఁ బండిన సహగమనములు సంఖ్యాతీతములు. సంఖ్యాతీతములైన అట్టి సహగమనములలో ఆంధ్రరమణి ముత్తమ్మ చేసిన సహగమనమువంటి సహగమనము మఱియొకటి కానరాదు. ఇచ్ఛాపూర్వకమైన ఈ యనుమరణముతో నితరములు దొరయుపాటివి కావు.

'తండ్రివంశంబునం దేడు తరములకును
దల్లివంశంబునం దేడు తరములకును
ధవునివంశంబునం దేడు తరములకును
శాశ్వతస్వర్గ సౌఖ్య మీఁజాలు సాధ్వి.'

—కాశీఖండము.

౭

# సంగమ్మ

'ఎఱుక చాలనివాఁ డంద మే దధీచి,
నల్పబుద్ధులె మేఘవాహనుఁడు, శిబియు
ధరఁ 'బరోపకారార్థ మిదం శరీర'
మనెడు వాక్యంబు వినవె ? సంయమివరేణ్య !
అధ్రువంబైన మలభాండమైన దేహ
మనఘ! యన్యోపకారార్థమై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతరధ్రువమునైన
కీర్తి కాయంబుఁ గైకొంట కార్తి యేల ?'

—హరవిలాసము.

చిఱుతొండనంబి చిరంటి తిరువెంగనాంచి కడుపునఁ బుట్టిన కూరిమి కొడుకును, సుకుమారమూర్తిని, కులవర్ధనుని, సిరియాళుని చిత్రవధచేసి శివయోగికి ఓగిరముగా వండిపెట్టిన పురాణకథ ప్రఖ్యాతమై ఉన్నది.

ఆపురాణకథతోఁ బురుడించు ఆంధ్రచారిత్రకగాథ యొకటి ఇచట ప్రస్తరింపఁబడుచున్నది.

ఈ కథానాయక నామము సంగమ్మ.

చిఱుతొండని చిరంటివలె సంగమ్మయు నసామాన్యమైన పుత్రస్నేహమును దిగఁద్రావినది; చెక్కుగీటిన పసవల్పు చిఱుతవాని చిత్రమరణమును ధైర్యచిత్తముతో నోర్చినది.

పరార్థమై తనూధనమును, సంతానధనమును వ్యయింపఁగలుగుటయే జనన్త్రైకఫలమను స్తవనీయవిశ్వాసముతో నపూర్వమైన ప్రాణత్యాగ మొనర్చి అంధ్రమహిళ సంగమ్మ లోకారాధనీయ యైనది.

కావున ఆపూజ్యురాలి పుణ్యచరిత్రమును విని పునీతులుగండు.

విద్యానగరరత్నసింహాసనాధీశ్వరుఁడైన ప్రౌఢ దేవ రాయల సరదారులలో గోన కాటారెడ్డి ఎన్నికగన్నవాఁడు. కులమునకు ఆతఁడు తెలగ. అతనిది మిడిమెల్ల గోత్రము. కాటారెడ్డిచేసిన సేవకు మెచ్చి రాయలవారు మగదత్తి, రాయచూరు అను గ్రామములందు కోటలు నిర్మించుటకు ఆతనికి ఆజ్ఞనిచ్చిరి.

రాజాజ్ఞ తలనిడుకొని కాటారెడ్డి మొదట మగదత్తిలో కోటకట్టుటకుఁ బ్రారంభము చేసెను. పని చురుకుగా జరిగెను. బురుజులుతీరి కోట అచిరకాలముననే పూర్తియయ్యెను. అనంతరము కాటారెడ్డి రాయచూరుగ్రామమున కోటకట్టుటకు మొదలిడెను.

శుభముహూర్తమున దుర్గనిర్మాణమునకు శంకుస్థాపన జరిగెను. పునాదులు ఏర్పడినవి. గోడలు లేచినవి. కాని బురుజు పని తుదముట్టలేదు. పూర్తి కాకుండగనే అది నేలకూలెను. అంతమాత్రమున కాటారెడ్డి నిరుత్సాహపడలేదు. తిరిగి పని ప్రారంభముచేసెను. కాని ఈ మాఱుకూడ బురుజు నిలబడ లేదు. రెడ్డికి అనుమానముతోఁచెను. అయినను మఱల నాతఁడు

బురుజుపని రెట్టింపు కట్టుదిట్టములతోఁ జేయించెను. కాని కార్యము లేక పోయినది.

తిరిగి బురుజు నేలమట్టమయ్యెను. ఇట్లు నాలుగైదు సారులు జరిగెను. అందుతో కాటారెడ్డికి అనంతమగు విచారముకలిగెను. తుదిప్రయత్నముగా అతఁడు మఱల బురుజు నిర్మించుటకు దొరకొనెను. అప్పుడచ్చట పనిచేయువారిలో నొక కాఁపువానికి శివమెత్తెను. ఆవేశము కనుపించిన పురుషుఁడు కాటారెడ్డితో నిట్లు పలికెను.

“నే నొక మహాశక్తిని. చిరకాలముగా నీ ప్రదేశమును ఆశ్రయించుకొనియున్నాను. బలియిచ్చి నన్ను తృప్తి పఱచిగాని మీ రిచ్చట కోట గట్టలేరు. మీరు నాకు బలి ఈయనికారణమున బురుజును కూలఁద్రోయుచున్నాను. నాకు సాధారణమైన బలితో సంతృప్తికల్గదు. ఒక బాలెంతను ఆమె కనిన బిడ్డతోఁగూడ నాకు బలినీయవలెను. ఇచ్చెదరా బురుజు నిలుచును. ఈయరా మీ రీజన్మమున నిచ్చట కోట నిర్మింపఁ జాలరు.”

కాటారెడ్డి యిది వినెను. దీర్ఘవిచారపరీతమైన ఆతని మనము ఆలోచనాధీనమయ్యెను. కోట నిలబడుటకని ఏస్త్రీ వచ్చి శిశుసహితముగ బలిపోవును? ప్రాణములపై తీపిని చంపుకొనుటకు కొందఱు సాహసింప వచ్చును. కాని కడుపార గన్న బిడ్డను మృత్యుముఖమున చేతులార నర్పించుటకు ఏతల్లిప్రాణ మంగీకరించును? ఇంత ప్రయత్నము చేసి దుర్గనిర్మాణమును పూర్తి చేయక పోయి అతఁడే మొగముతోఁ దిరిగి తన

యేలికయగు ప్రౌఢదేవరాయలను దర్శింపఁగలఁడు? ఎన్నివిధ ములఁ చింతించినను అతనికి ఆలోచన తెగలేదు.

కోటలోనున్న మహాశక్తి శిశుసహితముగ నొక బాలెంత రాలిని బలిగోరుచున్న వార్త జలతైలబిందువై రాయచూరు గ్రామమున మారుమూలలయందుఁ గూడ వ్యాపించెను. తుద కాసంగతి పురుటిమంచముపైనున్న తెలగవారిచిన్నది సంగమ్మ చెవికిఁగూడఁ జేరెను. ఆమె అప్పటికి మూఁడుదినములకుఁ బూర్వము ప్రసవించియున్నది. కోట కట్టుటకు కాటారెడ్డి చేయుచున్న సకలప్రయత్నములును బూడిదలోఁ బోసిన పన్నీరగుచుండుట ఆమె గమనించెను. కోటతీరినచో నది ప్రజ లకు మిక్కిలి ఉపకారిగా నుండగలదని ఆమె నిజమూరసెను.

"చావు ఎప్పటికైన తప్పనిదే. జరాభారమున క్రుంగి, రోగములచే ప్రమంది జీవితమును నిరర్థకముగా తుద ముట్టించు టకంటె ప్రజాభ్యుదయమునకై ఇప్పట్టున మరణమును వరిం చుట ఉత్తమము; కీర్తిదాయకము" అని త్యాగమహితము, పరార్థప్రవణము అగు బుద్ధిగల సంగమ్మకుఁ దోచెను. తన డొక్కలోదూరి పరుండియుండి అప్పుడప్పుడే నేత్రములను విప్పి లోకమును గాంచుచున్న ఆ నెత్తురుకందు నొక్కసారి యామె తిలకించెను. "ఈప్రజోపయోగకార్యమునో నా చిట్టిబిడ్డకూడఁ బాల్గొనుగాక! పసరుమొగ్గకు దేవతాపీఠమున స్థానము లభిం చునుగాక!" అని ఆమె నిష్కర్ష చేసికొనెను.

పొత్తులలో పాపనిడుకొని ఆ పచ్చిబాలెంతరాలు కోట చెంతకుఁబోయెను. నిజపుత్రసహితముగ నామె నిస్త్రింశభావ

ముతో, నిరాకులాత్మతో, నిశ్చలబుద్ధితో, నిర్వికారాకార ముతోఁ బునాది గోతిలో దుమికెను.

అప్పట్టున నామె సంసారభ్రమ మించుకేనియుఁ బొంద లేదు; వైక్లబ్యము వీసమంతయిన నొందలేదు. పుత్రునిపట్లగల ప్రేమస్నేహవాత్సల్యసంపద నంతను దిగఁద్రావినది.

ఆసన్నమైన సప్రాణసమాధిసంగతి నెఱుఁగక తన పొత్తిళ్ళలోనుండి పాలబుగ్గలను లేఁతనవ్వుతో రాణింపఁజేయు చున్న చిఱుతవాని చిన్నారివదనమును జూచిన పిమ్మటనైన ఆమె కన్నులు చెమ్మగిల్లలేదు; చెక్కుటద్దములు వికాసము దప్పలేదు.

కందక, గాజువాఱక ఆమెకళ్లు, చెక్కిళ్లు యథాపూర్వ ముగ మధురమందహాసనిష్యందముతో నొప్పారుచుండెను.

అప్పుడు కూలివాండ్రు చుఱుకుగా ఆపునాదిలో ఆమా తాశిశువుల పైన ఇటికలుపేర్చి గోడలుకట్టిరి. గోడలు లేచెను. బురుజు తీరి చెక్కుచెదరక నిలచెను. క్రమముగా మిగిలిన బురుజుల నిర్మాణముకూడఁ బూర్తియయ్యెను; దుర్గము సర్వాంగపరిపూర్ణశోభతో విలసిల్లెను.

సంగమ్మ చేసిన అపూర్వత్యాగము దేనికి రూపసిద్ధి కల్పించినదో ఆరాయచూరుదుర్గమునుండి ప్రభుత్వము సాగించి కాటారెడ్డి కాటభూనరేంద్రుఁడని ప్రసిద్ధిచెందెను. తన అభ్యుదయమునకు సంగమ్మ త్యాగము మూలదుంప యన్న సంగతి రెడ్డి ప్రాణము లున్నంతవఱకు విస్మరింపలేదు.

మహాత్యాగిని సంగమ్మ శిశుసహితముగా బలిపోయి నిలిపిన బురుజు యిప్పటికిని ఆమెపేరిట 'శాలెంత సంగమ్మకోట' అని వ్యవహరింపఁ బడుచున్నది. త్యాగధనుల పవిత్రనామములు అక్షరమను సూత్రము నీవిషయము ప్రతిపాదించుచున్నది.

సంగమ్మ త్యాగము అతిలోకమైనది. పరోపకారార్థము ప్రాణత్యాగ మొనర్చిన రమణీమణులు ఇతిహాసప్రపంచమునఁ బలువురుగలరు. కాని శిశుసహితముగ బలిపోయినవారు మిక్కిలి తక్కువ. తల్లికిఁ దన ప్రాణముమీఁద కంటె తన బిడ్డ ప్రాణముమీఁద మమకారము హెచ్చు. అట్లుండుట ప్రకృతి సిద్ధము. లోకసహజమైన అట్టి మమకారమును గూడ తెగ గోసి లోకోపకారార్థము శిశుసహితముగ ప్రాణములను విడిచిన తెనుఁగుపడఁతి సంగమ్మ త్యాగబుద్ధి కొలఁదులు వెట్టఁదరము కానిది. ఆమె సాహసము శతథా శ్లాఘింపవలసినది.